*First Edition :* 5,000 Copies.
MARCH 1960.
PRICE Rs. 1·50

# CHAINA JAPAN PRASIDDHA KATHALU

SELECTED STORIES FROM CHINA AND JAPAN

## CHINESE STORIES

1. The White Monkey - Ananymous.
2. The Tiger - Li-Fu-Yen.
3. The Wolf of Chungshan - Hsieh Liang.
4. Chastity - A Popular anecodte.



## JAPANESE STORIES

1. Han's Crime - Shiga Naoya.
2. Hell Screen - Akutagawa Ryunosuka.
3. A Tale of Three Who Were Blind - Izumi Kayoka.
4. The Mole - Kawabata Yasunari.



---

**Published under the auspices of**
**The Southern Languages Book Trust, Madras 31.**
TELUGU 52

---

*Translated by :*
SURABATTULA SUBRAHMANYAM.

*Published & Printed by :*
SHIVAJI PRESS, SECUNDERABAD.

# ప రి చ య ము ....

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా. విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణభాషా పుస్తక సంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింపజేసింది. ఆ ప్రచురణల వలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడ భాషలలోకి అనువాదం చేయించి ప్రచురింపజేస్తూంది. పాఠకులలో భిన్న భిన్న అభిరుచులకు తగినట్లు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నిక చేశారు. అందువల్ల, మానవ జీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవిత చరిత్రలు, వారు చేసిన ఘనకార్యాలను విపరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథ పరంపరలో ఒక శాఖ. మన దేశ శ్రేయస్సు కోసం అభ్యుదయం కోసం ఆ మహాపురుషులు ఏమిచేసినది, వారికి తామెంత ఋణపడి ఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించడానికి వారెన్నెన్ని పాట్లు పడినది — ముందు తరాల వారంతా తెలుసుకుని ఉండటం మంచిదిగద.

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం - ఈ గ్రంథ పరంపరలోని ఇతర శాఖలు. కథానికలు, ప్రాచీన కళా సంపదలను అభివర్ణించే గ్రంథాలు కూడా ఇందులో ఉండటం ముదావహం. నాటక్యకళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నిరతాద్భుతావహములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాసదాయకములైన భిన్న భిన్న విషయాలను గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆ విధంగా ఇట్టి ప్రచురణలకు ముందు ముందు విస్తార ప్రచారం కలుగగలదని నా విశ్వాసం

దక్షిణ భారత భాషలలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకి అనువదింప జేయటం ఈ ద్వితీయ గ్రంథ పరంపరలోని మరొక ప్రశంశనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు, విద్యావంతులలో ఎక్కువ మందిని వివిధ విషయాలను గురించిన జ్ఞానాసక్తిగల పాఠకులుగా ఆకర్షించి, ఆ జ్ఞాన పిపాసను తృప్తిపరచటానికి యోగ్యమైన గ్రంథాలను కూడా వారికి అందజేసినట్లు అవుతుంది.

దక్షిణభాషా పుస్తక సంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలం కాగలవని ఆశిస్తున్నాను.

ఇట్లు,
ఏ. లక్ష్మణస్వామి మొదలియార్,
వైస్ ఛాన్సలర్,
మద్రాసు విశ్వవిద్యాలయము.

మద్రాసు,
9-10-1958.

# ముందుమాట

ఈ చిన్న పొత్తములో మన పొరుగుననున్న చైనా జపాన్ మహాదేశముల కథానికలున్నవి. పురాతనమైన చైనా యొక్కయు, అధునికమైన జపాను యొక్కయు కళా సంస్కృతుల కీ కథలు ప్రతిబింబములు. ఇందలి చైనా కథలను చైనాదేశపు గొప్ప పండితుడు, రచయితయునగు లిన్‌యుటాంగు యొక్క "ప్రసిద్ధ చైనాకథానికలు" అను గ్రంథమునుండి తీసుకొన్నాము. ఇతడు "నా దేశము, నా ప్రజలు", "జీవిత ప్రాధాన్యము" అను గొప్ప గ్రంథములు వ్రాసిన సుప్రసిద్ధుడు. తన "ప్రసిద్ధ చైనా కథానికల" పీఠికలో లిన్‌యూటాంగు ఇట్లు వ్రాసెను. "ఈ కథల నింగ్లీషులోనికి తర్జుమాచేయుటలో నేను వట్టి అనువాద కునిగా పనిచేయలేదు. ఒక్కొక్కసారి అనువాద మసాధ్య మనిపించేది. చైనా కథకులు పూర్వ కథలను తీసుకొని తిరిగి చెప్పుటలో ఎంత స్వాతంత్ర్యము చూపిరో అంతమాత్రము స్వాతంత్ర్యమే నేనును నా అనువాదమునను తీసుకొంటిని. చారిత్ర కాధారములేని విషయముల నే నదనముగ చేర్చలేదు."

దీనిలోని చైనాకథ "తెల్లకోతి" వ్రాసిన వాని పేరు తెలియదు. ఇది క్రీ. శ. ఆరవ శతాబ్దము నాటిదని నమ్మకము. దీనిలో ఆదిమవాసుల నాయకుని గూర్చి చెప్పబడినది. పద్దెనిమిది ఇరవై సంవత్సరాల మధ్య వయస్సుగల ఆడపిల్ల లను అతడెత్తుకొనిపోయెడివాడు. చైనాసేనాని వాంగ్ భార్యనుకూడ ఇతడు తన దుర్భేద్యస్థావరాని కెత్తుకొనిపోయి పెండ్లాడెను. ఆమెను వెదుకుకొనుచు వచ్చిన వాంగ్‌నకు ఆతిథ్యమిచ్చెను. విలువిద్యలో పోటీ నడిపి, గెలిచి, పోటీ షరతు ప్రకా రము తన వద్దనే యామె నుంచుకొనెను. వాంగ్‌కు బిడ్డలు లేరు. ఒక సంవత్సరము తరువాత వాంగ్ తిరిగి భార్యను సందర్శించేసరి కామె ఒక బిడ్డను కనును. తిరిగి వాంగ్‌తో నాగరక ప్రపంచములోనికి వచ్చుట కామె యంగీకరింపదు. "ఉండి పోతానంటావా? నాయకుణ్ణి ప్రేమిస్తున్నావా, యేమిటి?" అని వాంగ్ ఆమె నడుగుతాడు. "ఏమో, నా కదంతా తెలియదు. అతడు నా బిడ్డకు తండ్రి. నీవు వెళ్లిపో. నా కిక్కడ హాయిగానే ఉంది," అనినది భార్య. దానితో కథ ముగిసి పోవును. వాంగ్ ఆ దెబ్బకిక తేరుకొనలేడు. "తెల్లకోతి" చక్కని కథ, ఆటవిక నాయకుని పాత్ర చక్కగా చిత్రింపబడింది.

'పవిత్రజీవనం'మనోహరమైన కథ. వాడుకలోనున్న ఒక ఉదంతాన్ని తీసికొని లిన్‌యుటాంగు కథగా పెంచి పోషించాడు. తన పవిత్ర దీర్ఘవైధవ్య పాలనా గౌర వార్థమొక శిలాతోరణం కట్టించుకొనుట కంటె తన విశ్వాసపాత్రుడగు తోటమాలిని పెండ్లాడి సుఖజీవనము గడపుటకే ఒక వితంతువు కాంక్షించును. "నీది పవిత్ర వైధవ్యమంటావు. అది వట్టి గుల్ల జీవితం. దాంట్లో మెచ్చుకోతగ్గది నాకేమీ కన బడలేదు" అని తన కూతురే అన్న మాటలతో ఆమెకు కనువిప్పయినది. పెండ్లాడ నిశ్చయించుకొన్నది. "ఆడదాన్ని గూర్చి ఇదమిత్థమని ఎన్నటికి చెప్పలేం" అనే తాతగారి వాక్యంతో కథ ముగుస్తుంది.

విచిత్ర కల్పనగల హాస్యకథానికలకు తార్కాణము "పెద్ద పులిగా మారిన పెద్ద మనిషి" అనే కథ. ఛాంగ్‌ఫెంగ్ పెద్దపులిగా మారిపోవును. పరిపాలనా శాఖాధికారి ఛాంగ్‌ఛిన్‌ను తినేస్తాడు. కాని తుదకు భగవంతుని దయవల్ల ఛాంగ్‌ఫెంగ్‌కు తిరిగి మనిషి రూపం వస్తుంది.

మనకున్న కథలలో అతి పురాతన కాలమునాటి వీ చైనా కథలు. విశేషము తీరికగల ఆ పూర్వయుగములలో పుట్టిన కథ లివి. వాఙ్మయములో ఒక శాఖగా కథానిక ఆదికాలంనుండి ఉన్నదే. ఒక జాతి బాల్యము వ్యక్తి బాల్యము వంటిదే. ఉభయత్రా కథలమీద అపేక్ష మెండు. మహాపురాణములలోని శకుంతలోపాఖ్యానము, హరిశ్చంద్రోపాఖ్యానము, నలోపాఖ్యానము ప్రపంచకథలలోనే రమణీయమైనవని చెప్పవచ్చు. నేడు మనము పరిపుష్టమైన వస్త్వైక్యము, దృశ్యకావ్యముయొక్క పటుత్వ ము గల స్వల్పమైన వచనరచనను కథానిక అనుచున్నాము. జీవితములోని ఒక అంశ మును తీసుకొని కథానిక దృశ్యకావ్యమువలె సంచలనాత్మకముగా కన్నులకు కట్టినట్లు ప్రదర్శించును. ఆ జీవితాంశము జాలి, కరుణలకు సంబంధించినవి కావచ్చును. అను రాగమునకో పరిహాసమునకో సంబంధించినది కావచ్చును. ఏదైనను కావచ్చు. "ముప్పై తొమ్మిది సోపానము"లను కథ వ్రాసిన కథకుడు విమర్శకుడునగు జాన్ బుఛాన్ కథానిక గూర్చి ఇట్లు వ్రాసెను: "ఏదో ఒక చిన్న ఉదంతము ఎత్తు కొనవలెను. కథకు మూలబీజము సంక్షిప్తముగా, సులభముగా నిర్వచించుటకు వీలుగ ఉండవలెను. బహుముఖ జీవితము ప్రదర్శించి నట్లుండక, ఒక్క చైతన్యవంతమైన క్షణములో జీవితమును దర్శించి నట్లుండవలెను. పద్యకావ్యములలో కథానికకు సన్నిహితమైనది సంక్షిప్త భావగీతము, విస్తృతమైన పురాణ రచనకాదు." మన

హిందూదేశ భాషలలో ఇట్టి కథానిక లంతకంతకు విరివిగా బయలు దేరుచుండుట ఉత్సాహజనకము.

ఈ పుస్తకములోని చివరి నాలుగు జపాను కథలు ఆధునిక రచనా విధాన మునకు జెందిన కథలు. ఇవి పందొమ్మిది, ఇరవై శతాబ్దముల కథలు. "ముగ్గురు గ్రుడ్డి వాళ్లు" అను మనస్సును కదలించు కథను వ్రాసిన ఇజూమీకియోకా 1939 లో మరణించెను. "హాన్ చేసిన నేరము" అనే మనస్తత్వ సంబంధమైన కథ వ్రాసిన షిగానోయా 1883 లో జన్మించెను. జపాను దేశపు ఆధునిక రచయిత లలో అతి ప్రముఖుడు ప్రభావ సంపన్నుడని పొగడ్తపొందెను. "తక్కిన ఇద్దరు రచయితలలో అకుటగావా ర్యూనొసూకే ఈశతాబ్దములోనివాడు; కవబాటాయాసునారి 1899 లో పుట్టెను. ఈ శతాబ్దములోనే రచయితగా ఆరితేరాడు. 1868 నుండి "జపాను రచయితలు పాశ్చాత్య రచనలనుగూర్చి తెలుసుకొనుటలోను, అను కరించుటలోను నిమగ్నులైనారు". జపాను రచయితలు వారి ఆంగ్లభాషా జ్ఞానము వల్ల, తద్ద్వారా ప్రపంచ వాఙ్మయజ్ఞానమువల్ల ప్రభావితులయిరి. ఇందలి జపాను కథ లీ ఫలప్రదమైన సంపర్కము యొక్క వికాసములు.

"ముగ్గురు గ్రుడ్డివాళ్లు" అను మొదటి కథ తమ కండ్లు పొడుచుకొనిన ప్రేమికుల విషాదాంత గాథ. ప్రియురాలు తన్నొక దయ్యము వెంటాడుచున్నదను భ్రాంతిలోపడును. ఆ దయ్యము ఎవరిదైనా "నీడను నాలికతో నాకితే ఆ మనిషి అణగారిపోతాడు. అది నీడను దూరంగా ఊదేస్తే మనిషి చచ్చిపోతాడు", అనే మూఢ భయ విశ్వాసాలతో కనులలో మందులు క్రుమ్మరించుకొని, దయ్యమును చూడకుండవలెనని దృష్టి పోగొట్టుకొనును. ఆమెతోడనే కాలము గడప నిశ్చ యించుకొనిన ప్రియుడు తన చేతులతోడనే తన కనులలో సూదులు గ్రుచ్చుకొని అంధుడగును. రాత్రివేళ ప్రియురాలి సమాగమము కొరకు పరుగెత్తుచున్న ప్రేమికు నాపి అంధుడైన ప్రియుడే తన కథ చెప్పుకొనును. అతని వెనుకనే అంధ ప్రియు రాలు, మరొక అంధుడు నుందురు. ఈకథ వ్రాసిన ఇజూమీక్యోకా గొప్ప గద్య రచయిత అని ఆధునిక జపాను కథల సంపుటీకరణ మొనర్చిన డోనాల్డు కీని పొగి డెను. ఆరచనా విశిష్టత చక్కని అనువాదములో కొంత ద్యోతకమగును. శకగామీ నాపిన ఆ ముగ్గురు గ్రుడ్డి వారిలో నొకతెయగు అంధప్రియురాలు కథలో ఒక్క

సారికూడ మాట్లాడదు. కాని ఆమె అనుభవించిన ఆవేదన ఆమె ముఖములోనే ప్రతిఫలించును. రచయిత ఆమె నిట్లు వర్ణించెను. "పిండి మంచులాగ ఉన్న చర్మం ఆవిరికి కరిగి పోతుందా అన్నట్లుంది. ఆ దేహం మీద ఎర్రసాటిన్ గౌను, పచ్చటి రిబ్బన్, సాటిన్ వక్షంమీద జారిపోతున్నట్టుంది. అది వర్షాకాలానికి తగిన గౌను నల్లటి కాసెకోక, దానిమీద ఎర్రటి తాపు, తలకు నీలిరంగు రిబ్బన్, వెంట్రుకలలోంచి బాగాకనబడకుండా ఉన్న తళతళలాడే మంచు బిందువులాంటి చెవి, ఉబికి ఉన్న వక్షం, భుజములు".

షిగా నోయా వ్రాసిన "హాన్ చేసిన నేరము" సర్కసులో ఆటలాడు దంపతుల దుఃఖమయ జీవితము. తుదకు భర్త చేతులలో భార్యచావు కళ్ళకు కట్టి నట్లుచూపును. అకుటగావా వ్రాసిన ర్యూనోసూకే"నరకదృశ్యం" భయానకమైన కథ. కళాకారుని స్వభావమందుండెడు కొన్నికొన్ని ఛాయలను విచిత్ర విస్పష్టతతో ఈ కథ చిత్రించును. నరక చిత్రము వ్రాయుటకు ప్రభువుచే ఆజ్ఞపొందిన యోషిహిడి చిత్రకారునికి చిత్రము పూర్తిచేయుట కొక నమూనా కావలసివచ్చెను. అదిలేనిదే చిత్రమును పూర్తి చేయలేని స్థితి వచ్చెను. "చిత్రానికి మధ్యగా ఆకాశంలోంచి దొర్లిపడిపోతున్న ఒక రథం చిత్రించదలచాను............రథంలో ఒక చక్కని రాజాంతఃపుర స్త్రీ ఉంటుంది. విజృంభించుచున్న మంటలో విరబోసిన వెంట్రుకలతో ఆమె గోలపెడుతూ చుట్టలుచుట్టుకు పోతో ఉంటుంది. పొగలో ముఖం వంకర్లు పోతుంది........కీచుమంటూ అరుస్తూ అనేకపక్షులు బండిచుట్టూ ఎగురుతుంటాయి". ప్రభు వంగీకరిస్తాడు. హృదయ విదారకమైన కుతూహలముతో నతడు చిత్రకారుని అందమైన కూతురు యజూకీనే నమూనాకు కావలసిన కాలిపోయే బండిలోకెక్కించి పంపుతాడు. యాసునారి వ్రాసిన కథ "పుట్టుమచ్చ" లో భ్రమనుండి బయటబడిన భార్య, భర్త కుత్తరము వ్రాయును. తన కుడిభుజము మీదనున్న గింజవంటి పుట్టు మచ్చను తడుము కొనుచుండు టామెకు చిన్నప్పటినుండీ అలవాటు. భర్త దీని నేవగించుకొనును. "నువ్వు మచ్చ తడుముతూ ఉన్నప్పుడెల్లా నీముఖ మదోవిధంగా వరాకుగా ఉంటుంది. నిజంగా నాకదే అసహ్యమనిపిస్తుంది" అనిన భర్త మాట లామెకు హృదయతాపము గలిగించును. అతడే గనుక కొంచెము సహనము చూపి సర్దుకొని పోగలిగిన తమ జీవితము సుఖప్రదముగ గడిచిపోయెడిదికదా అను కొనును. "నా అలవాటు నీవంతగా పట్టించుకోకపోతే బాగుండేది" అనును.

ఈపుస్తకమందలి ఒక్కొక్క కథ ఆధునిక కథానికలకు ప్రశంసనీయమైన సమూనా. వీనిలో చక్కని శిల్పమున్నది. విశేషమైన కేంద్రీకరణ, సంచలనాత్మక చైతన్యమును గలవు. కథావస్తువు, పాత్రలు, సంభాషణలు బహు సమర్థతతో పోషింపబడినవి.

వి. కే. అయ్యప్పన్ పిళ్ళై,

మద్రాసు. ప్రొఫెసర్.

# కథా క్రమం

—సియే లియాంగ్

# 1. అహింసావాది, తోడేలు

ఛావోజమీ ప్రభువు డేగలతో, వేటకుక్కలతో, ఈటెలు, బాణాలు గల వేటగాళ్ళతో, ఇంకా పరివారంతో అట్టహాసంగా వేటకు బయలు దేరాడు. దారిలో కొంచెం దూరాన బాట కడ్డంగా ఒక తోడేలు నిలబడి ఉండడం జమీందారు చూశాడు. ఆ తోడేలు వెనుక కాళ్ళమీద నిలబడి అరుస్తూఉంది. గురిచూసి కొట్టడానికి మహావీలుగా ఉంది. ఒక్క బాణ ముతో జమీందారు దాన్ని గాయపరచాడు. అది తప్పుకొని పరుగెత్తడంతో వేటగాళ్ళు వెంటబడ్డారు. వేటగాళ్ళ అరుపులు, కుక్కల మొరుగులతో అడివి ప్రతిధ్వనించింది; దుమారం లేచింది. దాంట్లో కనబడకుండా పారి పోడానికి తోడేలుకు వీలయింది.

అదే సమయానికి టంగ్‌కువా తన గాడిద నెక్కి చంగ్‌షన్ కొండల మీదకు పోతున్నాడు. అతని సంచిలో కొన్ని గుడ్డలు కొన్ని పుస్తకాలు మాత్రమున్నాయి. అతనిది మోట్సు మతం. ఆ మతస్థులకు స్వార్థరహిత జీవితం, పరసేవ ముఖ్యం. రాజులు, జమీందారులు, సామాన్య ప్రజలు, అందరికీ విశ్వప్రేమ నేర్పాలని వారి దీక్ష. వారు తమ జీవితాలు పేదరికాని కంకితం చేశారు. ఇతరులకు సాయపడటంలో తమ కాపద గల్గినా లెక్కచేయరు.

టంగ్‌కువా ఈ సవ్వడి విన్నాడు. ఇంతలో తోడేలు వేటగాళ్ళ బారినుండి తప్పించుకొని తనవైపే వస్తూంది. అతణ్ణి చూచి తనకు

సాయంచేయమని దీనంగా అరిచింది. దాని వీపున గుచ్చుకొని ఉన్న బాణం కంటబడగానే అతని మనస్సు కరిగిపోయింది.

" భయపడకు. బాణం నెమ్మదిగా దీసిపారేస్తా " అన్నాడు టంగ్ కువా.

"ఆహా, మీరు మోట్సు మతస్థులు. దయగలవారు. వేటగాళ్ళు నన్ను తరుముతున్నారు. వారు పోయేవరకు నన్ను మీ సంచిలో దాక్కోనీయండి, మీకు శాశ్వతంగా కృతజ్ఞురాలుగా ఉంటాను" అంది తోడేలు.

"అయ్యో పాపం, చిక్కుల్లో పడ్డావుకదా! నీకు జ్ఞానంలేదుకదా. మీకున్న లోపమే అది. సరే, గబ గబ సంచిలో దూరు, కృతజ్ఞత మాటెత్తకు. నేను చేయగల సేవ నేను సంతోషంగాచేస్తా" అని టంగ్ కువా తన సంచిలో సరుకులు తీసేసి, తోడేల్ని దాంట్లో కుక్కడానికి చూశాడు. కాని తోడేలు పెద్దది; సంచి చిన్నది. తల దూరితే, వెనకాళ్ళు, బొచ్చు తోక పట్టడం లేదు. ముందే వెనకాళ్ళు పెడితే ముందుకాళ్ళు తల దూరడము లేదు. అనేక రకాలుగామార్చి చూచాడు కాని లాభం లేకపోయింది.

ఆలసించకండి, వేటగాళ్ళు వచ్చేస్తున్నారు. నన్ను మూటగా బిగించి కట్టేసి కుక్కేయి అని దగ్గరగా ముడుచుపోయి కట్టెయ్యనిచ్చింది, నొక్కి తోసి, ఎలాగో తోడేల్ని టంగుకువా తన సంచిలోకి దూర్చి దాన్ని గాడిద వీపుమీద కెక్కించాడు. సంచిలోంచి రక్తపు చుక్కలు కారుతున్నాయి, అది పరుగెత్తుకు వచ్చిన దారిలో కూడ రక్తపు చుక్కలున్నాయి. అతని చేతులికి కూడ రక్తమంటింది. భయంతో గబ గబ రక్తపు జాడలు చెరిపేసి, గాడిదను వెనక్కు తిప్పేసి నడిపించాడు. సంచి అంత స్పష్టంగా కనబడనివ్వలేదు.

వేటగాళ్ళు వచ్చారు. తోడేలు కనబడిందా అని జమీందారు టంగ్ కువా నడిగాడు. రోడ్డుకు ప్రక్కగా ఆగి "లేదు. తోడేలు జిత్తులమారి

కదా! బాటలోకి వస్తుందా, అడవిలో ఎక్కడో దాగి ఉంటుంది" అన్నాడు టంగుకువా. జమీందారు అతనివైపు తీవ్రంగా చూచి, కత్తి ఝుళిపిస్తూ "సరే, ఎవరైనా అది తప్పించుకు పోవడానికి సాయపడ్డారా, అనుభ విస్తారు"అని బెదిరించాడు జమీందారు.

నెమ్మదిగా గాడిదనెక్కి టంగుకువా జమీందారువద్ద సెలవు తీసు కొని వెళ్తూ, "కనబడితే మీకు చెప్పుతా'' అన్నాడు.

వేటగాళ్ళ సద్దు అణిగిన మీదట, తోడేలు సంచిలోంచి, "ఊపి రాడక చస్తున్నా, చప్పున బయటికి తియ్యి" అంది. అతడు దిగి దాన్ని తీసి కట్లు విప్పేశాడు. గాయం నెమ్మదిగా తాకుతూ ''గాయం ఇంకా మంటగా ఉందా? నిన్ను గూర్చి చాలా భయపడ్డాను'' అన్నాడు. "అబ్బే పైపైన గీసుకుపోయిందంతే. పెద్దగాయంకాదు. నన్ను ఎలాగూరక్షించావు. మరొక ఉపకారం మాత్రం చెయ్యాలి" అంది. "నాకు సాధ్యమైందేదైనా సంతోషంగా చేస్తా. మేము మోట్సున్ మతస్థులము కదా. ప్రేమ సందే శమే ప్రపంచాన్ని రక్షించగలదు. నేను చేయవలసిందేమిటి, చెప్పు, చేస్తా" అన్నాడు టంగుకువా.

అతనివైపు ఓరచూపుచూచి తోడేలు "నా కాకలేస్తూ ఉంది. మూడు రోజులనుంచి తిండిలేదు. ఈవాళ ఆకలితో చస్తా. నన్ను రక్షించిన లాభ మేమిటి? నిన్ను తినేస్తా, కాస్త స్వార్థత్యాగం చెయ్యి. నేనడిగింది మట్టు కేమంత పెద్ద కోరిక" అంటూ కోరలు విప్పి పైకురికేసరికి టంగుకువా పై ప్రాణాలు పైకెగిరి పోయాయి. గజగజలాడుతూ గాడిద కవతల తట్టుకు దూకేశాడు. ''నన్నిలా నీవు చెయ్యవచ్చా, నీ మనస్సు ఒప్పు తుందా? ఇంత ఘోరం చెయ్యలేవు'' అన్నాడు. "ఎందుకు చెయ్యలేను'' అంది తోడేలు. "నీ ప్రాణం నేను దక్కించాను. నన్ను దగాచెయ్యలేవు" అన్నాడు. గాడిదచుట్టూ ఇద్దరూ పరుగెత్తారు. గాడిద కిదంతా గందర

గోళంగా ఉంది. గాడిద కవతలవైపు నుంచి టంగుకువా అన్నాడు. "కాస్త న్యాయం ఉండొద్దా? బలమేనా ప్రధానం న్యాయనిర్ణయానికి. నన్ను చీరేసినా నీది న్యాయం అని ఒప్పుకోను. దీనికి నీ అంతరాత్మే నిన్ను హింసిస్తుంది. ఔనా? నన్ను తిన దలిస్తే నీవు చేసింది నీకు న్యాయమని తోచాలి గదా?" అన్నాడు. ఔను నిజమే కాని ఆకలి దహించుకుపోతూ ఉంది. నీతో వాదించడానికి నాకోపిక లేదు'' అని గుర్రుమంది తోడేలు.

"మన వాదం న్యాయంగా పరిష్కారం చేసుకొందాం. మధ్యవర్తిత్వ పద్ధతి ప్రకారం ముగ్గురు పెద్దల్ని, నీ ప్రాణాలు రక్షించిన నన్ను నీవు తినవచ్చునా అని అడుగుదాం. వాళ్ళు ఎలా తీర్పు చెప్పితే అలా చేద్దాం సరేనా'' అన్నాడు టంగుకువా. సరేకాని చప్పున సూక్ష్మంగా తేల్చు. తోడేళ్లు తినడానికే మనుష్యుల్ని భగవంతుడు సృష్టించాడని నా పూర్తి విశ్వాసం. మీ జాతికంటే మాజాతి గొప్పది. మీరు మిమ్మల్ని రక్షించు కోలేరు. మీరు క్రమేణా దుర్బలులైపోయారు''అంది తోడేలు.

ఇద్దరూ కలసిపోతూఉంటే బాటలో ఎవరూ ఎదురుపడలేదు. "నా కాకలి మండిపోతూ ఉంది నేనింక ఆగలేను. కావలిస్తే ఆ మొద్దు నడుగు అంది తోడేలు. అది చెట్టునరికిన దుంగకదా దానికేమి తెలుస్తుంది? అన్నాడు టంగుకువా. ''కాదు, అడుగు చెప్పుతుంది," అంది తోడేలు.

టంగుకువా ఆ ముసలి చెట్టు మొద్దుకు నమస్కరించి, అపాయాన్ని కూడా లెక్కచేయకుండా తానెట్లా తోడేలును రక్షించాడో చెప్పి,''నీ ఉద్దేశంలో ఇది నన్ను తినడంలో న్యాయంకాని కృతజ్ఞతకాని ఉందా, చెప్పు" అన్నాడు.

ఆ మొద్దులోంచి ఒక గంభీర ధ్వని వినవచ్చింది. "ఆ, నీవు చెప్పేది అర్థమయింది. కృతజ్ఞత గూర్చి కదా ! నా కథ విను. నే నొక అప్రికాట్ పళ్ళ చెట్టును, ఒక గింజ తెచ్చి తోటమాలి నాటాడు. ఒక్క

సంవత్సరాని కెదిగి పూత పూసాను. మూడు సంవత్సరాలకు కాపు కాశాను. ఐదేళ్ళప్పుడు నా ప్రమాను జబ్బంత ఉండేది. పదేళ్ళలో పిల్లాడి బొజ్జం తయింది. ఇప్పుడు నా కిరవై యేళ్ళు. తోటమాలికి, అతని కుటుంబానికి యిన్నాళ్ళు పళ్ళు అందించాను. కొన్ని పండ్లు అమ్ముకొని సొమ్ము చేసు కొన్నాడు. పెద్దదాన్నయ్యాక ,పళ్ళు కాయడం లేదని ఆకులు దూశేశాడు. కొమ్మలు విరిచేసి పొయ్యిలో పెట్టాడు. ఇంక మిగిలింది రంపంతో కోసేసి చిత్రిక పట్టించి మూలాల క్రింద అమ్మేస్తున్నాడు. ఇదీ నా జీవితం. ఏం, తోడేలు నిన్నెందుకు తినగూడదు'' అంది మొద్దు. "బుద్ధి గలది కాబట్టి సరిగా చెప్పింది''అంటూ తోడేలు టంగుకువా మీద పడబోయింది.

"కాస్త ఆగు, ఇంకా ఇద్దరు పెద్దల్ని అడగాలి కదా !" అన్నాడు టంగుకువా. సరేకానీ, కాని నీ వాసన నా కిందాకటి కంటే రుచిగా తగుల్తూ ఉంది'' అంది తోడేలు. కొంచెం దూరం వెళ్ళే సరి కాక దున్నపోతు కనబడింది. జీవితమంటేనే విసిగిపోయినట్లు కనబడుతూ ఉంది. "దీన్నడుగు. దీనికి చాలా జీవితానుభవం ఉన్నట్టుంది'' అంది తోడేలు. ఆ దున్నపోతుకి తన కథ చెప్పి న్యాయమైన తీర్పు కోరాడు టంగుకువా. దున్నపోతు నెమ్మదిగా అతణ్ణి పరీక్షగా చూసింది. వేళా కోళంగా చూస్తోంది అనుకొన్నాడతను. కాస్సేపు ఆలోచించి, దున్నపోతు నాలికతో తన ముట్టె నాకుతూ అంది,'' ఆ మొద్దు చెప్పిందంతా నిజం. నన్ను చూడు. ముసలి దాన్ని. ఆకలితో క్రమేణా కృశించి చావడానికి సిద్ధంగా ఉన్నాను. నన్ను వయస్సులో ఉండగా చూడవలసింది. ఒక రైతు నన్ను సంతలో కొని తన పొలంలో పనికి పెట్టాడు. తక్కిన గొడ్లు ముసలివి. అంత పనీ నేనే చేసేదాన్ని. రైతుకు కూడా నా మీద చాలా మక్కువ ఉండేది. పొరుగూరు తాను వెళ్ళేటప్పుడు నన్ను బండికి కట్టేవాడు. బీడు కూడా నేనే సాగు చెయ్యాలి. బురదలో దిగి దమ్ము చేసే దాన్ని. కుప్పనూర్పిడి పనికి నేనే కావాలి. వళ్ళువంచి పది గొడ్ల పని

చేశాను. దాంతో అతని కెంతో లాభం వచ్చింది. అతనికి కూడు, గుడ్డ, ఆస్తి అంతా నా వల్లే కలిగాయి. గాదె కింకో గది పెంచాడు. కొడుకు పెళ్ళి చేశాడు. కొడుకుల్ని మనమల్ని ఎత్తుకొన్నాడు. జమీందారులా గున్నాడు. అతని యింటికి మొదట వచ్చినప్పుడు అతని యింట్లో అన్నీ పిడతలు, దాకలు, మూకుళ్ళే! ఇప్పుడో పీపాలతో సారాయే ఉంది నేలకొట్లో. నేను రైతు కుటుంబానికి చేసిన సేవకంటే యెక్కువగా తోడేలుకు నీ సేవ? రైతు పెళ్ళాని కిప్పుడు నేను పనికిమాలిన దాన్న య్యాను. ముసలిదాన్ని కదా! నన్ను బయటకు నెట్టేసింది. గాలిలో వానలో బయటే తిరిగి బయటే పడుకోవాలి. ఇక్కడ కాస్త ఎండగా ఉందని నిలబడ్డాను. చీకట్లో నే నొక్కతెనే గడపాలి. అందరూ ముసలి వాళ్ళవ వలసిందేకదా! నన్ను కసాయి కొట్టుకు పంపిస్తుందట. నా మాంసం కవాబులు చేసుకో వచ్చు. చర్మం చక్కని తోలు చేసుకోవచ్చు డెక్కలతో కొమ్ములతో బొమ్మలు, దువ్వెనలు చేయించుకోవచ్చు అంటుంది. ఇదీ జీవితం. మానవుని కృతజ్ఞత గూర్చి నాకు చెప్పకు బాబు! నిన్ను తోడేలు తినడాని కాక్షేపం యేమీ లేదు." దాంతో తోడేలు టంగుటువా చెయ్యి కొరకడానికి ఎగిరింది.

"ఆగు, ఆగు, అప్పుడే కాదు. ఇంకాస్త ఓపిక పట్టు. మూడో పెద్ద యేమంటాడో చూద్దాం" అన్నాడు టంగుటువా.

కర్ర నానుకొని నడుస్తూ వస్తున్న ఒక వృద్ధుడు కనిపించాడు. తెల్లటి పొడుగాటి గడ్డంతో సాధువులాగ కనబడుతున్నాడు. మనిషి కన బడ్డాడు కదా అన్న సంతోషంతో టంగుటువా అతని వద్దకు పరుగెత్తుకు వెళ్ళి తమ వివాదం తేల్చమన్నాడు. "బాబూ! నీ తీర్పే నన్ను రక్షించాలి" అని మొరపెట్టు కొన్నాడు.

కథ అంతా విని, "ఏమి కృతఘ్నతా?" అని కళ్ళెర్ర చేసి తోడేలుని చూచి, "కృతఘ్నుడికి వృద్ధాప్యంలో కృతఘ్నుడే కొడుకై

పుడతాడని తెలుసా. నీ కొడుకుని నీ వెంత ప్రేమగా పెంచినా నిన్ను నీ కొడుకు హింసిస్తాడు, పో, లేకపోతే చంపేస్తా''నని ఉరిమాడు. తోడేలు అంది. ''నా కథ సరిగా విన్నావు కాదు. నన్నీతడు బిగించికట్టి ఒక సంచిలోకి నొక్కి కుక్కాడు. ఊపిరాడలేదు. చచ్చిపోతా ననుకొన్నాను. సంచిలో ఎంత ప్రాణాంతకంగా ఉందో నీకేం తెలుసు?" వృద్ధుడు". ''ఐతే ఇతనిది కూడ తప్పు ఉంది. సరే, విచారణ మొదలు కొచ్చింది. మీలో ఎవరిని నమ్మాలో తెలియడంలేదు. ఇతడేమో నీ ప్రాణం రక్షించానంటాడు. నీవేమో అతడు నిన్ను బాధపెట్టాడంటావు. దీంట్లో ఎవరిది నేరమో తేల్చాలంటే ప్రత్యక్షంగా చూడాలి. సంచిలో నీ కెంత క్షోభ కలిగింది నేనే స్వయంగా కళ్ళారా చూసి తెలుసుకొంటా"అన్నాడు. ''ఐతే చూడు" అని మళ్ళీ కాళ్ళు కట్టించుకొని, సంచిలో కుక్కించు కొంది.

మంచి కత్తి ఉందా అని నెమ్మదిగా సాధువుగారు టంగుకువా చెవిలో ఊదాడు. ''ఆ'' అన్నాడు సరిగా అర్థంచేసుకోక టంగుకువా. ''సరే" అన్నాడు సాధువు. టంగుకువా సాధువుని''చంపమనడం లేదుకదా దాన్ని"అని ఆశ్చర్యంగా అడిగాడు. ''చంపుతావో, చస్తావో నీ ఇష్టం. నీ నీతి తగలెయ్యా'' అంటూ సాధువు నవ్వుకొన్నాడు. టంగుకువాకు కత్తితో తోడేలుని పొడవడానికి సాయపడ్డాడు. దానితో వారి వివాదం తేలి పోయింది.

---

—లీ ఫూ-యెన్

# 2. పెద్దపులిగా మారిన పెద్దమనిషి

యూ యాన్‌హో రాజ్యారంభ కాలమున చాంగ్‌ఫెంగ్ చైనాలో ఫుక్యేన్ రాష్ట్రంలో సంచారం చేస్తున్నాడు. అతడు ఉత్తరదేశంవాడు. కాబట్టి యిచటి దట్టమైన వృక్షజాలం చూచి చాల ఆనందించాడు. పెద్ద పులులుకూడ ఆ ప్రాంతంలో ఉంటాయని విన్నాడు. దారిలో కొండల మధ్య సరస్సు తగిలింది. తన నౌకరుతోసహా అచటి సత్రములో మకాం చేశాడు. సామానులుదింపేక అచటి ప్రజలను, స్త్రీల దుస్తులను వింతగా చూస్తూ చేతిబెత్తం ఆడించుకొంటూ ఇంకా ఇంకా ముందుకు నడిచాడు. చల్లనిగాలి కొండలమీదనుండి వీస్తూఉంది. వర్షం వెలిసిన మీదట చెట్లు పరిశుభ్రంగా ఉన్నాయి. అతని ఉత్సాహం కలిగేటట్లు ప్రకృతి దృశ్యం వివిధ వర్ణాలతో మెరిసిపోతూంది. కొండలమీది మేపుల్ చెట్ల అడవులు ఎరుపు, పసుపు రంగులతో ధగధగలాడు తున్నాయి. కొండకు కొంచెం ఎత్తులో దట్టమైన చెట్లమధ్య తెల్లటి అందమైన దేవాలయం ఉంది. సంజ కెంజాయలు కొండపార్శ్వాలను, సమతలాల్ని నీలం, ఎరుపు, ఆకుపచ్చ రంగులతోను, మళ్ళీ ముదర ఎరుపు పసుపు కలిపిన రంగులతోను నిమిష నిమిషానికి మార్చి చూపుతున్నాయి. అదొక ఐంద్రజాలిక ప్రపంచము లాగుంది.

ఉన్నట్లుండి చాంగ్‌ఫెంగ్‌కు స్పృహతప్పుతున్నట్లు తోచింది. తల తిరుగుతూఉంది. అంత ఎత్తున ఉండటంవల్లో అలసిపోయిన కారణాన్నో

వాతావరణంలో ఆకస్మికంగా మార్పు కల్గుటచేతనో లేక ఆ సంజ వెలుగుల ప్రభావం వల్లనో అలా జరిగి ఉంటుందను కొన్నాడు. తన యెదుట కొంచెం దూరంలో మెత్తని పచ్చగడ్డి పెరిగిన మైదానం ఉంది. అక్కడి నుండే అడవి ఆరంభమౌతుంది. తన అంగరఖా తీసేసి చేతిబెత్తం సాయంతో చెట్టుకొమ్మకు తగిలించి, విశ్రాంతికై పచ్చగడ్డిమీద పడున్నాడు. కాస్త నయం. పైన నీలాకాశం చూస్తూ ఉంటే ప్రకృతి యెంత శాంతంగా అందంగా ఉందీ అనిపించింది. ధనం, అధికారం, కీర్తి కొరకు మనుష్యులు పడిచస్తారు. అబద్ధాలాడి మోసగించడానికి వెనుదీయరు. ఇక్కడదేమీలేదు, శాంతికురిసే పకృతి. గడ్డిమీద దొర్లేటప్పటికి అలసటపోయింది. సుఖంగాఉంది. క్రింద మట్టిలోని కమ్మని వాసన, పైన చల్లనిగాలి జోల పాటలు అతనిని నిద్రబుచ్చాయి.

సాయంత్రానికి లేచాడు. ఆకలివేస్తూఉంది. కడుపుమీద చేతితో నిమురుకొంటే మెత్తటి వెంట్రుకలు తగిలాయి. చప్పునలేచి చూచుకుంటే వంటిమీద అంతటా అందమైన నల్లని చారలున్నాయి. చేతులు చాచి చూచుకొంటే ఎక్కడలేని బలం స్ఫురించింది. ఆవలించేసరికి తన గొంతు లోంచి వచ్చిన పెద్దగాండ్రు ధ్వనికి తానే ఆశ్చర్యపోయాడు. ముఖంమీద తెల్లని పొడుగాటి మీసాలున్నాయి. ఇదేమిటి, తాను పెద్దపులినైపోయాడే!

"గమ్మత్తుగా ఉంది, నేనింక పెద్దపులిని, మనిషినికాదు. ఇదీ బాగానేఉంది" అనుకొన్నాడతడు. తనబలం పరీక్షించుకోవాలని అడివిలోకి పరుగెత్తాడు. కొండల మీదనుంచి కొండల మీదికి దుమికాడు. బౌద్ధభిక్షుల మఠానికి వెళ్ళి, లోపల ప్రవేశించడానికి గుమ్మం మీద పంజాతో కొట్టాడు. లోపలినుంచి ఒక స్వామి, "పెద్దపులి, పెద్దపులి, దానికంపు ఇక్కడికి కొట్టుతూఉంది, తలుపుతియ్యకండి" అని అరచాడు. మఠంలో కాస్త భోంచేసుకొని, వేదాంత చర్చ చెద్దామనుకొంటే యేమిటీ స్వామి గోల.

ప్రస్తుతం పెద్దపులినే కావచ్చు. కంపుకొట్టనూవచ్చు,ఐతేనేం'' అనుకున్నాడు చాంగ్ ఫెంగ్. కొండదిగి గ్రామంలోకి పోయి తిండికొరకు వెదుక్కుంటే మంచిదనిపించింది.ఒక పల్లెగ్రామం బాటలో కంచెవెనకాల దాక్కొని ఒక అందమైన పిల్ల వెళ్తూఉంటే చూచాడు. ''పూచో జాతి పిల్లలు తెల్లగాను పొట్టిగాను ఉంటారంటారు, నిజమే అనుకొని దగ్గరకు వెళ్ళబోయే సరికి ఆ పిల్ల అరుస్తూ ప్రాణభయంతో పారిపోయింది.''ఏమిటిది?ప్రతివాళ్ళూ నన్ను శత్రువుగా చూస్తున్నారు. చక్కని ఆ పిల్లను తినేకంటే ఏ పందిపిల్లనో చూసుకుంటాను. బలసిన పంది, రుచికరమైన మేక జ్ఞాపకం వచ్చేసరికి నోరూరింది కాని తన కోరిక తలచుకొని తానే సిగ్గుపడ్డాడు. ఐతే ఆకలి పేగుల్ని మాడ్చేస్తూఉంది. ఏదో ఒకటి తినకుంటే చావు తప్పదు. పంది, ఆవుదూడ, చివరకు కోడిపిల్లయైనా చాలు అని వెదికాడు. కాని అన్ని ప్రాణులు సురక్షితంగా కాపలాలో ఉన్నాయి. ఇళ్ళన్నీ తాళాలువేసి ఉన్నాయి. ఒక చీకటిగా ఉన్న సందులో ఏదన్నా జంతువు దొరకుతుం దేమోనని కూర్చుంటే అక్కడి ఇంట్లోవాళ్ళు ఊళ్ళో తిరుగుతున్న పెద్ద పులిని గూర్చే మాట్లాడుకుంటున్నారు. మళ్ళీ తిన్నగా కొండమీదికిపోయి, యే ప్రయాణీకుడైనా వస్తున్నాడేమోనని ఎదురుచూచాడు. రాత్రి గడచింది కాని ఎవ్వరూ రాలేదు. కాసేపు తనకు నిద్రకూడా పట్టి ఉండవచ్చు.

తెల్లారేసరికి మెలుకువ వచ్చింది. ఆ దారిని మనుష్యుల సంచార మారంభమైంది. ఒకడు దారేపోయే వాళ్ళని ''ఈవాళ చెంగ్‌ఛూగారు ఆఫీసుకు వస్తానన్నారు. ఎవరన్నా వారి నిటురావడం చూశారా'' అంటున్నాడు. బహుశా యితడు రాజకీయ ప్రధానోద్యోగి. చెంగ్ ఛూగారిని ఆహ్వానించి తీసుకుపోవడానికి వచ్చిన వారి గుమస్తాయై యుంటాడు. పెద్దపులికి చెంగ్‌ఛూని తినాలనిపించింది. అతణ్ణే ఎందుకు తినాలనిపించిందో తెలియదు కాని అతణ్ణే తినడంఖాయం. గుమ స్తాతో ఒక బాటసారి అన్నాడు. నేను బయలుదేరేసరికి సత్రంలో

ఆయన లేవడం చూచాను. బహుశా మా వెనుక వస్తున్నారనుకొంటాను" అన్నాడు. అతణ్ణి గుమస్తా అడిగాడు, "ఒక్కరే వస్తున్నారా? ఇంకా ఎవరన్నా వెంటఉన్నారా? ఆయన ధరించిన దుస్తులెలాంటివో చెప్పుతే గుర్తుపట్టి, పొరపాటు లేకుండా ఆయనకే స్వాగతం చెప్పగలుగుతాం" బాటసారి అన్నాడు. "వాళ్ళు ముగ్గురు వస్తున్నారు. ముదర ఆకుపచ్చ బట్టలు ధరించినవారే చెంగ్‌ఘూగారు."

ఈ ప్రసంగమంతా తన మంచికే జరిగిందనుకొంది పెద్దపులి. ఇది వరకెప్పుడు చెంగ్‌ఘూని తాను చూడలేదుగా! ఒక పొదలో వేచిఉంది. అంతలోనే తన కార్యదర్శులతో వస్తున్నాడు చెంగ్‌ఘూ. ఇంకా ఇతర బాటసారులు కూడా ఉన్నారు. చెంగ్‌ఘూ బాగా బలిసి ఉండటంచేత పెద్ద పులికి నోరూరుతూఉంది. దగ్గరకు వచ్చేసరికి ఒక్క గెంతున పెద్దపులి అతని మీదపడి కొండల్లోకి లాక్కుపోయింది. ప్రయాణీకులు భయంతో చెల్లాచెదరయ్యారు. పెద్దపులి ఆకలి తీరింది. మామూలుకంటే ఎక్కువగా తిన్నట్లు తోచింది. వెంట్రుకలు, ఎముకలు తప్ప తక్కినదంతా తినేసింది.

ఆకలితీరి పెద్దపులికి కాస్త కునుకుపట్టింది. మెలుకువవచ్చాక, తన కెన్నడూ హానిచేయని మానవుని చంపితినడం పిచ్చితనం కాదా అను కొంది. తల బరువు కాస్త తేలికపడింది. ప్రతి రాత్రి ఇలాగ తిండికోసం దేవులాడడం సుఖమైన జీవితం కాదనిపించింది. గతరాత్రి ఆకలి తన్నెన్ని చోట్లకు త్రిప్పిందీ జ్ఞాపకం వచ్చింది.

"మొదట నేను పరున్న పచ్చగడ్డి మైదానానికిపోయి మళ్ళీ మనిషి నవగలుగుతానేమో చూస్తాను. చెట్టుకు తన దుస్తులు వ్రేలాడుతున్నాయి. చేతికర్ర ప్రక్కనే వ్రేలాడుతూఉంది. అక్కడే మళ్ళీ పరుంది పెద్దపులి. మనిషిగా నిద్రనుండి లేవాలనే సంకల్పంతో అటూఇటూ దొర్లింది. కొద్ది క్షణాల్లో మళ్ళీ మనిషి అయింది.

ఇప్పుడతని కెంతో హాయిగా ఉంది. కానిగడచిన కథ గొప్పసమస్య గానే ఉండిపోయింది. అంగరఖా తొడుక్కొని, చేతికర్ర పుచ్చుకొని ఊరిలోకి బయలుదేరాడు చాంగ్ ఫెంగ్. సత్రంజేరుకొని తానువెళ్ళివచ్చినదంతా ఇరవై నాలుగు గంటల్లో జరిగిందని గ్రహించాడు. నౌఖరువచ్చి, "బాబూ, ఎక్కడికి వెళ్ళారు. మీకోసం రోజంతా వెదుకుతున్నాను''అన్నాడు. సత్రం యజమానికూడ వచ్చి చాంగ్ ఫెంగ్‌ను చూచి కాస్త కుదుటబడి,"కంగారు పడ్డామండి, ఒక పెద్దపులి తిరుగుతూఉంది. నిన్నరాత్రి ఒక పిల్లని తరిమింది. ఈవాళ చెంగ్‌ఛూగారిని తినేసింది"అన్నాడు. మఠంలో బౌద్ధ వేదాంతం చర్చలోబడి ఉండిపోయానని సర్దిచెప్పాడు చాంగ్ ఫెంగ్.

"చెంగ్‌ఛూగారిని తినేసింది. మీరదృష్టవంతులు" అన్నాడు సత్రపు యజమాని. "పెద్దపులి నన్ను తినదు''అన్నాడు చాంగ్ ఫెంగ్. ''ఎందుకు తినదండీ?"అంటే, "తినలేదు" అని గూఢార్థంతో జవాబు చెప్పాడు. కాని రహస్యం గోప్యంగానే ఉంచాడు. మనిషిని తిన్నానని ఎలాగ చెప్పుతాడు?

హోనాన్ పట్టణంలో ఉన్న తన యింటికి చాంగ్ ఫెంగ్ వెళ్ళిపోయాడు. కొన్ని సంవత్సరాలు గడిచాయి. హూవై నదిమీది హ్యాయాంగ్ పట్టణంలో ఒకనాడున్నాడు. మిత్రులు విందుచేశారు. మద్యం కూడా బాగా త్రాగారు. తింటూ త్రాగుతూ ఉన్న అతిథుల్ని ఏదన్నా తన్ను విచిత్రానుభవం చెప్పమన్నారు. చెప్పింది విచిత్రంగా లేకపోతే మరొక కప్పు మద్యం త్రాగాలని శిక్ష.

చాంగ్ ఫెంగ్ తన కథచెప్ప నారంభించాడు. అతిథులలో చెంగ్‌ఛూగారి కొడుకున్నాడు. కథ వింటున్నకొద్దీ అతని ముఖం ఎర్రబారి పోతూ ఉంది.''నీవా నా తండ్రిని చంపింది''అని కళ్ళుపెద్దవిచేసి అరిచాడు. నొసలు మీద రక్తనాళాలుబికాయి. పెద్ద చిక్కులోపడ్డ చాంగ్ ఫెంగ్ చటుక్కున లేచి క్షమాపణ కోరుతూ ''మీ తండ్రి అని నాకు తెలియదు"అన్నాడు.

ఒక్కలిప్తలో యువకుడు చాంగ్‌పైకొక కత్తి విసిరాడు. అదృష్ట వశాత్తు అది గురితప్పి ఖంగుమని నేలమీద పడింది. దాంతో యువకుడు చాంగ్‌పై కురికాడు. అతిథులు హడావడిగాలేచి అతణ్ణి ఆపారు. "నిన్ను చంపి నాతండ్రి పగతీర్చుకొంటా. గగనాల్లోకైనా నిన్ను వెంటాడతా''అని గర్జించాడు యువకుడు.

చాంగ్‌ఫెంగ్‌ను అతిథులు తీసుకెళ్ళి దాచేసి, ఛెంగ్‌ఛూ కొడుకు కోపాన్ని శాంత బరచారు. తండ్రి పగ తీర్చుకోవడం శ్లాఘనీయమే అని అందరూ చెప్తూ, ఐతే, పెద్దపులి దేహంతో ఉండి తనకు జ్ఞానం లేని స్థితిలో తిన్నాడు కాబట్టి, ఆ కారణంగా ఇప్పుడు రక్తపాతం జరగ డము ఎవ్వరికీ ఇష్టం లేదు. ఇలాంటిదెన్నడూ జరిగి ఉండలేదు. ఇలాంటి సందర్భాలలో పగతీర్చుకోవచ్చా అన్నది పెద్ద సమస్యగా తయారైంది. యువకుడు మాత్రం ఇంకా పగతీర్చుకొంటానంటూనే ఉన్నాడు.

చివరకు మిత్రులందరూ సైన్యాధిపతితో చెప్పుకొని హ్వ్యాయైనది దాటి ఉత్తర దిశకు యువకుడెన్నడూ పోరాదని ఉత్తరువులు పుట్టించారు. చాంగ్‌ఫెంగ్ పేరు మార్చుకొని వాయవ్య దిక్కుగా యువకుని కంద నంత దూరానికి పోయాడు. యువకుడింటికి వచ్చాక మిత్రులన్నారు, ''తండ్రి ఋణం తీర్చుకోవలసిందే. అది కొడుకుకు ధర్మమే. కాని పెద్ద పులిగా ఉన్నప్పుడు చాంగ్ తిన్నాడు కాబట్టి దానికి జవాబ్‌దారీ అతనిది కాదు. నీ తండ్రి నతడెరుగడు. నీ తండ్రిని చంపడంలో అతని ఉద్దేశ మేమీలేదు. ఇది విచిత్రమైన కేసు. ఇది ఉద్దేశపూర్వక హత్యకాదు. నీ విప్పుడతణ్ని చంపావా, నిన్ను మాత్రం హత్యానేరం క్రింద శిక్షిస్తారు."

ఈ సలహాను యువకుడు మన్నించాడు. ఇక చాంగ్ జోలికిపోలేదు.

---

—పుక్కిటి కథ

# 3. పవిత్ర జీవనం

సూచౌను దాటాక, ఎత్తైన నీలపు కొండలకు, వైషాంగ సరస్సుకు మధ్య ఒక చిన్న గ్రామముంది. ఆ ఊరి పురాతన వీధులలో వరసగా రాళ్ళ తోరణాలు కట్టబడ్డాయి. చైనాలో సాధారణంగా గ్రామాల్లోను పట్టణాలలోను ఇలాంటి తోరణాలుంటాయి. అలంకారం కోసం కట్టారా అన్నట్లుంటాయి కాని నిజానికి అవి గౌరవనీయులగు విద్వాంసుల యొక్క సుగుణశీలలగు స్త్రీల యొక్క జ్ఞాపక చిహ్నాలు. చిన్నప్పుడే భర్తను కోల్పోయి యావజ్జీవమతనికే అంకితమై మరి పెండ్లాడని వితంతువుల పవిత్రతను కీర్తించుట కీ తోరణాలుకట్టేవారు. ఇట్టివి కట్టాలంటే చక్రవర్తి అనుజ్ఞకావాలి. స్త్రీలలో అట్టి అచంచల ప్రేమను పురుషులు మెచ్చుకొంటారుకాని అలా ఉండడం ఎంత కష్టమో యీ కథవల్ల తెలిసి వస్తుంది.

"మైహూవా, లోపలికిరా, ఎదిగినదానవు గుమ్మం దగ్గర నిలబడొచ్చా?" అంది తల్లి, వేన్‌సతి, తన కుమార్తెతో. సిగ్గుతో తలవంచుకొని లోనికి వచ్చేసింది కూతురు. ఆమె అపురూప సుందరి. ఎఱ్ఱని పెదవులు, ముత్యాలలాంటి పళ్ళు, పీచ్ పువ్వులాంటి దేహచ్ఛాయ. కొంచెం పెంకితనం, పట్టుదలా ఉన్నా మైహూవా దాపరికం లేనిది. పల్లె గ్రామాల్లోనే ఇలాంటి పిల్లలుంటారు. తలవంచుకొని లోపలి దారి పట్టినా

ఆమె అడుగులు అనిష్టంగానే పడుతున్నాయి. కోపంతో గుండెకొట్టు కొంటూనే ఉంది.

"తక్కిన వాళ్ళ పిల్లలు బయటికొచ్చి చూడ్డం లేదేమిటి?" అంటూ వెళ్ళిపోయింది లోపలికి. డెబ్భై, ఎనభై మంది సైనికులా వీధిని ఎక్కడికో వెళ్ళుతున్నారు. వాళ్ళ తప్పెటల ధ్వనితో నాసన్నగులకరాళ్ళ రోడ్డు ప్రతి ధ్వనిస్తూఉంది. మగాళ్ళు ఆడాళ్ళు ఇళ్ళల్లోంచి బయటికివచ్చి సైనికు లెక్కడికి పోతున్నారాయని చూస్తున్నారు. కాస్త వయస్సు మీరిన ఆడవాళ్ళు బయటి గోడదాక వచ్చి చూస్తున్నారు. యువతులు మాత్రం గుమ్మాల దగ్గర వెదురు తడకలలోంచి తాము కనపడకుండా చూస్తున్నారు.

మైహూవా మాత్రం తడకలు దాటివచ్చి, ఇంటి బయట నున్న ఎత్తురాతి మీద నిలబడి చూస్తూంది. బయటపోయే వాళ్ళకి కనబడుతూంది. సైనికులకు చివర వస్తూఉన్న కేప్టెన్ కొంచెందూరంనుంచే ఆమెను చూశాడు. వయస్సులోఉన్న యేచిన్నదైనా అతని కంటి కానుతుంది. అతడు ముందుకు సాగి పోతూఉంటే మైహూవా చిరునవ్వు నవ్వింది. ఆమె సుందరముఖాన్ని తలత్రిప్పి మరోసారి చూచి ముందుకు సాగాడతడు.

ఒక దొంగల గుంపు సమీపాన్ని నీలపు కొండల్లో దాగుకొని చుట్టు ప్రక్కల ప్రాంతాలపై దాడులు దౌర్జన్యాలూ జరుపుతూంది. వాళ్ళను పట్టుకోడానికి ముప్ఫై మైళ్ళ దూరానున్న సూచౌ నుంచి వచ్చిందీ సైన్యం హంచివాంగ్‌కు. కాని హంచివాంగ్ లాంటి చిన్న గ్రామంలో సైనికులనుంచడానికి ఇళ్లు తక్కువ. వాళ్ళని దేవాలయాల్లో నిలిపి, ఆఫీసర్లు మాత్రం కాస్త నిద్రపోడానికైనా వీలుండే ఇళ్ళల్లో ఉంటారు. ఈ సంగతి మనస్సులో ఉండే, ఇల్లు గుర్తు పెట్టుకోడానికే కేప్టెన్ మరొక

సారి చూశాడు మైహువావైపు. సైనికుల కేర్పాట్లుచేసి, మధ్యాహ్నం వాళ్ళింటి కొచ్చాడు "ఆతిథ్యం దొరుకుతుందా" అంటూ. ఆ ఇంట్లో మైహువా తల్లి, తాతమ్మా ఉన్నారు. వాళ్ళిద్దరూ వితంతువులే. ఆ ఊళ్లో రెండు మూడు నెలలు ఉంటామని, సాధారణంగా తాను ఊరులో ఉండనని, కాని ఉన్నప్పుడు పడుకోడానికి కాస్త జాగా ఇస్తే చాలునని చెప్పాడు. తరువాత మాటల్లో ఆ యింట్లో మగవాళ్ళే లేరని తెలుసు కొన్నాడు. ప్రొద్దున్న తాను చూచిన యువతి అక్కడే ఉంది. తన వాళ్ళతనికి సరే అంటే బాగుండునని ఆరాట పడుతూంది.

తాతమ్మ అరవైయేళ్ళది. ముఖం ముడతలు పడ్డాయి. నల్లని ముఖమల్ గుడ్డ తలకు కట్టుకొంది. తల్లి, వేన్‌సతి, ముప్పైయేళ్ళది. ఆమె అందం ఏమీ తగ్గలేదు. సన్నగా పొడుగ్గా ఉంది. ముక్కు తీర్చి దిద్దినట్లు ఎత్తుగా ఉంది. నోరు చిన్నది. కూతురు రూపానికి మెరుగుపెట్టి కొంచెం శాంతం అద్దితే ఎట్లుంటుందో అలా ఉంది తల్లి. కూతురులో కనిపించే విలాసం చాంచల్యం ఆమెకు లేవు. ఆమెలో ఉద్రేకాగ్ని ఆరి పోలేదు కాని అణిగిఉంది. ఆమె ముఖంమీద ముసుగుఉంది. సేనాధిపతి తన్ను చూడగానే చిన్న నవ్వువచ్చినా అణుచుకొంది. తెలివి నొలుకుతూ చకచకలాడుతున్న ఆమె కళ్ళు చూడగానే ఆమెలో అర్థంచేసుకోవలసిన విషయాలు కప్పబడి ఉన్నాయని అతనికి తోచింది.

మూడుతరాల ఆడవాళ్ళున్న యీ యింట్లోకి పరాయి మగవాణ్ణి రానివ్వడం ఎన్నడూ జరగనిదే. కాని ఆ యువకోద్యోగిని చూచేసరికే స్త్రీ హృదయానికైనా అది అంత విషయంగా తోచదు. ఒత్తుగా పెరిగిన నల్లని జుట్టు, బలిష్ఠమైన భుజస్కంధాలు, సన్నగా పొడుగ్గా చక్కని రూపురేఖలుగల మూర్తి. సాధారణంగా సైన్యాల్లో ఉండే మోటుజాతి, చదువు సదభ్యాసాలులేని బూతుల బుంగకాడు. తుప్పున ఉమ్మివేస్తూ,

విరామం లేకుండా ప్రగల్భాలు కొడుతూ, పెద్ద డాబుదర్పంతో విర్రవిగిసే రకంకాదు. పియాంగ్‌లోని సైనిక విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడు. సంస్కృతి గల వాక్కు; సంస్కారం గల సభ్యత; శిష్టాచార సంపత్తి గల పెద్ద మనిషి. రీ సంగ్ అతని పేరు. రీ కుటుంబ నామం; సంగ్ అసలు పేరు,

"నా భోజనం బరువు మీ కక్కరలేదు. కాస్త స్నానానికి పడుండ డానికి స్థలం ఇస్తేచాలు. ఎప్పుడైనా టీ ఇస్తే ఇవ్వండి'' అన్నాడు సంగు. ''ఇది నీ హోదాకు తగిన ఇల్లుకాదు. కాని నీ కిష్టమైతే ఊరిలో ఉన్నప్పు డిక్కడ ఉండొచ్చు'' అంది వేన్‌సలి. ఇల్లు కొంచెం హీనంగా ఉన్న మాట నిజమే. వెలుతురు కొంచెం తక్కువే. ఎక్కువ అలంకారాలు లేకపోయినా, ఉన్న సామాను నాగరికంగానే ఉంది. తుడిచి తుడిచి కర్ర సామాను రంగుపోయింది. ఇల్లు మట్టుకు చక్కగా శుభ్రంగా సర్దిఉంది. వెదురుమంచం ముందున్న వసారాలోవేసి, పెరటివైపు కూతురు, తల్లి పడుకోవచ్చు. ఇంట్లో ముసలమ్మ ఉండటంవల్ల పుకార్ల కవకాశంలేదు.

అతణ్ణి చూసేసరికి వితంతువు లిద్దరికీ తమ మైహువాకు తగిన వరుడనిపించింది. ఆమె చక్కని చుక్క. తల్లి రూపురేఖలలోని నాజూకు తనం పూర్తిగా రాకపోయినా, ఆమె ముక్కు అందం, కళ్ళ చకచకలు కూతురికీ వచ్చాయి. ఎందరో మైహువా అందం మెచ్చుకుంటూ పెండ్లీడు వచ్చిన పిల్ల అని చూస్తున్నారు. ఐతే వేన్‌కుటుంబములోని పురుషులను గూర్చి ఒక మూఢ విశ్వాసం బయలుదేరింది. అప్పుడే యీ ఇంట్లో ఇద్దరు వితంతువులున్నారు. తండ్రి, తాత కూడ పెళ్ళయిన కొన్నాళ్ళకే చని పోయారు. రెండుసార్లిట్లు జరిగిన ఇంట్లో మూడవసారి మాత్రమెట్లెం దుకు జరగకూడదు ? కాబట్టి మైహువాని పరిణయ మాడడమంటే ప్రాణాలు పోగొట్టుకోవడమే అన్న భయం. అదీగాక వాళ్ళ కీ ఇల్లుతప్ప

ఆస్తి లేదు. ఆమె అందాన్ని వలచిన యువకుల్ని వాళ్ళ తల్లిదండ్రులు మందలించేవారు. కాబట్టి యేపుగా పెరిగిన పందొమ్మిదియేండ్ల పిల్లయినా, మైహువా పెండ్లి మాట యింకా లేనేలేదు.

కేప్టెన్ లీ సంగ్ రాకతో వారింట్లో మార్పు కలిగింది. అతడు మైహువా సాంగత్యంలోనే చాలాకాలం గడిపేవాడు. ముసలమ్మ యెడల వినయవిధేయతలు, వేన్‌సతి యెడల శూరుని శుభలక్షణములుగల మనోజ్ఞత, చక్కని మాటకారితనము చూపుతున్నాడు. ప్రేమికుడగుటచే ఉల్లాసం చూపేవాడు. తాను సంతోషంగా ఉండి ఇతరులను సంతోషపరచేవాడు. ఆ వితంతువుల ఇంట్లోకి ఎన్నాళ్ళనుండో లేని మగవాని కంఠాన్ని మారుమ్రోగే నవ్వునూ తెచ్చిపెట్టాడు. ఎప్పటికీ తమతోనే ఉండి పోతాడని వారికాశ గలిగింది.

వేన్‌సతి హాలులోఉంది. కేంపునుంచి వచ్చిన సంగ్ హాలులో వేన్‌సతిని కలుసుకొన్నాడు. ఒక చిన్న అలమారులో కావ్యాలు పురాణాలు ఉన్నాయి. కొన్ని చాలా పెద్ద గ్రంథాలు. ఆడవాళ్ళు చదవగలవి లాగా లేవు. కొన్ని చౌకబారు ప్రేమ కథలు నాటకాలు, కొన్ని చిన్న పిల్లల పుస్తకాలు కూడ ఉన్నాయి. పుస్తకాలు చూపుతూ కేప్టెన్ ''మీ వద్ద మంచి గ్రంథాలయం ఉందే" అన్నాడు. "మీరు చూడొచ్చు ఇవి నాభర్తవి" అంది వేన్‌సతి. ''ఈ పిల్లల పుస్తకాలేంటి? పిల్లలులేని యీ ఇంట్లో ఇంత బాల సాహిత్యం ఉందేమిటి? అన్నాడు కేప్టెన్. వేన్‌సతికి కొంచెం సిగ్గుఅయింది. ''నా కంత విశేషం చదువు లేక పోయినా బాలబాలికలకు చదువు చెప్పుతున్నాను" అంది. ''పిల్లల సాహిత్యం" అనే పుస్తకమొకటి, "స్త్రీ ధర్మములు"అని పాన్‌ఛోవా వ్రాసిన గ్రంథమున కనేక ప్రతులు, జేమాక్వాంగ్ వ్రాసిన ''కుటుంబ గౌరవం"అనే గ్రంథం మూడు నాలుగు ప్రతులున్నాయి. పిల్లలకు బోధించుటకివే వాడేవారు.

"ఇలాగ సంపాదన చేస్తున్నారా? మీ కాధారమేమిటా అనుకొనే వాణ్ణి" అన్నాడు కేప్టెన్. ఆమె నవ్వుతూ, "ఎలాగో కాలం గడుస్తూంది. మేమిద్దరం వెనక బుద్దేవారీ పనిచేసేవాళ్ళం. ఇప్పుడు ఇంటి దగ్గర చదువు చెప్పుతున్నాను. ఆడపిల్లలు మంచి కోడళ్ళుగా సంచరించడానికి కావలసిన నైతిక బోధన ఇస్తానని చాలా కుటుంబాలు తమ పిల్లల్ని నావద్దకు పంపుతారు" అంది.

చూషీ ఉపదేశ సంపుటి తీశాడు. కన్ఫ్యూషియన్ నైతిక శాస్త్రవేత్తలకిది అభిమాన గ్రంథం. దీంట్లో వేదాంతం ఎక్కువ. "అది నా భర్తది. ఆ గ్రంథం మాలాంటి ఆడవాళ్ళకు కాదు. నాకంత చదువు లేదని చెప్పేను కదా! ఆడదానికి తల్లిగా, భార్యగా, తోబుట్టువుగా, కూతురుగా, కోడలుగా, ప్రవర్తించుకోవడంలో ప్రధాన విషయాలు తెలిస్తే చాలు. తల్లిదండ్రుల యెడల భక్తి గల్గి వినయవిధేయతలతో పవిత్ర జీవితం గడిపితే చాలు" అంది. "మీ దగ్గర నేర్చుకొన్న పిల్లల కీ గుణాలు తప్పక వస్తాయి. మీ భర్తగారు కూడా కన్ఫ్యూషియన్ మతము వారై యుండి ఉండాలి" అన్నాడు కేప్టెన్. ఆమె మాట్లాడలేదు. బహుశా భర్తను గూర్చి మాట్లాడడ మామెకు కష్టంగా తోచిందేమో. ఆమె మాటల్లో వినయమూ ఉంది, గర్వమూ ఉంది. ఆమె యౌవన రూపము స్నేహభావము అతణ్ణి ముగ్ధుణ్ణిచేశాయి. అతడామె కూతుర్ని ప్రేమిస్తున్నా తల్లిలోనే సంస్కృతి, దుఃఖములో పుట్టిన ఓరిమి, ఉన్నత విషయాల యెడల అనురాగం చూశాడు. అందుచేతనే ఆమె అట్టి స్థితిలో కూడ సంతృప్తితో ఉంది. వాళ్ళ కులంలో ఆమెకొక గౌరవ స్థానం ఉందనీ, ఆమెకులం వారామెకు పవిత్రతోరణం ఎత్తించాలని ప్రయత్నాలు చేస్తున్నారని కేప్టెన్‌కు తెలియదు.

లిన్‌చెంగ్ వెళ్ళి వచ్చిన తరువాత, ఒకనాడు ఆ ఇంటికి వెనక వైపు కాయగూరల తోటఉందని కేప్టెన్ గమనించాడు. వంటింట్లోంచి

వారి. ఒక రోజు మైహూవా సామానులు కొనడానికి వెళ్ళటంవల్ల కేప్టెన్‌కు కనబడలేదు. ఆమె ఎక్కడ అని అడగలేక తాతమ్మ ఎక్కడా అని అడిగాడు కేప్టెన్. "వెనక తోటలో ఉందేమో వెళ్ళి చూడు" అంది వేన్‌సతి. ఇంటికన్న తోట విశాలంగాఉంది. కొన్ని ఫలవృక్షాలు కొన్ని పూలమొక్కలు ఉన్నాయి.

కాబేజీ మొదలగు కాయగూరల మొక్కలు బారులుగా నాటారు. ఇరుగు పొరుగువారి గోడలు తోట కావరణ. తూర్పువైపు గేటు. దాని ప్రక్క ఒకేగది. అది తోటమాలికి. దాని ప్రక్క కోళ్ళదొడ్డి. గేటు తీసుకు వెళ్ళితే ఒక చిన్న సందుంది. ఒక పాతకుర్చీలో కూర్చుని ముసలమ్మ ఎండకాగుతూఉంది. వేన్‌సతి శుభ్రమైన నల్లని దుస్తులు దాల్చింది. అప్పటి ఆచార ప్రకారం తల వెంట్రుకలు ముందు కణతలవైపు ఎత్తుగా ముడి వేసింది. కేప్టెన్‌తో తోటలో తిరుగుతూంది. ఆమె ముఖంమీద వినయం గర్వం కలిసి రాణిస్తున్నాయి. కళ్ళల్లో ప్రశాంతమైన కాంతి ఉంది. ఈమె తలుచుకుంటే ఏనాడో పెండ్లాడగలిగి ఉండేది అనుకొన్నాడు కేప్టెన్.

"మీరే ఈ తోటంతా పెంచారా?" అని కేప్టెన్ అడిగాడు. "లేదు చాంగ్ పెంచుతాడు" అంది వేన్‌సతి. "చాంగ్ ఎవరు" అని అతడడిగాడు. "మా తోటమాలి. దోసకాయలు, పుచ్చకాయలు, కాబేజీలు ఎక్కువగాఉంటే, బజారుకూడా వెళ్ళి లాభాని కమ్ముకొస్తాడు. ఇంత నమ్మకమైన వాణ్ణి నేను చూడలేదు. ఆ గదిలో పడుంటాడు" అని గేటు ప్రక్కగదిని చూపింది.

ప్రక్క గేటులోంచి అప్పుడే వచ్చాడు చాంగ్. నడుముకు మాత్రం గుడ్డ ఉంది. ఎండాకాలం. కండలుతీరిన అతని దేహం వెలుతురులో మెరుస్తూంది. నలభై యేళ్ళుంటాయి. తల వెంట్రుకలు పైకెగగట్టాడు.

ముఖంలో అమాయకత్వం ముచ్చటేస్తూ ఉంది. అతని అంతస్థు ఏమైతే నేం? ముఖంలో బెంగా విచారం లేవు. శరీరం నవనవలాడుతూ దృఢంగా ఉంది. అతణ్ణి కేప్టెన్‌నుకు చూపిందామె. నూతి దగ్గరకు వెళ్ళి చాంగ్ ఒక బాల్చీడు నీరు తోడి, గుమ్మడి డొలకతో త్రాగి, తక్కిందీ చేతుల మీద పోసుకొని కడుక్కొన్నాడు. అతని నిరాడంబరత్వం మనోజ్ఞంగా ఉంది. నీళ్ళు త్రాగుతున్నప్పు డతని కంఠంమీద యెంత తళతళ మెరిసే సరికి వేన్‌సతి పెదవులు వణికాయి.

"ఇతడు లేకపోతే మేం ఏమయిపోయేవాళ్ళమో? జీతంకూడా అడగడు. నా అనేవాండ్లు లేరు. కడుపుకు తిండి, పడుకడానికి ఇంత స్థలం ఉంటే చాలు. డబ్బెందు కంటాడు. వీళ్ళమ్మకూడ మావద్దే ఉండేది. తల్లంటే ఎంత భక్తి! ఇప్పు డొంటరివాడై పోయాడు. ఇంత స్వచ్ఛంగా, న్యాయంగా ఉండటం, కష్టపడి పని చేయడం నేనెక్కడా చూడలేదు. క్రిందటి సంవత్సర మొక షర్టు కుట్టి యిచ్చాను. అది తీసుకోడాని కొప్పించేసరికి తలప్రాణం తోకకొచ్చింది. మే మతని కిచ్చేదానికంటే, అతడే మాకెక్కువ సేవ చేస్తున్నాడు పాపం" అంది వేన్‌సతి.

భోంచేసి కేప్టెన్ తోటలోకి వెళ్ళేసరికి చాంగ్ కోళ్ళదొడ్డి రాట్లు పాతుతున్నాడు. కేప్టెన్ సాయం చేస్తానన్నాడు. తరువాత ఈ కోళ్ళదొడ్డికి వేన్‌సతి జీవితంలో ఎంత ప్రాధాన్యం ఉందో అనుకొని నవ్వుకున్నాడు. జీవితంలో చిన్న విషయానికికూడా చిత్రంగా ఎంతో ప్రాముఖ్యం ఉంటుంది.

వేన్‌సతిని గూర్చి చాంగ్‌తో మాట్లాడసాగాడు. "ఎంత మంచి అమ్మగారండి", అని చాంగ్ అందుకొన్నాడు. "ఆమె లేకపోతె మాఅమ్మ ముసలి కాలం అంత సుఖంగా గడిచేదా? వీరిద్దరికీ పవిత్ర తోరణా లెత్తించ డానికి రాజగురువులవారు ప్రయత్నిస్తున్నారట. ముసలమ్మగారి

యిరవయ్యోయేట ఆమె భర్త పోయాడు. ఆమె కొక్కడే కొడుకు. ఆయనకు మా అమ్మగారిని పెళ్ళిచేశారు. ఆయన ఒకనాడు తల దువ్వు కొంటూనే నేలమీపడి మరణించారు. చాలాకాలం అయింది. పద్దెనిమి దవయేట అమ్మగారు విధవ అయ్యారు. అప్పటి కామె గర్భిణి. పిల్లని కంది. అలాంటి వయస్సులో యావజ్జీవ వైధవ్యమా? వంశం పేరు నిలిపే పుత్రుడులేని జన్మ ఏం జన్మలెండి? అమ్మగారిక పెళ్ళాడనన్నారు. ఇంట్లో పంటీకుల పూజ నడవడానికన్నా ఒక పిల్లవాణ్ణి పెంచుకోమంది ముసలమ్మ గారు. కొంవరికి పదేసిమంది పిల్లలు పుట్టుకొస్తారు. కొంవరికి పుట్టనే పుట్టరు. ఈ ఇంట్లో పురుషులకు శాపముందన్న పాడుపేరు వచ్చింది. ఎవ్వరూ తమ పిల్లల్ని పెంపకాని కివ్వలేదు. ఆ ఒక్క కూతురు చక్కని చుక్కలాగ పెరిగింది. కేప్టెన్, నీవాపిల్లను పెండ్లాడరాదూ? మా గొప్ప ఇల్లాలౌతుంది" అన్నాడు. చాంగ్ అమాయికత్వంచూచి కేప్టెన్ నవ్వాడు. మైహూవా సొగసు నితడు తనకు పొగడిచెప్పాలా?

"పవిత్ర తోరణం అంటే ఏమిటి?" అని చాంగ్‌ని కేప్టెన్ అడి గాడు. "తెలియదూ? ఈ ఊరు మొత్తానికొక హ్యూ కుటుంబానికే ఉంది అలాంటి పవిత్రస్మృతి చిహ్నం. వేన్ కుటుంబం వారికి హ్యూ కుటుంబం ఓంద అసూయ కల్గింది. రాజగురువుగారి దీ వేన్ కుటుంబమే. అందుకని తమ కుటుంబంలోని యీ యిద్దరు స్త్రీలను గూర్చి చక్రవర్తికి వ్రాశారు. ముసలమ్మగారప్పుడే నలభైయేండ్లనుండి వైధవ్యం పాలిస్తూఉన్నారు. వీరిద్దరి పేరుమీద ఒక శిలాతోరణం కట్టించడానికి చక్రవర్తికి విన్నపం చేస్తారట" అని చాంగ్ చెప్పగా, "నిజమేనా?" అని కేప్టెన్ ఆశ్చర్యంతో అడిగాడు. "మీతో వేళాకోళ మాడతానా? చక్రవర్తి ఒక స్త్రీని గౌరవించడ మంటే ఇదేం వేళాకోళపు సంగతా? అనుజ్ఞతోపాటు చక్రవర్తిగారు వెయ్యి రూపాయలు కూడ పంపుతారట. అప్పుడు గౌరవంతోపాటు ధనంకూడ కలిసివస్తుంది. ఆవిడ దానికి తగిందే! మా అమ్మగారింకా వయస్సులో

ఉన్నారు. అంపంగా ఉన్నారు. ఎంతమంది పెండ్లాడాలనుకొంటున్నారో! పెండ్లాపి లేచిపోక, ముసలి అత్తగారి కోసం ఈ కుటుంబంలోనే ఉండి పోయి వృద్ధాప్యంలోనున్న అత్తగారి సేవచేస్తున్నారు. ఏమి ఇల్లాలండీ! అందుకే ఆమెకు తోరణం కట్టుతున్నారు. మైహూవా పెండ్లయితే పూర్వీకుల పూజ జరుగుతుందని ఆమె విశ్వాసం.

కేప్టెన్ ప్రయాణాలమీద వెళ్తున్నాడు, వస్తున్నాడు. దొంగల్ని పట్టడంలోకంటే మైహూవాను పట్టడంలోనే యెక్కువ అసక్తి చూపుతున్నాడు. మైహూవా ప్రేమవంటి ప్రేమను కేప్టెన్ యిదివరకు చూడలేదు. అంతగా ప్రేమిస్తూ ఉంది. ఆమె కతడు వశుడయ్యాడు. అతణ్ని తా నెందుకు ప్రేమిస్తూ ఉందో, అతనిలో తానేమి మెచ్చుకొంటూ ఉందో మర్మంలేని మనస్సుతో మైహూవా చెప్పేసేది. ఇంత అమాయకంగా ఉన్న దున్నట్లు చెప్పే పిల్ల నిదివరకు కేప్టెన్ ఎక్కడా చూడలేదు. ఆమె మెప్పుకు కేప్టెన్ ఉబ్బిపోయేవాడు. ఆమె చిన్నతనం, చిలిపితనం, విలాసము, కేప్టెన్ కమితానంపం కలిగించేవి.

వాళ్ళిద్దరి వాలకం బట్టి వాళ్ళ ప్రేమ ఇంట్లో పెద్దవాళ్ళకు స్పష్టమౌతూనే ఉంది. కేప్టెన్ కిరవై యేడేండ్లు. ఒంటరివాడు. వాళ్ళిద్దరికీ పెళ్ళి భగవన్నిర్ణీతమేనని అప్పుడే ముసలమ్మ జ్యోస్యం చెప్పుతూంది. వాళ్ళు మితిమీరి ప్రవర్తించకుండా జాగ్రత్త తీసుకొంటూనే ఉన్నారు. ముసలమ్మ పడమటి గదిలో పరుంటుంది. తల్లీ కూతురు దొడ్లో తూర్పు గదిలో పరుంటారు. భోజనాలవగానే దొడ్డి తలుపుకు తాళం వేసేస్తారు. వేన్ దొడ్డి తలుపుకేగాక తమ గదికి కూడా తాళం వేస్తూనే ఉంది కాని దగా పడుతూనే ఉంది. ఎందుకంటే కేప్టెన్ ఒకొక్కప్పుడు కేంపులోనే ఉండిపోతాడు. మైహూవా వెళ్ళి అతణ్ని అక్కడే కలుసుకొంటూంది. మధ్యాహ్నం వెళ్ళి ఒక్కొక్కసారి రాత్రి భోజనానికి కూడ ఆలస్యంగా

వస్తుంది. కేప్టెన్ ఊరిలో లేడనుకొన్న రోజుల్లోనే ఇలాగ జరిగేది. ఒకరోజున భోజనాలయ్యాక రెండు గంటలకు వచ్చింది. అది జూలై నెల. పగటి పొద్దెక్కువ, రాత్రి పొద్దు తక్కువ. మైహువా కేప్టెన్, లిచ్చు చెట్ల నీడల్లో ఊరవతల పెద్ద సరస్సు ప్రక్కనుంచి అడవులలోకి పోయేవారిని వెళ్ళారు. ఊరవతల ప్రశాంతంగా ఉంది. ఎండ తీక్షత తగ్గింది. సుంపర మైన అడివిలోంచి చల్లటిగాలి వీస్తూంది. బండల మీద పట్టిన నాచు తళ తళ మెరుస్తూంది. దూరాన్ని మరోచక్కని సరస్సు ఉంది. కేప్టెన్ తన ప్రక్కనుండే మైహువాకి జీవితం పరిపూర్ణం అనిపించింది. వాళ్ళిద్దరు శాశ్వతంగా ప్రేమ ప్రమాణాలు చేసుకొన్నారు. మైహువా సంగ్‌తో తనతల్లి నెంతమంది పెండ్లాడుతామని వచ్చారో, అందాని కెంత పేరు పొందిందో, ఎలాగ అందర్నీ నిరాకరించిందో చెప్పుతూ, "అదే నేనైతే ఎప్పుడో మళ్ళీ పెళ్ళాడి ఉండేదాన్ని" అంది.

"మీ అమ్మ అంటే నీకు గర్వంలేదా" అన్నాడు సంగ్. "ఆ, ఉంది. కాని స్త్రీ ఎవరినన్నా పెండ్లాడి కాపరం చెయ్యాలి కాని ఇలాకాదు, అస్తమానం మా ఇంట్లో కన్‌ఫ్యూషియన్ నీతులు వల్లిస్తూ ఉంటారు. నాకు విసిగెత్తిపోయింది" అంది మైహువా. మైహువా చిన్నదికదా! తల్లీ, తాతమ్మ చూపిన ఆదర్శం ఆమె హృదయంలోని పొంగు నణచలేక పోయింది." మీ అమ్మ చేసిన పని యే మహాసుగుణవంతురాలో మాత్రమే చేయగలదు "అన్నాడు సంగ్." ఆడదెందు కనుకున్నావు? పెళ్ళాడి, ఇల్లునడిపి, పిల్లల్ని కని పెంచడానికికాదా?" అని ఉద్రేకంతో అంది మైహువా. చిన్నతనంలో మా తండ్రి పోవడం మా తల్లి కెంత దుర్భరం! దాంట్లోను మా కాస్తులు లేవుకదా! మా అమ్మ నెంతైనా మెచ్చుకుంటాను కాని-" అని ఆగింది మైహువా. "కాని, ఏమిటి" అన్నాడు సంగ్. "ఈ పవిత్ర తోరణాలలో నాకు నమ్మకం లేదు" అని మైహువా అనగానే కేప్టెన్ కమితాశ్చర్యం వేసింది.

"నేను పెద్దదాన్నయ్యాక యీ విషయంగూర్చి ఆలోచించేదాన్ని. మా అమ్మవి పెద్దకోరికలు. కఠిన నియమాల నవసరంగా నెత్తిమీద పెట్టుకొంటుంది. పవిత్ర వితంతుత్వంటే ఎక్కడలేని ఖ్యాతిగదా! మా అమ్మకా ఖ్యాతి కావాలి....ఏదో వాగేస్తున్నాను" అని మైహూవా తగ్గింది. వాళ్ళమ్మకు, మామ్మకు వాళ్ళ వంశంవారు కట్టబోతున్న పవిత్ర తోరణం సంగతి సంగ్ ఆమె నడిగాడు. "మా అమ్మనుగూర్చి నాకు సంతోషమేకాని మనం పెండ్లాడి వెళ్ళిపోదాం. మా మామ్మ ఆరోగ్యం అంతమాత్రమే. ఒక్కతే వెయ్యిరూపాయి లేమిచేసుకొంటుంది. నా అనే వాళ్ళెవ్వరూ లేకుండా మరో ఇరవై సంవత్సరాలు పనికిమాలిన కీర్తిబంధంలోపడి చివరికి సాధువమ్మగారనిపించుకొని చస్తుంది.

లీ సంగు కామె మాటలు వినోదంగా ఉన్నాయి. యౌవనంలో ఉన్న మైహూవాకి నచ్చచెప్పడమెలాగ? ఇద్దరు వితంతువుల ప్రేమరహిత జీవితాల్లో పాల్గొని పరిశీలన జరిపిందికదా. ఆమె చెప్పుతూ ఉంది తెలిసే చెప్పుతూందేమో!

సూర్యు డస్తమిస్తున్నాడని చప్పున గ్రహించి, "అయ్యో, సంగూ, నేను పరిగెత్తాలి. ఇంత ఆలస్యమైందని తెలియలేదు" అంది మైహూవా.

ఈ సారి కేప్టెన్ ఊరిలో లేనప్పుడొక సంగతి జరిగింది. కేప్టెన్, మైహూవా కలిసి ఊరులోను, పడమటి కొండలవైపు బాటమీద తిరగడం చూచిన ఇరుగుపొరుగువారు వేన్ సతికి చెప్పారు. తల్లికూడా అంతా కనిపెట్టుతూనే ఉంది. కూతుర్ని నిలదీసి అడిగింది. ఏడుస్తూ మైహూవా తన తప్పు ఒప్పుకొంది. కాని కేప్టెన్ తన్ను పెండ్లాడతానని మాట యిచ్చాడంది. తల్లికి అమితమైన ఆగ్రహావేశం కలిగింది. "నా కూతురే నా యింటి కింత అపఖ్యాతి తెస్తుందని నే నెన్నడూ అనుకోలేదు. చూడు, మీ మామ్మ నేను యీ ఊరికే ఆదర్శంగా ఉన్నాం. మన వేన్ కుటుంబా

నికే మచ్చ తెచ్చావు. ఇరుగుపొరుగుల కెంత లోకువై పోతాం. నా కూతురే — — " అంటూఉంటే, కన్నీళ్లు తుడుచుకొంటూ మైహూవా, "నేనేమీ సిగ్గుపడ నక్కరలేదు. అతణ్ణి ప్రేమించడం సిగ్గుబాటు పనికాదు. నాకు పెళ్ళీడు వచ్చింది. అతడు నీకు నచ్చకపోతే మరొకణ్ణి చూడు. నే నేమో వయస్కురాల్ని. ఈ పేర్మి శూన్యపుటింట్లో కుళ్ళి చావను. నీది పవిత్ర వైధవ్యమంటావు. అది వట్టిగుల్ల జీవితం. దాంట్లో మెచ్చుకోతగ్గది నాకేమీ కనబడలేదు" అంది.

ఆశ్చర్యంతో, దిగ్భ్రమతో వేన్‌సతి కూపిరాడలేదు. "ఏమిటే అంటున్నావు" అంటూ తూలిపోతూ ఆయాసపడుతూంది తల్లి. "ఔనే, అమ్మా ఇంకా చిన్నదానివే కదానీవు, ఎందుకు పెళ్ళాడకూడదు" అంది మైహూవా. "ఆసినీతల మీద పిడుగుపడ, నీ నోరు పడిపోను" అని శపించింది కూతుర్ని.

ఆ అమాయకపు పిల్ల తప్ప మరొకరంత సూటిగా స్పష్టంగా సత్యాన్ని తెలుపలేరు. ఆమాట తల్లికి ఫిరంగి గుండులాగ తగిలింది. ఆమెకెంత బాధకలిగిందో మైహూవాకు తెలియదు. మళ్ళీ పెళ్ళి అంటేనే ఆమెకు అసహ్యం, భయంకరం అది ఆలోచించతగ్గ విషయమేకాదు. ఇన్ని సంవత్సరాలు నీకు మంచి బుద్ధులు నేర్పాను. నీకు సిగ్గు, ఎగ్గూ లేవటే అంది తల్లి కోపంతో.

• వేన్‌సతికి దుఃఖం ముంచు కొచ్చింది. గుండె కరిగి పోయేటట్టు యేడ్చింది. ఒక్కొక్క సందర్భంలో ఒక చిన్న మాటే ఎంతపని చేస్తుంది! ఈ పంతొమ్మిది సంవత్సరాలు తనలోతాను కుమిలి పోతూ సహించిన బాధలన్నీ ఆ కన్నీళ్ళతో పైకుబికాయి. ఎంతబాధ పడింది! ఇన్ని సంవత్సరాల త్యాగాన్ని, సంయమనిష్ఠనూ తన కూతురే నేటికెత్తి పొడుస్తూఉంది! బాల్యం నుంచి నేటిదాక తన పవిత్ర వైధవ్యనియమాన్ని

ఆక్షేపించిన వారి నెవరిని తాను చూడలేదు. ఇది సూర్యుణ్ణి ఆక్షేపించడం లాంటిది. తాను మళ్ళీ పెళ్ళి చేసుకోవడం యేమీ అసంభవం, అసహజం కాదు. కాని ఇన్నేండ్లూ కూడ ఆ ఆలోచన తనకు తట్టలేదు, దాన్ని గూర్చి తర్కించినదీ లేదు. అట్టి ఉద్దేశమెప్పుడైనా ఒకప్పుడు తల యెత్తినా ఎప్పుడో దాన్ని తన మనస్సులోంచి నెట్టేసింది. ఈ నాటి వరకు దాని ప్రశంసేరాలేదు.

కూతుర్ని తిట్టడం మానేసి తానే దుఃఖంలో క్రుంగి పోయింది. తల్లిని చూచి భయమేసి మైహువా మరి మాట్లాడలేదు. కూతురి ఎత్తి పొడుపు మాటల భారం క్రింద తల్లి నలిగి పోయింది. తాను వితంతువు దుఃఖ జీవితం డొల్ల అంటే, అది నిజం, అక్షరాలా నిజం. తన చేతులతో తన ముఖాన్ని కప్పుకొని బల్లమీద కొరిగి యేడుస్తూనే ఉంది. కాస్సే పటికి మరొక విషయం మనస్సులోకి వచ్చింది. మైహువా కేప్టెన్‌తో పొందే ఆనందం యదార్థమైంది. తనకు వయస్సులో అలాంటివాడు దొరికితే........? ఏమిటో, ఆమె కంతా గందరగోళంగా ఉంది.

కేప్టెన్ వచ్చే వరకు వేచిఉండాలి. ఈ లోగా కూతురు వెళ్ళి అతని కెమైన్నా చెప్పుతుందేమో, లేక ఆతనితో లేచి పోతుందేమో, అందుకని ఆమె నొక గదిలో పెట్టి తాళం బిగించారు. తరువాత మూడు రోజులకు కేప్టెన్ వచ్చాడు. వేన్‌సతి మాత్రమతనికి కనబడింది. నిరు త్సాహంగా ఉంది. "మైహువా యేది?" అని అతడడిగాడు. "లోప లుంది. దానికేం బాగానే ఉంది" అంది. "బయటికి వచ్చింది కాదేం" అన్నాడు పెదవులు బిగించి, బరువు కంఠంతో" అలా అడుగుతావనే చూస్తున్నా. ఊళ్ళోనే ఉండి ఏకాంత స్థలానికి వస్తుందని చూస్తుంటావు. రాలేదేమా అని అనుకొంటున్నావు." "ఏకాంత స్థల మేమిటి ఈవాళే ఊరిలోకి వచ్చాను" అన్నాడు ఆశ్చర్యంగా సంగ్. "నాకంతా

తెలుసు ఈ నటనలు చాలు" అంది. అణుచుకొన్న ఆగ్రహం సూచించే స్త్రీ కంఠం అదే మొదటి సారి కేప్టెన్ వినడం. వినయం గర్వం రెండూ కలిసి ఉంటాయి ఆమెలో. అందుకే ఆమె అంత ఆకర్షణీయంగా ఉంటుంది.

కేప్టెన్ మౌనంగా ఉన్నాడు. లోపల్నుంచి మైహూవా పిచ్చిగా అరుస్తూంది. వినబడుతూఉంది. "నన్ను విడిచి పెట్టండి. సంగూ, నేనిక్కడున్నాను. రక్షించు నన్నుబయటికి తియ్యిఅని బొబ్బలు పెట్టింది." "ఏమటిదంతా"అని అరుస్తూ సంగ్ లోపలికిదూసుకు పోయాడు. మైహూవా తలుపు బాదేస్తూ గోలపెట్టి యేడుస్తూంది. అతనికి వెనకాలే వేన్‌సతి వెళ్ళింది. లోపల్నుంచి ముసలమ్మ కూడావచ్చి నెమ్మదిగా కేప్టెన్ వైపు వెళ్ళి కంట తడిపెడ్తూ "అబ్బాయీ, ఆమెను పెండ్లాడతావా?" అంది. సంగ్ ముఖం వంచుకొన్నాడు ఆశ్చర్యంతో. అతని కర్థమైంది. లోపల్నుంచి సంగూ, సంగూ నన్ను విడిపించు అన్న అరుపు వస్తూనే ఉంది. "తప్పక పెండ్లాడతా ఇప్పుడింక తలుపుతీసి ఆమెతో మాట్లాడ వచ్చా?" అన్నాడు సంగ్.

తలుపు తీశాడు. మైహూవా ఏడుస్తూనే వచ్చి అతన్ని చేతుల్లో వాలి పోయింది. "నన్ను తీసుకుపో సంగ్, నన్ను తీసుకుపో" అంటూ ఏడుస్తూంది. తల్లికికూడా యేడుపు వచ్చింది. సంగ్ ఆమెను క్షమాపణ వేడుకొంటూ ఓదార్చేడు. ఆమె ఏడుపుకు ప్రస్తుత పరిస్థితికి సంబంధం లేదు. ఎందుకేడుస్తూందో ఆతనికి నిజం తెలియలేదు. సంగ్ తనుచేసిం దానికి విచారించి, తప్పంతా తన మీద వేసుకొని క్షమించమన్నాడు. ఐతే పెండ్లాడే ఉద్దేశం తప్ప అతనికి మరో ఉద్దేశమెప్పుడూ లేదు. తక్షణం ఆమెను పెండ్లాడటానికి తాను సిద్ధంగా ఉన్నానని, వారికి విధే యుడు అనుకూలుడు అయిన అల్లుడుగా ఉంటాననీ చెప్పాడు. మైహూవా

తాను పొందుతున్న ఆనందంతో వాళ్ళమ్మకీ మామ్మకీ విస్మయం కలిగించింది.

కేప్టెన్ పెండ్లాడడానికి కొప్పుకోవడంతో ఆపవగకచింది. దొంగల్ని పట్టేపని కూడ పూర్తి అయిందతనికి. కేప్టెన్ కుటుంబం కూడా యీ పెండ్లి కిష్టపడ్డారు. సూచౌలో పెండ్లి చేసేశారు.

ప్రపంచంలో మానవుని మనస్సు గూర్చి జ్యోతిషం చెప్పలేం. కేప్టెన్ మైహువాల అల్లకల్లోలాల ప్రేమగాథ ముగిసింది. కాని దాని ప్రభావం వేన్‌సతి మీద విచిత్రంగా పనిచేయసాగింది. మూడు నెలలకే ముసలమ్మ మరణించింది. ఖనన క్రియలకు కేప్టెన్ ఒక్కడే వచ్చాడు. వేన్‌సతి అతనికి పవిత్ర తోరణాలను గూర్చి చెప్పింది. రాజగురువు తోరణాలను గూర్చి సిఫారసు చేశానని వ్రాసిన ఉత్తరం కులపెద్ద తెచ్చి తనకు చూపాడని ఇంక దాని కడ్డుండదని చెప్పింది. ఈ తోరణాలతో కులం వారందరికీ సంబంధమున్నట్లు వారందరూ ఒకటే ఉత్సాహంతో ఉన్నారు. అప్పుడే యీ యిద్దరు వితంతువులను గూర్చి వేన్ కుటుంబం వారంతా "పవిత్ర మాత"లనే మహా గౌరవపదం వాడేస్తున్నారు. ఐతే విచిత్ర మేమిటంటే ఈ సంగతి వేన్‌సతి యేమంత ఉత్సాహం లేకుండా చెప్పింది. ఆమె మాటల్లో కొంచెం సందేహధ్వని కూడా ఉంది.

"చాల గొప్ప సంగతి విన్నాను. మీకు చాలా ఉద్రేకం ఆనందం కలిగించి ఉంటుం దీ వార్త" అన్నాడు సంగ్. "ఏమో. నాకేమీ తెలియదు. ఐతే, మైహువా ఎలా ఉంది?" అని మాట మార్చేసిందామె, గర్భిణిగా ఉందని కేప్టెన్ చెప్పాడు. "ఈ శుభవార్త ఇంతవరకు చెప్పేవు కాదేమిటి?" అని ఆనందంతో ఊగిపోయింది వేన్‌సతి, "ఈ సంగతికేంలెండి? మీ తోరణం సంగతి కంటే గొప్పదా?" అన్నాడు కేప్టెన్. "తోరణమా, ఆ ప్రసంగ మెత్తవద్దులే" అందామె. అంతటి అపురూపగౌరవంపట్ల ఆమె

ఉదాసీనత అతని కాశ్చర్యం గలిగించింది. "ఖ్యాతితో ఏకాంతవాసం మరో ఇరవై సంవత్సరాలు"అన్న మైహూవా మాట అతనికి జ్ఞాపకాని కొచ్చింది. కాని వేన్‌సతికూడా అలాగే భావిస్తుందా? "తోరణాని కొప్పుకో వచ్చుం టావా?" అనిచటుక్కున అడిగిందామె. ఏమి వింత ప్రశ్న?" "లేకపోతే పిచ్చి అన్న—"అంటూ సగంపలికి నాన్చేశాడు కేప్టెన్ యేదో అనుమానం పుట్టి."ఐతే, తోరణం కట్టాక మీ పవిత్ర వైధవ్యానికి చక్రవర్తి రక్షణవల్ల ప్రాశస్త్యం వస్తుంది" అని ముగించాడు.

దహన క్రియల అనంతరం వేన్‌సతి ఇంటి కొక్కతే తిరిగి వచ్చింది. ముందు, వెనుక హాలులకింకా నల్లపరదాలు కట్టేఉన్నాయి. హాలుకు మధ్యగా మేజస్ట్రీటుగారు బహుమానంగా పంపిన తెల్లని పొడు గాటి పరదా వేలాడగట్టి ఉంది. దానిమీద "ఒక ఇల్లు, ఇద్దరు పవిత్రులు" అని వ్రాయబడి ఉంది. ఇంటికంతా ఆమె ఒక్కతే. తన భవిష్యత్తును గూర్చి ఆలోచించుకోడానికంతావ్యవధే. భవిష్యత్తులోకి తొంగిచూసేసరి కామెకు భయం వేసింది. మొన్న మొన్నటిదాక తన అత్త తన కూతురు అల్లుడు యీ యిల్లు నవ్వులతో నింపేవారు. ఇంతలో ఎన్ని మార్పులు! కూతురు ప్రణయం, పరిణయం, అత్త మరణం, తన ఉన్నత శుష్క ఖ్యాతి శిఖరారోహణ, పుట్టబోయే మనుమడు ఎన్ని విశేషాలు!

దహనక్రియల్లో తోటమాలి చాంగ్ చాలా సాయపడ్డాడు. తన యజమానురాలు విచారంగా ఉండటం చూచి మరింత సాయపడసాగాడు. మైహూవా బదులితడే బజారుపనులు చేస్తున్నాడు. వేన్‌సతికి ఏమీ ఇబ్బంది కలుగకుండా, ఇంటా, బయటా అన్నీ అతడే చూచుకొంటూ ఆమెకే బెంగా బెడదా లేకుండా చేస్తున్నాడు. కాయగూరలమ్మి కొంత లాభం చేసుకొస్తున్నాడు. వంటింట్లోంచి ఆమె చూస్తూనేఉండేది అతనెంత శ్రమ పడుతున్నాడో. ఒంటరితనంవల్ల ఒక్కొక్కసారి యేమీతోచక తోటలో

అతనితో మాట్లాడ్డానికి వెళ్ళేది. తోటకు అన్ని వైపులా గోడలుండటం వల్ల బయటి వాళ్ళకగపడదు. వారిద్దరికి సాన్నిహిత్య మేర్పడింది.

ఖనన సందర్భంలో కులపెద్ద రాజగురువు వద్దనుండి నూరురూపాయలు తెచ్చి యిచ్చాడు. ఇంక తోరణం తాలూకూ వెయ్యి రూపాయలు కూడ వచ్చేసినట్లే, కాని వేన్‌సతి శ్రుతిమించక ముందే యేదో ఒక నిశ్చయము చేసుకోవలసి ఉంది. ఆమె ప్రఖ్యాత స్త్రీ అవుతూందని చాంగ్ పరమానందంతో అభినందిస్తూ ఆమెనుచూచి గర్వపడుతున్నాడు.

చాలాసార్లు ప్రయత్నించింది కాని తాను పవిత్ర వితంతువు ఆడది. ఎలా తనంతట తాను చెప్పడం? కాయగూర మొక్కల్నిగూర్చి మాట్లాడడానికని చాలసార్లువెళ్ళేది. నీలాకాశంలో సూర్యుడు స్వచ్ఛంగా ప్రకాశిస్తూ ఉండేవాడు. ఆమె చిరకాల శిక్షణ, సహజవినయం మనస్సులోనిమాట చెప్పనిచ్చేవికావు. పైగా చాంగ్ పూర్తిగా విధేయుడు, బహు సన్మార్గవర్తి. ఆమెను తన యజమానురాలినిగానే కాని స్త్రీగా యెన్నడూ కలలో కూడా అనుకొని యెఱుగడు.

మనుమరాలి నెత్తుకొని కూతురు అల్లుడు వచ్చారు. తెల్లగా బొద్దుగా ఉన్న చంటిబిడ్డను వెచ్చగా తొమ్మ కానించుకొనేసరి కామెవళ్ళు జలదరించింది. చంటిబిడ్డ నానందంతో ఎత్తుకొని ఎన్నాళ్ళయింది? అదిగాక, అప్పుడే మామ్మ అయ్యేవయస్సు తనకు వచ్చిందా? నీ కాపరం ఇంత పచ్చగా ఉన్నందుకు నా కెంతైనా ఆనందంగా ఉందే, మైహూవా. బిడ్డని భర్తను చూచుకొని నీ వెంతైనా గర్వించవచ్చు "అంది తల్లి." మైహూవా కంట ఆనందాశ్రువులు కారాయి. అమ్మ కొంత మెత్తబడిందని, తన తప్పులు క్షమించిందని అనుకొంది. కాని తాము వచ్చిన మొదటినాడే, ఆమె బెంగటిల్లిన ముఖంతో మౌనంగా, ఏకాంతంగా ఉండటం మైహూవా

కనిపెట్టింది. వెనుకటిలాగ తన తల్లి ఆత్మనిగ్రహం, ఆత్మసంతుష్టిగల మనిషిలాగ కనబడటంలేదు.

ఆ పిదప కేప్టెన్ అత్యాశ్చర్యకరమైన ఒక సంగతి విన్నాడు. తోటలో నేల త్రవ్వుతున్న చాంగ్‌ను చూచాడు. చాంగ్ కేప్టెన్ని తన గదిలోకి తీసుకు వెళ్ళాడు. చాంగ్ ముఖంలో విచిత్రానందం, ఉబలాటం, కలవరంకూడ కనిపించాయి. ఏమి చెయ్యమంటారో చెప్పండి. నేను చదువుకొన్న వాడిని కాదుకదా" అన్నాడు చాంగ్. "సంగతేమిటి?'' అని అడిగారు కేప్టెన్. కాస్సేపు చాంగ్ నిదానించి, "మా అమ్మగారి సంగతండీ" అన్నాడు. "ఏం ఆవిడేమైనా ఆపదలో పడిందా?" "లేదు. కాని మీరే నాకు సరియైన సలహా నివ్వగలరు అన్నాడు చాంగ్. నీకూ్కడా ఈ విషయంలో యేమన్నా సంబంధం ఉందా?'' అని కేప్టెన్ అడిగితే ఔనన్నాడు చాంగ్. ''ముందు మీ ఇద్దరికీ జరిగిన సంగతేమిటి, కలిగిన బాధేమిటీ చెప్పు" అన్నాడు సంగ్.

చాంగ్‌కు మాట నెమ్మది. చక్కని భాషలో చెప్పలేడు. కాని కథ విన్నతరువాత కేప్టెన్ నమ్మలేకపోయాడు. అది వింటూఉంటే నిజాయితీకి పేరుపడ్డ తన అత్తగారు స్వంతసమస్య నెట్లు డొంకతిరుగుడుగా ఎదురు కున్నదో! అదే మైహూవాలాంటి పిల్లయితే సూటిగా ఒక చిన్న సూచన-తోనూ, ఒక ముద్దుతోనే తీర్చిపారేసే దనుకొన్నాడు.

రాత్రిళ్ళుకూడా ఎండాకాలంలో వేడిగానే ఉండటంవల్ల, చాంగ్ చాపమీద నడుముకు మాత్రం గుడ్డకట్టుకొని పరున్నాడు. వారంక్రితం ఒక రాత్రి అమ్మగారు "చాంగ్'' అని పిలవడం విన్నాడు. పడమటి ఆకాశంలో చంద్రుని వెన్నెల చాంగ్ మీద పడుతూఉంది. ఆమె తనగది తలుపు దగ్గర నిలబడి ఉంది. చప్పున లేచి, యేంకావాలమ్మగారూ అన్నాడు. "నీకు మత్తునిద్ర. కోళ్ళ అలజడి విని మానుపిల్లి వాటినెత్తుకుపోతూందను

కొన్నాను" అంది. కోళ్ళగూడు దగ్గరకు చాంగ్ పడకగది మీదుగా వెళ్ళాలి. అప్పుడు తెల్లవారగట్ల మూడయి ఉంటుంది. గడ్డి మంచుతో తడిసిపోయింది. "సరే వెళ్ళిపడుకో, మంచులో గుడ్డలు లేకుండా ఉంటే రొంపచేస్తుంది" అంది. వద్దంటున్నా ఆమెను వంటింటిదాకా చాంగ్ సాగనంపాడు.

అప్పుడప్పుడు మానుపిల్లులు కోళ్ళ కోసం కొండల్లోంచి రావడం కద్దు కాని రాత్రి కోళ్ళ అరుపు తనకు వినబడలేదు. మరునాడు వేన్‌సతి అంది, "కోళ్ళగూడు పిల్లులు జొరబడకుండా కప్పెయ్యి". "మీకెందుకు, నేను చూసుకొంటానుగదా" అన్నాడు చాంగ్. ఇదివర కెన్నడూ ఇలాగ జరిగి ఉండలేదు. కాని మూడవనాటి రాత్రి ఒక మానుపిల్లి తీగల్లోంచి దూరి ఒక నల్లకోడిని లాక్కుపోయింది. ఒక శాలువ తనమీద ఎవరో కప్పుతూన్నట్లు తోచి చాంగ్ మేల్కొన్నాడు, వేన్ సతి తన్ను లేపుతూంది. లేచి సంగతేమిటని అడిగాడు. "ఒక మానుపిల్లి కనబడింది. గోడదూకి పారిపోయింది" అంది. ఇద్దరూ వెళ్ళి వెదికారు. తీగకొక పెద్ద కన్నం కనబడింది. పిల్లి తన కగపడ్డ స్థలం చూపింది కాని అక్కడేమీ అడుగులజాడ కనబడలేదు. మెడమీద దెబ్బతిన్న నల్లకోడి మాత్రం ప్రక్క పూల మొక్కలమీద పడి ఉంది. తన అశ్రద్ధకు చాంగ్ నొచ్చుకొన్నాడు. కాని ఆమె దయతో, దీంట్లో పోయిందేముంది? రేపు దీన్ని కూర వండుతాను" అంది.

"మీకు సరిగా నిద్ర పట్టదేం?" అన్నాడు చాంగ్. "సాధారణంగా రాత్రిళ్ళు మేల్కొనే ఉంటాను. నిద్రలోకూడ నాకు చీమచిటుక్కుమంటే వినబడుతుంది" అంది. ఇద్దరూ అతని గదివైపు వెళ్ళారు. ఆమె బయటే నిలబడింది. ఆమె దుస్తులమీద, వ్రేళ్ళమీద, రక్తపు చుక్కలు చూచి చాంగే కడుక్కోడానికి నీళ్ళు అందించాడు. టీ త్రాగుతారా అని అడిగాడు.

మొదట వద్దంది కాని మళ్ళీ ఆలోచించి సరేఅంది. ఎందుకంటే బాగా మెలుకువ వచ్చేసింది ఇక నిద్రపట్టదు. టీ తయారుచేసి మీ గదికి తెస్తా నన్నాడు చాంగ్. "వద్దు, ఇక్కడే బయట చక్కగా ఉంది'' అని వేన్ ఆగింది. "ఒక్క నిముషంలో తయారు చేస్తా'' అని చాంగ్ అంటే, "తొందరలేదు" అంటూ ఆమె అతని పక్కమీద కూర్చుంది. అతని బల్లలు, చాప. కంబళి, పట్టిచూచి, "చాంగ్ నీకు మంచిశాలువ లేదని నే నెరుగనే ఎరుగను. ఉదయం నీకొక మంచి శాలువ ఇస్తా"నంది.

మరునాడు కూర వడ్డిస్తూ, పిల్లిమాట జ్ఞాపకం చేసింది. గూడు బాగుచేశావా అని అడిగింది. 'ఆ చేశాను' అన్నాడు. "మళ్ళీ ఈ రాత్రి కూడ పిల్లి వస్తుందేమో''అని ఆమె అంటే, "మీకెలా తెలుసు''అన్నాడు చాంగ్. "నిన్న రాత్రి దానికి కావలసింది దొరకలేదు. జడుసుకొని దొరికిన కోడిపిల్లనే పారేసింది. దానికి కోడికావాలి. అది ఎక్కడ పడిఉందో దానికి తెలుసు. అందుచేత తెలివైందైతే ఈ రాత్రి కూడా రావాలికదా?'' అంది వేన్‌సతి.

ఆ రాత్రి అంతా మేల్కొని చూచాడు చాంగ్. దీపం తగ్గించి, పొవల మాటున ఒక మోకాలి పీట వేసుకొని, మానుపిల్లి నెత్తి బ్రద్దలు కొట్టడాని కొక దుడ్డు దగ్గర పెట్టుకొని కూర్చున్నాడు. చంద్రుడు నడి ఆకాశాని కొచ్చాడు. పిల్లిరాలేదు. చంద్రుడు పడమటి దిశకు వాలాడు పిల్లిరాలేదు.

చలివేస్తూంది లోనికి పోదామనుకొంటూఉంటే, చాంగ్ అని అమ్మ గారి మాట వినబడింది. అప్సరసలాగ తెల్లని బట్టలు కట్టుకొని వస్తుం దామె. దగ్గరకొచ్చి ఏమైనా జాడ దొరికిందా అంది. లేదు అన్నాడు. నీ గదిలో కూర్చొని పొంచిచూద్దాం అంది. ఆ రాత్రి నా జీవితానికంతకూ ఆనందమయమైన రాత్రి. ప్రపంచమంతా నిశ్శబ్దంగా నిద్రపోతూఉంది.

నేను, పేన్‌సతి దగ్గర దగ్గరగా కూర్చున్నాం. ఆమె అవాళ ప్రొద్దున్న ఇచ్చిన తెల్లటి దుప్పటి వాడడానికి మనస్సు పుట్టక మడతవిప్పకుండా అలాగే ఉంచాను. కిటికీలోంచి వెన్నెల వస్తూంది. ఒకళ్ళ నొకళ్ళం యుగ యుగాలనుండి ఎరిగినట్లే తోచింది.

తోటనుగూర్చి జీవితంలో కష్టసుఖాలగూర్చి పేన్‌సతి యేదో మాట్లాడుతూ ఉంది. నీవెందుకింకా పెండ్లాడలేదని అడిగింది. భార్యను పోషించే తాహతు నాకింకా లేదన్నాడు. ఆ ఏతంతువప్పుడేదో పరధ్యానంగా చూస్తూ అదోలాగ అగపడింది. ఆమె పాలిపోయిన ముఖంమీద, వజ్రాలలాంటి ఆమె కళ్ళమీద వెన్నెల మెరుస్తూంది.

చాంగ్‌కు బెదురుగా ఉంది. "నీవు నిజంగా మానవజాతి స్త్రీవా? లేక వెన్నెలలో తెల్లని దుస్తులు ధరించి తిరిగే అప్సరసవా? అని అడిగాడు. "చాంగ్, నీకు పిచ్చా? నేను మనిషినే"అని ఆమె అంటూఉంటే చాంగ్ కామె మరింతగా మనిషి కానట్లు తోచింది. ఆమెకళ్ళు తనవైపు చూస్తున్నట్టూ ఉన్నాయి; చూడనట్లూ ఉన్నాయి. తాను మాత్రం తన కళ్లు ఆమెనుండి త్రిప్పలేక పోయాడు. "అలాగచూడకు. నేను ఆడదానినే, నన్ను ముట్టుకొనిచూడు "అని చేయిచాపిందామె. చాంగ్ ముట్టుకోగానే ఆమె దేహం గగుర్పొడిచింది. "భయం కలిగించానా. క్షమించండి" అన్నట్లు చాంగ్ చూచాడు. నిజంగా అప్సరసే అనుకొన్నా నొక క్షణం దాక''అన్నాడు. ఆమె నవ్వింది. అతని బెంగతీరింది. "చాంగ్, నిజంగా నేనంత అందంగా ఉన్నానా? ఎప్పుడూ అంత అందంగా ఉంటే ఎంత బాగుంటుంది. మనుష్యులు ప్రేమించి పెండ్లాడతారుకదా, అప్సరసలుకూడా అలాగే చేస్తారా''అంది ఆమె. "నాకేం తెలుసు? అప్సరసలను నేనెప్పుడూ చూడలేదు,''అన్నాడు. కాని ఆమె అడిగిన తరువాత ప్రశ్న అతణ్ని కలవర పరిచింది, "నీకీ రాత్రి అప్సరస కనబడితే యేం చేస్తావు? ప్రేమి

స్తావా? నేను అప్సరసనైతే నీకిష్టమా, మనుష్యస్త్రీగానే ఉంటే నీకిష్టమా?'' అంది. "ఏంటో, అమ్మగారూ, వేళాకోళం చేస్తున్నారు; నే నేమిటి? అప్సరసను ప్రేమింపగలనా'' అన్నాడు. ''లేదు. పరిహాసానికికాదు. నిజంగానే. మైహూవా కేప్టెనుల లాగ మన మిద్దరము భార్యాభర్తలుగా ఉంటే నీ కిష్టమేనా?అని అడిగింది. "ఏమిటో. మీ మాటలు నమ్మలేను. మీ పాతివ్రత్య తోరణం మాటేమిటి?''అన్నాడు చాంగ్. "తోరణాని కేమిలే. నాకు సిప్ర కావాలి. ముసలివాళ్ళమయ్యే వరకు హాయిగా జీవించవచ్చు. ప్రజలేమనుకొంటే నాకేం. ఇరవై యేళ్ళు పవిత్ర వైధవ్యం నడిపాను. చాలదినాకు. ఇంకా ఉన్నారుగా ఆడవాళ్ళు. వాళ్ళు నడుపుతారులే''అంటూ అతణ్ని ముద్దు పెట్టుకొంది.

ఇదంతా చెప్పుతూ, చాంగ్, ''కేప్టెన్, ఏం చెయ్యమంటారు? చక్రవర్తిగారి ఉద్దేశాని కడ్డుగా నేనెంతవాణ్ని నిలవడానికి? కాని అమ్మగారేమో, ఇప్పుడే పెండ్లాడు, లేకపోతే ఇక నేను పెండ్లే చేసుకోను'' అంటున్నారు. అమ్మగారే అలాంటి మాటంటున్నారంటే, చూడండి, "నన్ను పెండ్లాడి సుఖంగా ఉంటానన్నారు. కేప్టెన్, నన్ను ఏంచెయ్యమంటారు?'' అని అడిగాడు,

మొదట కేప్టెన్‌కు దిగ్భ్రమ కల్గింది. నెమ్మదిగా తేరుకున్నాడు. అతని ప్రతివాక్యం జాగ్రత్తగా విన్నాడు. చివరకన్నాడు,"ఏం చెయ్యమని అడుగుతున్నావా? మూర్ఖుడా, పెండ్లాడు" అని గద్దించి, మెరుపులాగపోయి మైహూవా కీ వార్త అందించాడు. మా అమ్మ చేసినపని నాకెంతో సంతోషముగా ఉందంది మైహూవా, తిరిగి నెమ్మదిగా అంది. "మా అమ్మే ఆ కోడిని చంపి ఉంటుంది. నిజానికి ఛాంగ్‌లాంటి మగవాళ్ళకు తోరణాలెత్తించాలి.''

రాత్రి భోజనానంతరం అత్తగారితో కేప్టెన్ అన్నాడు, ''అమ్మా' మాకు ఆడపిల్ల పుట్టింది. మగపిల్లవాడైతే వేన్ పేరుపెట్టి ఉందుం.'!

వేన్‌సతి తలెత్తి వింటూంది. నేల వైపుచూస్తూ కేప్టెన్ గంభీరంగా పలికాడు. ''నేను దీన్నిగూర్చే ఆలోచిస్తున్నాను. మామ్మగారు పోయారు. మీరొక్కరే అయిపోయారు. చాంగ్ చాలా మంచివాడు. మీరొప్పుకుంటే మాట్లాడతాను. వేన్ కుటుంబం పేరు పెట్టుకొంటాడు సంతోషంగా మీరు పెండ్లాడితే.'' ఆమె నాపాదమస్తకం లజ్జ ఆవరించేసింది. "ఔను, వేన్ కుటుంబంపేరు....''అంటూ తన గదిలోకి తొందరగా వెళ్ళి పోయింది.

చాంగ్‌తో ఆమె పెళ్ళి వేన్ కుటుంబం వారికి గొడ్డలి పెట్టులాగయింది.

తాతగారన్నారు ''ఆడదాన్ని గూర్చి ఇదమిత్థమని మెన్నటికి చెప్పలేం''

———

# 4. తెల్లకోతి

తిరుగుబాటు వారులతో కలిసి పోయాడని జనరల్ ఉయాంగుని పట్టుకొని క్రీ. శ. 569 వ సంవత్సరములో సకుటుంబముగా నాశనం చేశారు; తరతరాలుగా చక్రవర్తి పోషణలో ఉండీ కూడ తిరుగుబాటు చేసినందుకు తగిన శిక్ష అయింది, అన్నారు కొందరు. కాని అంతపేరు మోసిన జనరల్ పేరు, అతని తండ్రి పేరు ప్రఖ్యాతులు ఇలా నశించి పోయాయి కదా అని కొందరు విచారించారు. దక్షిణాదిన అతని పలుకు బడి కోర్వలేక చక్రవర్తె అతణ్ణి రెచ్చగొట్టాడని చియాంగ్ సంగ్ లాంటి వాళ్ళ అభిప్రాయం.

నిజానికతని ముప్ఫైయవయేట ఒక సంఘటన జరిగి అతని ప్రవర్తనే మారిపోయింది. శాంత కాముకుడైన ఆ యువక జనరల్ చింతా గ్రస్తుడు, ద్వేషి యైపోయాడు. అతని స్నేహితుడగు చియాంగ్ సంగ్ అతని కుమారుని జాగ్రత్తగా దాచి పెంచాడు. జనరల్‌ను గూర్చి శ్వేత మర్కటమనే కథలో కూడ వ్రాశాడు. జనరల్ క్రింద చాలా కాలం పని చేసిన ఉద్యోగి లీ అనే యాయన ఆ కథలో కొంత దాపరికం ఉందంటాడు. అపకీర్తి పాలయ్యే జనరల్ చచ్చిపోయాడు. అరవై యేళ్ళ వయస్సున్న లీ యీ కథ చెప్పాడు. అతడికి జరిగినదంతా తెలుసు.

తండ్రి పోయిన తరువాత జనరల్ కీ ఉద్యోగం వచ్చి నప్పటి నుంచీ అతణ్ణి నేనెరుగుదును. అతని తండ్రి కాలంనుంచీ కూడ పని చేస్తున్నవాణ్ణి కాబట్టి అతనికి నా మీద ఆ విశ్వాసం ఉంది. జనరల్ భార్య చిన్నది, అందగత్తె, పెద్ద కుటుంబంలోనిది. ఒక రోజున ఆమె

మాయమైంది. శ్వేత మర్కటమే ఎత్తుకుపోయి ఉండాలని అంద రికీ అనుమానం. జనరల్ భోజనం దగ్గర ఒక్కడే కూర్చున్నాడు. అతని ముఖం చూడ్డం నా కిష్టంలేక పోయింది.

దక్షిణాన్ని అడవి జాతులవారి ప్రాంతంలో కేంపు చేసేటప్పుడు భార్యను తీసుకువెళ్ళవద్దని జనరల్‌కు అందరూ చెప్పారు. చుట్టూ నూరు మైళ్ళ ప్రాంతంలో చైనా స్త్రీలను శ్వేతమర్కటం ఎత్తుకు పోతున్నాడు. పోయిన స్త్రీల ఆనవాళ్ళు కూడ దొరకటం లేదు. జనరల్ ఉన్న ఇంటి చుట్టూ భటులు ఫారా ఇస్తున్నారు. ఆమె ప్రక్కనే చాలమంది స్త్రీలు కూడ జాగ్రత్త కోసం పరున్నారు. ప్రక్క గదిలో పనివాళ్ళున్నారు. తెల్లవార గట్ల ఒక స్త్రీ కలికిపియై లేచి చూచేసరికి జనరల్ భార్యలేదు. తలుపులు గడియలు వేసినవి వేసినట్లే ఉన్నాయి. ఎట్లా వచ్చాడో తెలి యదు. ఒంటిమీద బట్ట సరిగా ఉందీ లేందీ కూడా చూచుకోకుండా ఆ స్త్రీ అమ్మగారు లేరంటూ అరుస్తూ పరుగెత్తింది.

మేము వెంటాడేం. మేమున్న మిలటరీ స్టేషన్ తాలూకు ఇల్లు కొండమీద నూరడగుల ఎత్తునఉంది. మా ఇంటి గుమ్మం ఎత్తుకే అవతల ఒక నాచు పెరిగిన కొండ శిఖరం ఏభై అడుగుల దూరంలో ఉంది. మాకూ శిఖరానికి మధ్య పెద్దగండి ఉంది. ఆ తెల్లవారుఝామున పొగ మంచులో ఇరవై అడుగులకంటే ఎక్కువ దూరంలో యేమీ కనబడటం లేదు. ఆ స్థితిలో దొంగను వెంటాడటం మహాపత్కారం. కాలుజారినా. దారితప్పినా, అగాధంలోపడి తక్షణం చావవలసిందే. ఒక అరగంట సేపు వెదకి ఊరుకొన్నాం,

తిరిగి వచ్చాక జనరల్ ఉగ్రుడై పోయాడు. చెలికత్తెను విప రాలడిగాడు. ఆమె భుజం పట్టుకు గుంజి "ఏమి చూశావ్ చెప్పు"అని గద్దించాడు. ఆమె యేడుస్తూ "నేనేమీ చూడలేదు. ధ్వనివిని లేచేసరి కామె

కనబడలేదు" అంది. జనరల్ కోపమాపుకోలేక ఆమె నెత్తిమీద కొట్టాడు. అతడంత ఒళ్లు మరచి ప్రవర్తించడం మేమెప్పుడూ చూడలేదు. షిషింగు దండయాత్ర నతడెంతో సామర్థ్యంతో నడిపినందుకు మాకంటే చిన్న వాడైనా, మేమెంతో మెచ్చుకున్నాం.

"మీరెవ్వరైనా ఎన్నడైనా యీ తెల్లకోతిని చూశారా?" అని జనరల్ మమ్మల్ని అడిగాడు. మేమెవ్వరమతణ్ణి చూడలేదు కాని నూరు మైళ్ళ చుట్టు ప్రక్కల అనేకులతణ్ణి అనేక పట్టణాల్లో చూశారు. కట్టె లేరుకొనేవాళ్లు, ఎత్తుగా ద్రాక్ష తీగలల్లుకొన్న నిటారైన కొండలెక్కుతూ మబ్బులు క్రమ్మిన శిఖరాలమీద అతడదృశ్యుడవడం చూశారు.

అతడాదిమజాతివాడా? పగతీర్చుకోడాని కిట్లు చేస్తున్నాడా? అని జనరల్ అడిగాడు. ఈమధ్యే జనరల్ ఆదిమవాసుల వారందర్నీ అణగ కొట్టాడు గదా!

గ్రామీణులంటారు అప్పుడప్పుడు పట్టణానికి యేమో అమ్మడానికీ, కొనుక్కోడానికి వస్తూఉంటాడు: జింకో, చర్మమో, దంతాలో, కస్తూరో ఇచ్చి చాకులు, కత్తులు, వడ్రంగి పనిముట్లు, ఉప్పు కొనుక్కోడానికి వస్తాడు. చైనాభాష దడదడ మాట్లాడగలడు. బేరంలో మోసంచెయ్యడు; చేసిన వారిని బ్రతకనివ్వడు. మోసంచేసినవాని వీపుకు వారం లోపుగానే అతని బాణం నాటిందన్నమాటే.

ఎలా ఉంటాడు? ఈప్రాంతాల్లో పుట్టిన లెఫ్టినెంటు వాంగ్ వర్ణించాడు. తెల్లకోతి, ఈ ప్రాంతాల ఆదిమవాసులవలె నల్లగా పొట్టిగాఉండడు. వీరికి వయస్సు మళ్ళకముందే ముఖాన్ని ముడతలు పడతాయి. చూసిన వాళ్లు చెప్పగా విన్నాను. అయిదడుగుల పది అంగుళాలు ఎత్తు ఉంటాడు. కండలు తీరిన జబ్బలు, బలమైన చేతులు, కురచమెడ, తెల్లని వెంట్రుకలు కనురెప్పలమీద, కనుబొమలమీద, ఒంటిమీద ఉంటాయి. పాదాల అడుగు

భాగం నేలనంటుతూ పరుగెత్తుతూ ఉంటే కోతిలాగే ఉంటాడు. ఎప్పుడూ కొండల నెగబ్రాకడంవల్ల ఈ పద్ధతి వచ్చిందేమో. అతని నడకచేప, పెద్దబొటన వ్రేళ్ళు, కాళ్ళమీద సిల్కులాంటి తెల్లని వెంట్రుకలు అతని కొక వికార వికృతమైన భీకరరూపాన్నిచ్చాయి.

చిన్న వయస్సు స్త్రీలనే ఎత్తుకు పోతాడని వాంగ్ చెప్పాడు. బరువుగా ఊపిరివిడుస్తూ, గెడ్డం రొమ్ముకానించుకొని జనరల్ "అత డెత్తుకుపోయిన స్త్రీలుగాని వారిదేహాలు కాని ఎప్పుడైనా దొరికాయా అని అడిగాడు. లేదు, అదే చిత్రం. అతడా స్త్రీలను పాడుచేసి వదిలేస్తే కొందరైనా బ్రదికి తిరిగివచ్చి ఉందురు. లేక వారి శవాలైనా దొరికి ఉండేవి అని వాంగ్ బదులుచెప్పాడు. "పిల్లల్నికూడా ఎత్తుకుపోతాడా?" లేదు. పిల్లల్ని జడిపించడానికి, తల్లులే తెల్లకోతి వచ్చిందంటారు. పద్దె నిమిదీ ఇరవై రెండు సంవత్సరాల మధ్యవయస్సుగల యువతులనే యెత్తుకుపోతాడట. వాంగ్ కొంచెమాగి అన్నాడు, "జనరల్, బిడ్డల తల్లుల్ని ఎత్తుకుపోడట. అతనికి పిల్లలంటే ఇష్టమనికూడ కొందరు తల్లు లంటారు''.

సిగ్గుపడిపోయి జనరల్ పనికిమాలిన వానివలె అగపడుతున్నాడు. తెల్లకోతి ఈపనిచేసింది పగతీర్చుకోడానికా పరిహాసానికా? చైనా జనరల్ భార్య పోవడమేకాక చైనా సైన్యానికే భంగం కల్గిందికదా? మామూలు దండయాత్రలు నడపడం వంటిది కాదాయె. మహాశక్తి, బలం, మోసం, పట్టుదలగల విచిత్ర శత్రువుతో పోరాటం ఇది. ఇరవైమైళ్ళ లోపున సైని కులు కొండలెక్కి లోయల్లో దిగి గాలించిచూచారు, జనరల్ భార్యజాడ దొరుకుతుందేమోనని.

రెండు వారాలయ్యాక ఒక సైనికుడు ముప్పైమైళ్ళ దూరాన్న చెట్టు కొమ్మలకు తగుల్కొని ఉందని ఒక ఆడవాళ్ళ ఎర్రనిజోడు, బుడే

డారీ పనితనం గలది తెచ్చిచూపాడు. దాన్ని బట్టి ఆమె నడిచి ఉండదు. దొంగ ఆమెను ఎత్తుకొనే పోయిఉంటాడని తేలింది. ఆ చెప్పులరంగు వర్షంలోనాని కగ్గిపోయింది. కాని తనభార్యదే అని జనరల్ గుర్తుపట్టాడు.

బ్రతికే ఉంటుదామె బందీలో. కాని తెల్లకోతి నెలా పట్టేది? జనరల్ నిచూస్తే విచారంగాఉంది. మధ్యాహ్నమంతా ఒక్కడే కూర్చున్నాడు. భోజనానికి కూర్చుని పళ్ళెం తోసేశాడు. ఎవ్వరూ అతనితో మాట్లాడ్డానికి సాహసించలేక పోతున్నారు. మరునాడుదయమే జనరల్ నన్ను పిలిచి రెండు డజన్ల మనుష్యుల్ని, తినుబండారాన్ని తీసుకొని బయలుదేరమన్నారు. ఈఅన్వేషణ ఒకనెల పడుతుందేమోఅంటూ, లెఫ్టినెంటు వాంగ్ కూడా మాతోరావాలన్నాడు. మంచి విలుకాండ్రను ఆయుధాలతో బయలుదేర దీశాడు. ఎక్కువసామానులు మేముమోసుకు పోనవసరంలేదు. పళ్ళు ఎక్కడబడితే అక్కడ కొండల్లో దొరుకుతాయి దుంపలు త్రవ్వి కాల్చడం మావాళ్ళకు తెలుసు. జనరల్ కత్తిసాములో ఆరితేరినచెయ్యి. నూరడుగుల దూరాన్నున్న నారింజపండు నొక్క బాణంతో రెండు బద్దలుగా కొట్టగలడు,

ఎత్తైన కొండల మీదనుంచి ప్రయాణం. ప్రకృతిదృశ్యం అద్భుతంగాఉంది. కొండలు, అడవులు, జలపాతాలు, పెద్దపెద్ద ద్రాక్షతీగల చిట్టడవులు, ఈతచెట్లు, నూరేసి అడుగుల ఎత్తు ఎదిగే వెదుళ్ళదొంకలు, వేటాడ్డానికి జంతువులూ ఉన్నాయి. దారిలో మాకు భయకారణం లేదు. కొండజాతుల వాళ్ళని మేమెరుగుదుం. శాంతిగావాళ్ళ బ్రతుకువాళ్ళను బ్రతుకనిస్తే ప్రాణాలతో వదులుతారు మనల్ని. పగపట్టేరా వీపు రెండు చెక్కలు చేస్తారు. న్యాయంగా ఉండే పెద్దమనుష్యులతో దెబ్బలాడరు. వేట, వరిసేద్యం వారి వృత్తులు. వాళ్ళనుండి మాత్రం తెల్లకోతి భోగట్టా తీయలేం. మాకుతెలియదంటారు. తెల్లకోతి వీళ్ళతో స్నేహంగా ఉంటాడని, బహుశా వీరికతడు నాయకుడని జనరల్ అనుమానం.

నైరుతి దిక్కున వెళ్తున్నాం. ఇది ఇదివరకు జనరల్ చూడని ప్రదేశం. విశాలమైన యెండిపోయిన నదీగర్భం. ఏదోరాజీచేసుకొన్నట్లు అడవులక్కడితో ఆగిపోయాయి. మాకు ఎదురుగా వట్టికొండలున్నాయి. అక్కడక్కడ చిన్నపొదలు మాత్రమున్నాయి. పెద్దపెద్ద బండలకులోటు లేదు. ఒకప్పుడిది పెద్దకొండ యేరుప్రవహించే ఫలవంతమైన లోయయై యుండాలి. తరువాత తరువాత ప్రకృతి మనస్సుమారింది కాబోలు. ఏరు నింకో మార్గాన్ని మళ్ళించింది. పడమటి దిక్కున అపురూపమైన కొండల పరంపరలు కోట బురుజులులాగ లేచి ఉన్నాయి. లక్షలాది సంవత్సరాల గాలికి వర్షానికీ ఈ సున్నపు కొండలరిగి ఎత్తైన కోటకొమ్ములులాగ, పెద్ద పెద్ద స్తంభాల్లాగ, ఆకాశంమీద వంకలు దిద్దినట్లు భయంకరంగా కనబడుతున్నాయి. ఎచ్చటా మనుష్య సంచారంలేదు. కొండల వెనుక నుండి అస్తమిస్తున్న సూర్యుడు పొడుగాటి తెల్లని నల్లని నీడలు విశాల మైన లోయ మీద పరుస్తున్నాడు. ఆ ప్రదేశంలో నీరు దొరకడం దుర్లభం. అప్పుడే నూరుమైళ్ళు వచ్చాం. ఈ ఎడారి మా అన్వేషణ విఫలమన్నట్లు సూచిస్తూంది,

ఆ విచిత్ర ప్రదేశం జనరల్ని ఆకర్షించింది. నదీగర్భాని కావలి వైపు నేలమట్టం ఎత్తుగా ఉంది. రెండు మూడు మైళ్ళ కావల మళ్ళీ వృక్షా లారంభమయ్యాయి. నైరుతి దిశకు స్తంభాల్లాంటికొండలు పోయి ఒకే కొండల వరుస అభేద్యమైన గోడలాగ ఉంది. సూర్యుని కిరణాల్లో బంగారు కాంతితో మెరుస్తూన్న కొండల శిఖరాలు పర్వతాగ్రాన్న ఉన్న రహస్య పట్టణమా అన్న భ్రమ కలిగిస్తున్నాయి. ఆ కొండలపైకే తమ గూళ్ళకు పక్షులెగిరి పోతున్నాయి.

ఆ ఎండిపోయిన నదీ మూలస్థానానికివెళ్ళి చూడాలన్నాడు జనరల్. ఆగకుండా నడిస్తే, చీకటిపడే సరికి ఎక్కడైనా మకాం చేయడానికి తగిన

స్థలం జేరతాం. నది గట్టుమీద గులకరాళ్ళల్లోంచి ఒక గంట నడిచి గడ్డి పెరిగిన కొండ క్రింది భాగం చేరాము. అక్కడ మసిపట్టిన రాళ్ళు, బుగ్గి చూచి ఆశ్చర్యంతో మాకు చూపాడు జనరల్ అంగరక్షకుడైన ''లో'' ఇదివరలో ఎవరో అక్కడ వంటచేసుకొని ఉంటారు. అరటిపండు తొక్కలు, ఎండు బత్తాయిపళ్ళ తొక్కలు కూడ కనబడ్డాయి. రెండు రోజులనుంచి మేము మనుష్య సంచారం చూడలేదు. ఇదిచూచి మళ్ళీ మనుష్యులజాడ చూచామన్నమాట. అటూఇటూ తిరుగుతూ, జాగ్రత్తగా పరిశీలిస్తున్న లో మళ్ళీ ఆశ్చర్యంగా మాకు ఆడవాళ్ళు జడకు కట్టుకొనే నల్లరిబ్బన్ చూపించాడు. జనరల్ భార్యదైయుంటుందన్నాడు. కాని జనరల్ నిశ్చయంగా చెప్పలేకపోయాడు. దాన్నిచూచి మట్టుకు నిట్టూర్పు విడిచాడు. దొంగ అగపడి వానితో పోరాటం జరిగితే బాగుండు ననిపించింది మాకు. శత్రువు భయంకరుడని తెలుసుకొని యీ విరామంలేని వెదుకులాటతో విసిగిపోయి పోరాటమే మేలనుకున్నాం. ఆరాత్రి ఆరు బయట పరున్నాం. ఏటి ఇసకమీద నడవడమలవాటైన వాళ్ళకి కూడ జూన్‌నెల యెండ అలసట ఆయాసం కలిగిస్తుంది. ఒళ్ళెరగని నిద్ర పట్టేసింది.

మరునాడు మళ్ళీ ప్రయాణం సాగించాం. ఈసారి ప్రయాణం ఎత్తు ప్రదేశానికి. కాళ్ళీడ్చుకొంటూ ఎక్కాలి. రెండు గంటలలో మూడువేల అడుగుల ఎత్తుకు వెళ్ళి ఉంటాం. ఒక చిన్న సెలయేరు పైనుంచి క్రింద చరియలలోకి జారిపోయి మరి కనబడటంలేదు. ఆ క్రిందనున్న పెద్ద రాతి బండలనుంచి ఎండకి ఆవిరిలేస్తూ ఉంది. క్రిందనున్న అడవులలో లక్షలాది పక్షులు కలకలలాడు తున్నాయి. చెట్ల కొమ్మలకు పక్షి ఈకలంటుకొని ధగధగలాడుతున్నాయి. తాటి ప్రమాణాన్ని ద్రాక్షలు ఎక్కడబడితే అక్కడ విస్తరించి ఉన్నాయి. వాటిని పట్టుకుని పైకెక్కవచ్చు. చాలా ఎత్తు కెక్కాం. గాలి పలచబడింది.

పై కెక్కేసరికొక విచిత్ర దృశ్యం కనబడింది. చెక్కిన రాళ్ళ తోను, పెద్ద పెద్ద బండలతోను కట్టిన ఒక ఆనకట్ట అగుపించింది. ఎవరు కట్టారో, ఎప్పుడు కట్టారో తగిన పరికరాలు లేకపోతే ఇంతింత బండల్ని మనుష్య మాత్రులు దొర్లించలేరు. ఆవలప్రక్కనున్న జనమే సెలయేరుని మళ్ళించడానికి కట్టి ఉంటారు. ఏరు వేగంగా ప్రవహిస్తూ ఎడమపైపు క్రిందనున్న మడుగులో పడిపోతూఉంది. అడవిజాతివారి భాషలో వ్రాసిన ఒక రాతి పలక సగం కప్పబడి ఉందక్కడ. మాలో ఆ జాతివాడొక సైనికుడున్నాడు. అతడు చదివి "స్వర్గ రక్షిత స్థాన" మని ఉందన్నాడు. ఇదొక్కటే మానవ చిహ్నం ఆ ఎత్తు ప్రదేశాన మా కగపడింది.

అటూ ఇటూ తిరిగి చూశాం. ఆ యేరు మైళ్ళకొలది దూరం పర్వ తాలు చుట్టి ప్రవహిస్తూఉంది. దాని కెక్కడా ఎలాంటి వంతెనా లేదు. మాకు, ఆవలి తట్టుకు మధ్య అది అడ్డంకిగా పనిచేస్తూఉంది. అవతలనున్న కొండలు బాగా నిటారుగా ఉండటంవల్ల వంతెన కట్టి కూడ లాభంలేదు. శత్రువుల దాడుల నాపడానికే ఆవలివారీ ఆనకట్ట కట్టిఉంటారు. వ్యవసా యము కోసంకాదు. కొండలుకూడ అభేద్యమైన కోటల్లాగున్నాయి.

ఉత్తరదిశ నేమైనా దారి ఉందేమో అని యేరును పట్టుకొని ముందుకు వెళ్ళాం కాని ముళ్ళ పొదలలోపడి ఏటిదారి తప్పాం. మాకు ఐదువందల గజాల దూరంలో ఉన్న చేవరాతి కొండలు నిటారుగా లేచి పైనున్న పట్టణానికి ప్రహారీ గోడల్లాగ పని చేస్తున్నాయి. ఒకచోట కొండల మధ్య బీటఉంది. దాంట్లోంచి పైకి చిడీలు కొంత దూరం కన బడ్డాయి. ఆ పైన రాళ్ళ నీడల్లో అదృశ్యమౌతున్నయి. ఇదే లోనికి మార్గమైయుండాలి. సందేహంలేదు. కాని అది ఎక్కడం చాలా కష్టం. ఒకరి ముఖాలొకరం చూచుకొన్నాం.

మతి పోయినట్టుంది. అవతల యేముందోతెలియదు. ఆ కొండ కోట చేరడానికి బలముంటేచాలదు. బాణాలు బళ్ళాలు, ఎవరికీ తీసిపో

శుండా వేయగలం. కాని తప్పుకోడానికి దారి లేనిదేశంలో దెబ్బలాడాలి. లోనున్న వారికి బయటివారు రావడమిష్టముండదు కదా! అయినా వెళ్ళక తప్పదు. తెల్లకోతి అక్కడనే ఉంటే ఏదో ఒకటి చకాపికి తేలిపోతుంది. అతడు లేని పక్షాన్ని లోనివారు మనకు స్నేహితులైన జాతివారే కావచ్చు ఆదారి వెంటలోనికి వెళ్ళదానికి మేమంతా యిష్టపడ్డాం.

పైకివెళ్ళేసరి కక్కడ ఒకబోనులాంటి పరిస్థితిలో చిక్కుకున్నాం. ముప్పై అడుగుల వెడల్పున సమతల ప్రదేశముంది. పైనున్న వారు బాణాలతో బల్లాలతో మమ్ము కొట్టవచ్చు. మాకు దాగుకొనటానికి రెండడుగుల మేర మాత్రం ఒక పెద్ద బండ నీడఉంది. అక్కడ నుండి ఒక సన్నని మార్గం రెండు కొండల మధ్య మెలికలుగా పదడుగులు పోయి దృఢమైన కర్రతో చేసిన ఒక పెద్ద తలుపును చేరుస్తుంది. తలుపు అవతల వైపు బిగించి ఉంది. ఆ గుమ్మంలోంచి ఒక్కొక్కడు మాత్రమే లోనికి వెళ్ళగలం. ఇంతకంటే కట్టు దిట్టంగా ఊహించి నిర్మించిన కోటను మేమింతవరకు చూడలేదు.

తలుపు తట్టాం కాని లాభం లేక పోయింది. చెవి తలుపునానించి జాగ్రత్తగా వింటే దూరాన్నుంచి ఆడవాళ్ళ పిల్లల నవ్వులు వినబడుతున్నాయి. గట్టిగా తలుపుకొట్టి కేకవేశాం. ఇరవై నిముషాల తరువాత కొండ మీద ఒకతల కనబడింది. అతడు మమ్మల్ని మీరెవ్వరని అడిగాడు. లెఫ్టినెంటు వాంగ్ వారి భాషలో మేము వేటకు బయలు దేరామని దక్షిణానికి దారి వెతుక్కుంటూ వచ్చామని చెప్పాడు. పైనున్నవాడు మరి కనబడలేదు కాని లోపల గందరగోళం వినబడింది. మళ్ళీపైకి చూసేసరి కొక డజను బాణాలు మావైపు గురిచూసి ఉన్నాయి. మేము దెబ్బలాడడానికి రాలేదని తలుపు తియ్యమని జనరల్ నచ్చచెప్పాడు.

తలుపు తీశారు. వాంగ్ ముందు నిలబడ్డాడు. లోన అటు ఇటూ రెండు వరసలగా అరవై మంది బాణాలు సంధించి ఉన్నారు. మొదటి

వరుసలో పది మంది మోకాళ్ళపై కూర్చున్నారు. రెండవ వరసవాళ్ళు నిలబడి ఉన్నారు. గుమ్మానికి దగ్గర్లో రెండు పైపులా ఆరుగురు చిన్న కత్తులతో ఉన్నారు. ఆ గుహాముఖంలాంటి గుమ్మంలోంచి లోనికివచ్చే ఒక్కొక్క విరోధి శిరస్సును సులభంగా లోనివాళ్ల తెగవెయ్యవచ్చు. అలాంటి స్థితిలో వీరత్వం కంటే వివేకమేమేలు. నవ్వుతూ వాంగ్ ముందుకు వెళ్ళాడు. కత్తులు ముందు కొచ్చాయి. వాంగు మాట్లాడాలని చూస్తూఉండగానే వాళ్ళు వాంగు కత్తి నొరలోంచి తీసేశారు. ఇంతలో మాలో రెండోవాడు, మూడోవాడు లోనికివెళ్ళారు. కత్తులు బాణాలు ఎగిరాయి. ముగ్గురు నలుగురప్పుడే క్రిందపడి పోయారు.

ఒక అరుపు ఆ పోరాటాన్నాపింది. తలెత్తి చూచాం అరచినవాడు దగ్గరగా పదిహేను అడుగుల ఎత్తున్న ఒక బండమీద నిలబడిఉన్న తెల్లకోతే, అతణ్ణి కలుసుకోడానికి జనరల్ ముందుకువెళ్లాడు. తెల్లకోతి క్రిందికి వచ్చాడు. "ఈ పోరాటం అనవసరంగా రేగింది. మేము దక్షిణ దిశకు పోతూ దారి అడిగాం"అని జనరల్ తన్నుతాను తెలుపుకొన్నాడు. ''మీ రాకనాకు గౌరవప్రదం'' అన్నాడు తెల్లకోతి. మరెవ్వరైనా జనరల్ అధికారానికి అమితగౌరవం చూపిఉందురు. అతిధిని సత్కరించే గొప్ప గృహస్థువలె మాత్రం చూపట్టాడు తెల్లకోతి. అతని తలవెంట్రుకలు పైకి ముడి వేసిఉన్నాయి. ఇతర అడివిజాతుల వారికి వలెనే ఇతనికీ కాళ్ళకు చెప్పులు లేవు. తెల్లని కనుబొమలు భయంకరంగా ఉన్నాయి." "నీవు నా అతిధివి కాబట్టి నీవారి నందర్నీ ఆయుధాలు తీసేయమని చెప్పు." చూస్తున్నావుకదా! నా చేతిలో యేమైనా ఆయుధం ఉందా? అని తెల్లకోతి పెద్ద పెట్టున నవ్వాడు. మనం స్నేహితులం నాదేశం నీవు చూడలేదు. చూస్తే సంతోషిస్తావు.'' అని కూడ అన్నాడు. మమ్ము ఆయుధాలు తీసేయమన్నాడు మా జనరల్. దీనికి తెల్లకోతి చాలసంతోషించాడు.

మరింత ఆప్యాయంగా జనరల్ వైపు చూచాడు. దెబ్బతిని పడిపోయిన వారిని లేవదీయించాడు.

వారి దేశం చూచి నేను ఆశ్చర్య చకితుణ్ణియ్యాను. పెద్దమైదానం. అన్ని వైపులా కొండ శిఖరాలు. నారింజచెట్లు, పొట్టితాటిచెట్లు, వరి పొలాలు కన్నుల విందుగా ఉన్నాయి. బయట ఎండకాస్తున్నా ఇక్కడ గాలి సుగంధ శీతలంగా ఉంది. అచ్చట వెలుతురేలేదు. ఆకులు, పళ్ళు, పూలరంగులు అన్నింట్లో ఏదో విశిష్టత ఉంది. మరో ప్రపంచానికి వెళ్ళి పోయామా అనిపించింది. అక్కడ కూడ చిన్నచిన్న పాకలున్నాయి. వాటికి ఎండుటాకులు కప్పారు. నేలమట్టం ఎత్తుచేశారు. ఎండలో స్త్రీలు పిల్లలు నవ్వుతూ ఆడుకుంటున్నారు. తెల్లటి చిలకలు, ఎర్రటి పురుగులు ఒకచెట్టునుండి మరో చెట్టు కెగురుతున్నాయి. ఇట్టి ఆనందసీమలో దుర్మార్గం ఊహకు కూడ సాధ్యంకాదన్నట్లుతోచింది.

"ఎంత చక్కని దేశంమీది! నాకు అసూయకల్గుతూఉంది దీన్ని చూస్తే" అన్నాడు జనరల్. "సురక్షితమైంది కూడాను" అన్నాడు నవ్వుతూ తెల్లకోతి. అతడు దుంగలతో కట్టిన ఒక గదిలోఉంటాడు. నేలమీద బల్లచక్కలు పరచి ఉన్నాయి. కొన్ని చెక్కలు బెంచీలుగాను, కొన్ని మేజాలుగాను అమర్చి ఉన్నాయి ఏమంతసామాను లేదు.

మమ్మ చూడడానికి చాలామంది కల కల లాడే ముఖాలతో వచ్చారు. వారిలోకొందరు చైనా స్త్రీ లున్నారు. మధ్యాహ్నమైంది. అన్నము పులుసు వడ్డించారు. పులుసులో కాయగూరలు, మసాలాలు, పంది ప్రేగులువేసి ఉడక బెట్టారు. పులుసు కొంచెం వాసనేస్తూఉంది.

తెల్లకోతికి చాలామంది భార్యలున్నారు. చైనావారికివలె వీరికి కూడ ఘోషా లేదు. జనరల్ తన భార్య మాట ఎత్తలేదుకాని తింటూ మాట్లా

దుఃరూకాడ అతడావృష్టిలోనే ఉన్నాడు. భోజనానంతరం తన దేశాన్ని చూపడానికి తెల్లకోతి జనరల్ని తీసుకు బయలుదేరాడు. తన దేశంలోంచి తన బందీలు కాని, తన అతిథులు కాని తప్పించుకు పోలేరని చూపదల చాదేమో! రెండువందల పౌనుల బరువున్నా అతడు గబగబ ఊగుతూ నడుస్తున్నాడు. కాళ్ళు సన్నం, పైభాగం బరువు అతని దేహానికి. అందు చేత కొండ అడవులలో నడవడానికీ, పిగ్రాకటానికీ వీలుగా ఉంది. ఆ లోయలోని వెలుతురు రంగులో అతని రాగివర్ణం దేహం మీద తెల్లని కనుబొమ లసహ్యమనిపించడంలేదు. ముడతలుపడ్డ దవడలు, కండలు దీరిన చేతులు, బలిష్ఠభుజాలమధ్య విశాలమైన వీపు అతని అఖండ బలాన్ని సూచిస్తున్నాయి. ఎవ్వరికీ ఋణపడని వానివలె నిశ్చింత, సంతోషం, గర్వంతో ఉన్నాడు కాని జనరల్ భార్య నెత్తుకువచ్చిన నేరస్థునివలె లేడు తెల్లకోతి.

జనరల్, తెల్లకోతి ముందు నడుస్తున్నారు. వెనక నేను, వాంగు, మరికొంచెం నడుస్తున్నాం. ఒక తలుపు దగ్గర బిడ్డనెత్తుకొని నిలబడ్డ ముప్ఫై యేండ్ల చైనా స్త్రీని చూచి జనరల్, ఆమె "చైనా స్త్రీ కాదా?" అన్నాడు. "ఔను, ఇంకా చాలామంది ఉన్నారు. అందమైన స్త్రీ లంటే నీ కిష్టం లేదా" అని తెల్లకోతి పట్టించుకోకుండా పలికాడు. ఆ స్త్రీలు మావైపు నిశ్శబ్దంగా చూస్తున్నారు. వాళ్ళ పిల్లలు మరీ బాగున్నారు. "అందమైన స్త్రీలు భార్యలుగా దొరికితే నాపరివారాని కెంతైనా సంతోషం. నా మనుష్యుల ఆనందమే నేకోరేది. మాకన్నీ ఉన్నాయి. చేపలు, జంతువులు, కోళ్ళు, బియ్యం అన్నీ ఉన్నాయి. డబ్బవసరం మాకులేదు. మా ప్రజలనుండి పన్నులు పుచ్చుకోను. రేపంటే మేము చేపలు పట్టే చోటు కూడా చూపిస్తా. మాకు లేనివల్లా ఉప్పు, ఆడవాళ్ళు, కత్తులు, "స్త్రీలు లేరంటూరేమిటి ఇంత మంది నిక్కడ చూస్తున్నాను" అన్నాడు జనరల్. "చాలరు వాళ్ళు. మేము మూడు వందలున్నాము. ఆడవాళ్ళు

రెండువందలు మాత్రమున్నారు. ఈ సారవంతమైన మైదానం వెయ్యి మందికన్నా తిండి పెట్టగలదు. నారాజ్యం బలమైన అందమైన జనంతో నిండి పోవాలి. మాకు కావలసినంత మంది ఆడవాళ్ళులేరు'' అన్నాడు తెల్లకోతి.

''ఎందువల్ల లేరు?'' అని ఆశ్చర్యంగా అడిగాడు జనరల్. ముసలాళ్ళని కూడా లెక్కేస్తే మూడువందల మంది ఉంటారు. పద్దెనిమిది మొదలు నలభైయైదు సంవత్సరాలలోపు వాళ్ళే పిల్లల్ని కంటారు. చైనా స్త్రీలు చాలా మంది స్త్రీలని కంటారు. పదేళ్ళపిల్ల నొకతెను తెచ్చాను. అందమైన పిల్లల్ని యేడుగుర్ని వరసగాకంది. మా స్త్రీలు సాధారణంగా ఇద్దర్నో ముగ్గుర్నో కంటారు. మీ ఆడవాళ్ళేనయం'' అన్నాడు తెల్లకోతి. "స్త్రీల నెత్తుకొస్తారా?" అన్నాడు జనరల్. ప్రసంగం అసలు విషయానికి దగ్గర కొస్తూఉంది. లేదు, ఇక్కడికి తీసుకొస్తాను. మా ఆడవాళ్ళనితర్లు తీసుకువెళ్ళగల్గితే తీసుకువెళ్ళవచ్చు. ప్రయత్నించండి'' అని నవ్వాడు తెల్లకోతి. ఇంకా అన్నాడు. ''మీ పెళ్ళిళ్ళు చిత్రంగా ఉంటాయి. పెళ్ళి తల్లిదండ్రులు కుదురుస్తారు కదా! నేను నా చేతులతో నా ఇంట్లోకి మోసుకురాలేని దానిని భార్యగా తీసుకోనే తీసుకోను''. "మీ పద్ధతి మంచిదా?'' అని జనరల్ అడిగాడు. తెల్లకోతి చిత్రంగా చూస్తూ'' మా పద్ధతి సరదాగా ఉత్సాహకరంగా ఉంటుంది. మీరో మీ తల్లి దండ్రుల్నో ఒకత్తెను భార్యగా కుదర్చమంటారు. ఆమె నిశ్శబ్దంగా మీ ఇంట్లోకి వస్తుంది. ఇందులో పెళ్ళి కొడుకు ఘనత యేముంది? సరదా యేముంది?" అన్నాడు తెల్లకోతి.

జనరల్ ఉత్సాహం తగ్గింది. ఎత్తుకుపోవడాల గూర్చి అతనితో వాదించి లాభం లేదనుకొన్నాడు. "బలాత్కారంగా చైనా స్త్రీలను ఎత్తుకొస్తే మా ప్రభుత్వం ఒప్పుకోదు తెలుసా? అన్నాడు జనరల్.

చైనా ప్రభుత్వం ఒప్పుకొంటే తనకేం ఒప్పుకోకపోతే తనకేం అన్నట్లు తెల్లకోతి నవ్వాడు.

కొండపై కెక్కేం. అక్కడి నుంచి మైదానమంతా కనిపిస్తూ ఉంది. ఏరు మైదానానికి దక్షిణాన్ని తూర్పును చుట్టివచ్చి, పడమటికి ఉత్తరానికి వ్యాపించిన కొండ దగ్గరాగింది. తనరాజ్యం దుర్భేద్యం అని మాకు తెల్లకోతి చూపినట్లయింది. ఆ రాత్రి గిన్నీకోళ్ళు, పిట్టలు, తాబేళ్లు వండి మాకు మంచి విందుచేశారు. నాయకుడు (తెల్లకోతి) విందుకు బాగా తయారయ్యాడు. మెత్తని తోలుఅంగీ, దానిమీద ఎర్ర రంగు వేసిన యేనుగు చర్మపు వేస్టుకోటు, చేతులకు కొన్ని చర్మపు తొడుగులు ధరించాడు. ఆ దుస్తులు, కవచం బాగున్నాయి. నిజానికి ఆయుధాలు కూడా వానిని ఛేదింపలేవు. పదిమంది అడవిజాతివారు ఈ తెలు ధరించి గోడ పొడుగూతా నిలబడ్డారు. అన్నం వడ్డించడాని కతని స్త్రీలు వస్తూ పోతూన్నారు. మేము వచ్చిన పని బయట పడుతుందని జనరల్ భార్యను గూర్చి మేమెవ్వరిని అడగలేదు. అతిథిగా ఆదరణ చూపిస్తున్నప్పటికీ, నాయకునికి మేమెందుకు వచ్చామో తెలిసే ఉంటుంది. భోజనం చేస్తున్నంతసేపు జనరల్ మనస్సు ఎక్కడో ఉంది. తన భార్యను నాయకుడు ఎత్తుకు వచ్చినట్లొప్పు కొన్నట్లే కదా!

హఠాత్తుగా ఒక స్త్రీ ఏడుపు వినబడింది లోపల్నుంచి. అది తన భార్య కంఠమేనని జనరల్ గుర్తించి, లేచాడు. ఇతర స్త్రీలు పనులలో మునిగి ఉండగా ఆమె తప్పించుకు వచ్చేసింది. భర్తను చూడగానే అతని భుజాలమీద వ్రాలిపోయి మనసు కరిగేటట్లు ఏడుస్తూవుంది. జనరల్ ఆమె నూరుకోబెట్టుతూ ఉండగా నాయకుడు చూస్తున్నాడు. "ఈమె నా భార్య'' అన్నాడు జనరల్ దేనికైనా సరే సిద్ధపడి. "అట్లాకాదు. అది అంత తెలివైన ప్రశ్నకాదు. ఏమంటావు?'' అని ఆశ్చర్యంనటిస్తూ పలికాడు

నాయకుడు. "నాయకా, నేను స్నేహితునివలె వచ్చాను. స్నేహితునివలెనే. వెళ్ళిపోతాను. నా భార్యను నన్ను తీసుకుపోనియ్యి" అన్నాడు జనరల్. "తీసుకొన్నది తిరిగి ఇవ్వడం నా ఆచారంకాదు. నీవు తీసుకుపోగల్గేవరకు ఆమె నాదే! నేనివ్వను. నీదురదృష్టంవల్ల ఆమెను పోగొట్టుకొన్నావు" అని చెప్తూవున్న నాయకుని ముఖం భయంకరంగావుంది. చెయ్యి కత్తిమీదకూడా వేశాడు. రక్షకులారా, అనేసరికి వాళ్ళు కత్తులుతీశారు. "నేను నీ అతిథినన్న మాట మరచిపోకు" అని జనరల్ అన్నాడు. అడవిజాతివారి కఠినులను మన్నించవలసిన ముఖ్య నియమం ఉందని జనరల్‌కు తెలుసు.

నాయకుడు చెయ్యి కత్తిమీదనుంచి తీసేశాడు. జనరల్‌కు దగ్గరగా వచ్చి "ఇట్లాగెనందుకు విచారిస్తున్నాను. మీరు మీ రాజ్యంలో పాలిస్తున్నట్లు నే నిక్కడ పాలిస్తున్నాను. ఆమె నెత్తుకుపోవడానికి తలపెట్టవద్దని నేను సలహాయిస్తున్నా. నీకు విలువిద్య బాగావచ్చా?" అని అడిగాడు. "ఒక మోస్తరుగా వచ్చు" అన్నాడు జనరల్. "సరే, రేపు మా ఆచార ప్రకారం వివాదం న్యాయపరిష్కారం చేసుకొందాం. అంతవరకు ఈమె నాదే" అంటూ ఆమెను దగ్గరకు తీసుకొన్నాడు నాయకుడు. ఆమె భయంతో వణికిపోతూంది. వ్యవహారం బిగిసిపోయింది. ప్రసంగం సాఫీగా నడవడంలేదు. నాయకుడు తను చేసినదాంట్లో తప్పులేనట్లు అందరికన్నా మర్యాదగా ప్రవర్తిస్తునట్లు ధీమాగా ఉన్నాడు. ఆదిమవాసులలో భార్య నెత్తుకొనివచ్చే పద్ధతి ఉన్నమాట నిజమే!

"ఈ స్త్రీలను నాకోసమే తెచ్చాను. ఒక సంవత్సరానికి బిడ్డనికనని స్త్రీని నా పరివారాని కిచ్చేస్తా, అంటూ తమ పద్ధతులు జనరల్‌కు తెలియజెప్పాడు నాయకుడు. ప్రతి సంవత్సరము జరిగే ప్రణయనృత్యంలో అడవిజాతి కన్య తన భర్త నెన్నుకొని కొండలలోకిపోయి నివసిస్తుంది. ఒక సంవత్సరంలోగా బిడ్డ పుట్టితే తల్లి దండ్రుల్ని చూడ్డానికి వస్తుంది.

అప్పుడు పెళ్ళయినట్లు లెక్క. లేకపోతే సంబంధం తెగిపోతుంది. మరు సటి సంవత్సరం నృత్యంలో మరొకణ్ణి వరిస్తుంది. ఇట్లా ప్రతేసారి జరుగుతుంది. నా పద్ధతి అంతే. ఒక సంవత్సరంలోగా బిడ్డని కనని స్త్రీని వదిలేస్తాను. మరెవ్వరైనా తీసుకోవచ్చు''అన్నాడు. ఆయాసంతో జనరల్ ''అసలు పిల్లలే పుట్టకపోతే?'' అన్నాడు. ''మనుషుల్ని మారుస్తావుంటే సాధారణంగా పుట్టకపోవడముండదు. బిడ్డలనుకనని స్త్రీల కమర్చాదే. మాలో బిడ్డల్ని తల్లుల్ని విడదీయడం మహాపాతకం. పెళ్ళెందుకు? పిల్లల కోసమేకదా! భర్త ఇందు కొరకు మాత్రమే! ఇక్కడున్న స్త్రీలంతహా తల్లులే. అందరూ హాయిగా ఉన్నా రిక్కడ''అని నాయకుడు చెప్పాడు.

నాయకుడు ప్రత్యేకంగా మరునాడు ప్రణయనృత్యమేర్పాటు చేశాడు. దాని తరువాత తనకు జనరల్‌కు విలువిద్యాపోటీ జరుగుతుంది. పురుషులు స్త్రీలు బిడ్డలు మంచి దుస్తులు ధరించారు. ఉదయమునుంచి యువకులు యువతులు తమతమ పనులు మానుకొని మంచి దుస్తులతో తిరుగు తున్నారు. నృత్యం మీది సరదాతో. ప్రణయ నృత్యం సాధారణంగా సాయంత్ర మారంభమై రాత్రికూడ జరుగుతుంది. ఆ తరువాత వరించిన జంటలు అడవులలోకి పోతారు. సరదాగా యువతులు గుంపులుగా తిరు గుతూ యువకుల్ని చూచి నవ్వుతున్నారు. రాత్రి ఎవర్ని వరిద్దామా అని చూస్తున్నారు.

సాయంత్రం నాలుగు గంటల వరకు నృత్యం ఆరంభం కాలేదు. తన భార్యలతోను బిడ్డలతోను నాయకుడు వచ్చాడు. వారిలో భయభీతమైన జనరల్‌భార్య కూడ ఉంది. యుద్ధ దుస్తులలో ఉన్నాడు. యేనుగుచర్మం వేస్టుకోటు మీద గర్వం. వయస్సు ముదిరినా అతని ముఖం మీద గీతలు సాయంత్రపు ఎండలో స్పష్టంగా కనబడుతున్నాయి. అతని నడుమున కున్న ఒరలోంచి సిల్కుదారాలు చుట్టిన రెండు పిడులు తొంగిచూస్తు న్నాయి. చక్రవర్తిలాగ గర్వంతోను సంతోషంగాను ఉన్నాడు నాయకుడు.

నృత్యమారంభమైంది. రంగమధ్యాన్ని ఏభై అడుగుల ఎత్తుననున్న జెండాస్తంభంవద్ద పాము చర్మాల భేరీలు కొందరు వాయిస్తున్నారు. పొడు గాటి కొమ్ము లిద్దరూదుతున్నారు. ఐదేసి అడుగుల పొడుగున బాకాల్లా గున్నాయి. అరమైలు దూరానికి వినబడుతున్నాయి. చేతులు కలుపుకొని కన్యలు జెండాచుట్టూ నాట్యం చేస్తూవుంటే పెద్దలు చేతిలోని ఈటెలతో దరువేస్తున్నారు. కన్యల నడుములకు కట్టిన యెఱ్ఱని పెళ్ళి రిబ్బనులు వాడు నృత్యంచేస్తూవుంటే ఎగురుతున్నాయి. ప్రతికన్యకు ఒక పెళ్ళి రిబ్బన్ ఉంటుంది. దాని మీద ఆమె నేర్పుతో ఓర్పుతో కుట్టుపనిచేస్తుంది. కన్యలచుట్టూ యువకులు నిలబడి చప్పట్లు వాయిస్తున్నారు. కన్యల తల్లులు కూర్చుండి అంతా చూస్తున్నారు. కన్య తనకు నచ్చినవాణ్ణి చూచుకొని నృత్యంలో అతణ్ణి సమీపించగానే తన రిబ్బను నతనివైపు ఊపుతుంది. అతనికి కూడ ఆమె నచ్చితే ఆ రిబ్బన్ పట్టుకొని ఆమెతో చేరతాడు. ఇలాగ నవ్వులతో పరిహాసాలతో, ఆటపాటలతో కొంతసేపు గడిచింది. జంటలు గబగబ ఏర్పడుతున్నాయి. కన్యల వలయంచుట్టూ మరోవల యంగా యువకులు తమ పియురాండ్ర రిబ్బన్లు పట్టుకొని తిరుగుతూ నాట్యం చేస్తున్నారు.

జనరల్ భార్య యీ నృత్యాన్ని కుతూహలంతో చూస్తూఉంది. జనరల్‌కు ఆతురత హెచ్చుగావుంది. నాయకుడు నృత్యంచూచి ఆనంది స్తున్నాడు. నిశ్చితంగా త్రాగుతున్నాడు; నవ్వుతున్నాడు. పోతే ఒక్క భార్యేకదా పోతుంది.

"నీవు గొప్ప జనరల్‌వని నాకు తెలుసు. నేనేమీ అన్యాయం చెయ్యను. మా పూర్వ సంప్రదాయం ప్రకారమే చేద్దాం, ఎవరిచెయ్యి పైనైతే వారే గెలుచుకొంటారు. అంటూ నాయకుడు తన భార్యలలో ఒకామె రిబ్బన్ పుచ్చుకొన్నాడు. ఒకే స్త్రీకోసం ఇద్దరు వివాద పడ్డప్పుడు

జరిగే విధానం చెప్పాడు. రిబ్బన్ అయిదంగుళాల వెడల్పుది. దానిమీద ఒక పామును కుట్టారు. ఆ రిబ్బన్ను స్తంభంపైన ఎగరవేస్తారు. పాము కంటి కెవరు దగ్గరగా కొడతారో వారికి పిల్ల దక్కుతుంది.

రిబ్బన్ స్తంభానికి కట్టారు. గాలిలో మెల్లగా ఊగుతోంది. ఉత్సాహంతో స్త్రీలు పురుషులు బిడ్డలు గుమిగూడి చూస్తున్నారు. ఇలాంటి ప్రేమపోటీ ఇదివరకెన్నడు జరగలేదు.

"ఏమంటావు? నూరడుగుల దూరంచాలా?" అని అడిగాడు నాయకుడు. ఒక్క నిమిషం తటపటాయించి జనరల్ సరే అన్నాడు. ఎగురుతూ ఉన్న చిన్నరిబ్బనుమీద పాముకన్నుకొట్టాలి! చాకచక్యం ఎంతో అంత అదృష్టంకూడ కావాలి! మంచివిల్లు బాణాలు అందుకున్నాడు జనరల్. జనం దూరంగా నుంచున్నారు. భేరీలు మ్రోగాయి. ఆవేశంతో నిండిపోయింది వాతావరణం. భర్త విలువిద్యపై తన విమోచనం ఆధారపడి ఉందని జనరల్ భార్య గ్రహించింది. మూడుసార్లు కొట్టవచ్చు లక్ష్యాన్ని.

జనరల్ మంచి విలుకాడు. ఇంతకన్న దూరంలోఎగిరే పక్షుల్ని కొట్టాడు. కాని సాధారణంగా ఎగిరేపక్షి తిన్నని మార్గాన్నేపోతుంది. పాముతల లక్ష్యం చేసుకొని కొట్టాడు. గాలికిగుడ్డ ఎగురుతూ చుట్టుకుపోవడంవల్ల మోసపోయాడు. బాణం దూరంలో ఎక్కడో అదృశ్యమైంది. "గాలివాలు చూచుకొన్నావు కాదు" అని మంచిసరదాలో ఉన్న నాయకుడన్నాడు. రెండవ బాణం కొంతనయం. పాముమెడ దగ్గర్నించి రిబ్బనులోంచి పోయింది. "బాగుంది! ఇంకోసారి కొట్టవచ్చు" అన్నాడు నాయకుడు. కాని చివరి దెబ్బపూర్తిగా తప్పిపోయింది.

నాయకుడు ముందుకు వచ్చాడు. తన బలిష్ఠమైన ధనస్సు నాటబొమ్మలాగెత్తి నారి మ్రోయించాడు. తన నైపుణ్యం చైనా జనరల్తో పోటీలో చూపడాని కతని కుత్సాహంగా ఉంది. నిశ్చలంగా నిలబడ్డాడు.

తల ఒక ప్రక్కకు కొంచెం ఒంగి ఉంది. లక్ష్యంమీద నిలిపిన కంట్లోనే అతని ప్రాణమంతా ఉంచా అన్నట్లు అగపడుతున్నాడు. జెండా కదలిక కొంచెం తగ్గడం చూసుకొని ఒక నిశ్శబ్దకాలంతో పాము తలలోంచి బాణం కొట్టేశాడు. తన వారంతా హర్షధ్వానంచేశారు. భేరీమృదంగాలు మ్రోగిపోయేటట్లు వాయించేశారు. సిబ్బను క్రిందికి దింపి చూచారు. వివాదానికి తావులేదు. జనరల్ గురువలు భ్రమింగాడు, భార్య ఏడ్చింది. ఐతే తీర్పు న్యాయమైంది. జనరల్ ఒప్పుకోక తప్పలేదు.

"నాకు చాలా విచారమైంది. కాని బాణంవాగానే వేశావు" అన్నాడు నాయకుడు. జనరల్ భార్య యేడుస్తూ నేల కూలింది. ఆ యెడబాటు దుస్సహం మహాఘోరం అయిపోయింది. వెనువెకొంటుక్కొని జనరల్ తన భావాల్ని అణుచుకొన్నాడు. మా ఆయుధాలు కొంత గుమ్మానికావలే ఉంచేశాడు. వెళ్ళేటప్పుడిచ్చాడు. నాయకుడు మాతో గుమ్మందాక వచ్చాడు. పూర్వకాలపు రాగి భేరీ నొకటి జనరల్‌కు బహుమానం చేశాడు. "మనసు కష్టపెట్టుకోకు జనరల్. మళ్ళీ సంవత్సరం నీ కిష్టమైతే రా. అప్పటికి నా భార్యకు పిల్ల పుట్టకపోతే నీకిచ్చేస్తాను" అన్నాడు.

మరుసటి సంవత్సరము ఒక చిత్రం జరిగింది. భార్యను చూడ్డానికి జనరల్ వెళ్ళాడు కాని అప్పటికే భార్యకొక బిడ్డ కలిగింది. ఆటవిక స్త్రీల దుస్తులు ధరించివుంది. సంతోషంగా పిల్లావాని చేతుల్లో ఎగరేసుకుంటూ వచ్చి సగర్వంగా అతనికి చూపించింది. జనరల్‌కు కోపం వచ్చేస్తూవుంది

"నిన్నిచ్చేయమని అడిగి నాయకుని ఒప్పించగలనని నాకింకా ఆశ వుంది" అన్నాడు జనరల్. కాని భార్య నిశ్చితంగా ఉంది. "లేదు, నేను రాను. పిల్లావానినిక్కడ వదిలి రాలేను నేను తల్లిని కదా!" "ఉండిపోతానంటావా? నాయకుణ్ణి ప్రేమిస్తున్నావా? యేమిటి నీ సంగతి?" అని జన

రల్ కచ్చితంగా అడిగాడు. ''ఏమో నాకవంతా తెలియదు. అతడు నా బిడ్డకు తండ్రి. నీవు వెళ్ళిపో, నాకిక్కడ హాయిగానేవుంది'' అంది భార్య.

భార్య మాటలు విని జనరల్ అక్షరాలా రూఠిపోయాడు. తెల్లకోఠి తానసుకొన్నంత మొరటుకాడని అర్ధం చేసుకోడానికి కొంతసేపు పట్టింది. విజయ మతడిదే అయింది. ఎందువల్లోకూడ తెలిసింది.

ఈ చివరి అవమానం జనరల్ సహించలేక పోయాడు. మళ్ళీ మనిషి కాలేకపోయాడు.

—కవాబాటా యాసునారీ

# 5. పుట్టుమచ్చ

[కవాబాటా యసునారీ మంచి వయస్సులో ఈ కథ వ్రాశాడు. స్త్రీల మానసికతత్వం ఇతడెంతగా అవగాహన చేసుకొన్నదీ దీనిలో తెలుస్తుంది. ఇతని వ్రాతలలో ప్రత్యేక గుణమిది.]

గతరాత్రి ఆ పుట్టుమచ్చని గూర్చే కలవచ్చింది. పుట్టుమచ్చ అంటే చాలు నీకు తెలియడానికి. దానిగూర్చేకదా లెక్కలేనన్నిసార్లు నీవు నన్ను తిట్టిపోసింది.

నా కుడీభుజం మీద ఉందామచ్చ; వీపుకు బాగా పై తట్టున ఉంది.

"ఐటాణీ గింజకంటె అప్పుడే పెద్దదయింది. దానితో చెలగాటం మానవు. చూస్తూఉండు దానికి కొమ్మలు రెమ్మలు పుట్టుకొస్తాయి"అని నీవు నన్ను ఏడిపించేవాడివి. నీవన్నట్లు అది మామూలు పుట్టుమచ్చకంటే పెద్దదే. గుండ్రంగాను, ఉబ్బి ఉంది. చిత్రం.

చిన్నప్పుడు మంచం మీద పడుండి దానితో ఆడుకొనేదాన్ని. కాని నీవు మొదట దాన్ని గమనించేసరికి నాకు వచ్చినంత సిగ్గేసింది, నే నేడ్చాను కూడ. నీ కాశ్చర్యంవేసింది. నాకు జ్ఞాపకమే.

"ఊరుకో, సయోకో, నీవు దానివి తడిమినకొద్దీ అది పెద్దదవుతుంది" అని మా అమ్మ కూకలేసింది. నేనింకా చిన్నదాన్ని. పదమూ

డేండ్లయినా ఉండవు. అప్పటినుండి నేకాంతంగా ఉన్నప్పుడల్లా మచ్చని తడుముతూ ఉండేదాన్ని. అలవాటు బలిసిపోయింది. ఇంత అలవాటైపోయినట్లు కూడ నాకు తెలియదు.

నీవు మొదట దాన్ని గమనించేసరికి, నిన్ను పెండ్లాడినా, నే నింకా చిన్నదాన్నే. నాకెంత సిగ్గేసిందో మగవాడివి నీకేమి తెలుస్తుంది. సిగ్గన్న మాటేమిటి? చచ్చేటంత భయంవేసింది, పెళ్ళంటే అప్పుడొక ఆపదలాగ అనిపించింది. నాకు కూడ తెలియని నా రహస్యాలన్నీ ఒకదానివెంట ఒకటి నీవు విప్పేసుకుంటున్నట్లు తోచింది. నాకింక రహస్యమే లేదా అనిపించింది.

గుర్రుపెట్టి నీవు హాయిగా నిద్రపోతుంటే, నాకుకొంచెం విశ్రాంతి, ఏకాతం దొరికేది. నాచెయ్యి మచ్చపైపు పోయేసరికి మళ్ళీ త్రుళ్ళిపడే దాన్ని, నా పుట్టుమచ్చనిం కెప్పుడు స్పృశించను అని మా అమ్మకు వ్రాద్దా మనుకొన్నాను. ఆ భావం నా మనస్సులోనికి వచ్చేసరికి, నా ముఖం కంద గడ్డలాగ ఎఱ్ఱబారి పోయింది.

"మచ్చను గూర్చి ఒకటే పిచ్చిబెంగా" అన్నావు నీ వొకసారి. నాకు సంతోషం వేసింది. తల ఊపాను. కాని వెనుకటి సంగతులన్నీ ఇప్పుడు జ్ఞాపకం తెచ్చుకొంటే అనిపిస్తుంది : నా అలవాటు నీవు మరి కొంచెం ఆదరంతో అర్థం చేసుకొంటే ఎంత బాగుండేదో అని.

మచ్చను గూర్చి కాదు నాకు బెంగ. ఆడాళ్ళ మెడలమీద మచ్చల కోసం మగాళ్ళు వెదుకుతూ కూర్చుంటారేమిటా అని? తాళం బిగించిన గదిలాగ శుభ్రంగా ఉందన్న సామెత యే అనాకారి పిల్లకోవర్తిస్తుంది. కాని నాకు కాదు. పెద్దదైతే మట్టుకు పుట్టుమచ్చ అనాకారమనిపించు కొంటుందా?

ఆ మచ్చతోనే నాడుకొంటున్నానని నీ వెందుకనుకోవాలి? నా అల వాటు నీకెందుకు వికారం కలిగించాలి? "మానేయి, మానేయి" అని ఎన్ని వందలసార్లు నన్ను కూకలేసావో! కోపావేశంతో ఒకసారి "ఎడమ చెయ్యే వాడాలా?" అని అడిగావు! "ఎడమచెయ్యా" అని ఉలికిపడ్డాను. నిజమే, ఇదివరకు గుర్తులేదు కాని ఎడమ చేత్తోనే తడుముతున్నానని తెలుసుకొన్నాను.

"మచ్చ నీ కుడిభుజం మీద ఉందికదా, కుడిచెయ్యేవాడుకో" అన్నావు. "ఔను" అని కుడిచెయ్యి యెత్తాను. "అబ్బే, వీలుగాలేదు" అన్నాను. "ఏం, వీలులేకేం" అన్నావు. 'ఎడమచేత్తోనే వీలుగా ఉంది' అంటే "కుడిచెయ్యే దగ్గర కదా మచ్చకు" అన్నావు. కుడిచెయ్యి వెనక్కి తిప్పాలి. కుడిచెయ్యి వెనక్కు తిప్పడమా, ఎడమచెయ్యి ముందుకు తేవ డమా, ఏదివీలు? నీవు అన్నదానికల్లా తల త్రిప్పడం మానేశాను. నీతో వాదిస్తూనే, నా ఎడమచేతిని ముందుకు తెచ్చి కుడిభుజము మీదకు పోనిస్తూ ఉంటే నిన్ను దూరంగా నెట్టేస్తూ ఉన్నానా లేక నన్ను నేనే కౌగలించు కొంటున్నానా అనిపించింది. కఠినంగా ప్రవర్తిస్తున్నానేమో నీ యెడల అని కూడ అనిపించింది.

"ఎడమచెయ్యి వాడితే తప్పేమిటి?" అన్నాను నెమ్మదిగా. "కుడి చెయ్యో, ఎడమచెయ్యో, నీదిమట్టుకు దురలవాటు" అన్నావు. "నాకు తెలుసు" అన్నాను.

"నీ కెన్నిసార్లు చెప్పాను డాక్టరు దగ్గరకు వెళ్ళి ఆ పొటమరించిన మచ్చ తీయించేసుకోమని".

"నేను వెళ్ళలేను నాకు సిగ్గేస్తుంది".

"ఇదేమంత పెద్దపని. నిముషంలో తీసేస్తారు."

"పుట్టుమచ్చ తీయించడాని కెవరన్నా డాక్టరు దగ్గర కెళ్తారా?"

"ఆ, చాలమంది వెళ్తారు".

"ముఖం మీద మచ్చలైతే వెళ్తారేమో. మెడమీద మచ్చకు వెళ్తారా? డాక్టరు నవ్వుతాడు. నా మగడు గొడవపెడితే వచ్చాననుకొంటాడు డాక్టరు."

"అస్తమానం తడిమే దురలవాటుఉంది కాబట్టి వచ్చాననిచెప్పు."

"ఏమిటీ, చిన్నమచ్చగద! అదీ కనబడే స్థలంలోలేదు. ఈ మాత్రం సహించలేవా?"

"నిరంతరం తడుముతూ ఉండకపోతే సహిస్తాను".

"తడమాలని తడముతున్నానా ఏమిటి?"

"నీ కాకతే మంకుపట్టు. నేనెంత మొత్తుకొన్నా నీ అలవాటు మానడానికి ప్రయత్నించవు".

"నేనెంతో ప్రయత్నిస్తున్నాను? ఎత్తుమెడ గౌనుకూడ రాత్రిళ్ళు వేసుకొన్నాను మచ్చదొరకకుండా".

"ఎన్నాళ్ళు వేసుకొన్నావులే!"

"తడవడం తప్పా?" అన్నాను. తరగబడి దెబ్బలాడుతున్నట్లు అనిపించిందేమో.

"అదేమీ ప్రత్యేకంగా తప్పుకాదు కాని నాకిష్టంలేదు కాబట్టి మానమన్నాను".

"అయితే నీ కంత అసహ్యమెందుకు!"

"ఇప్పుడు కారణాల్లోకి దిగక్కరలేదు; నీ వదేపనిగా మచ్చతో చెలగాటమాడనూ అక్కరలేదు. అది దురలవాటు. అది మానాలని నా కోరిక".

"నేను మానననని ఎప్పుడన్నాను?"

"నీవు మచ్చ తడుముతున్నప్పుడెల్లా నీముఖ మదోవిధంగా పరాకుగా ఉంటుంది. నిజంగా నాకదే అసహ్యమనిపిస్తుంది."

"నీవు చెప్పేది నిజమే కావచ్చు." అతడన్నది నా మనస్సులో గ్రుచ్చుకొంది, ఒప్పుకొన్నట్లు తల త్రిప్పాను.

"ఈసారి నేనలా చేస్తే నా చెయ్యిమీద కొట్టు. నా ముఖంమీద కొట్టినా సరే."

"రెండు మూడేండ్లనుంచి యీ దురలవాటు మానుకోవాలని ప్రయత్నిస్తున్నావు కదా! మానుకోలేక పోయినందుకు బెడదా, బెంగా లేదా?"

నేను జవాబు చెప్పలేదు. నీ వన్నమాట! "నిజంగా నా కదే అసహ్యం" ఉన్నదే తలపోసు కుంటున్నాను. పుట్టుమచ్చ గూర్చే ఆలోచిస్తూ, దానిని కప్పి పెట్టడానికి పదే పదే ఎడమచేయి నెత్తుతూ స్వార్థాన్ని గూర్చే తాపత్రయపడే ఆడది అసహ్యంగానే కనబడవచ్చు. నీ వన్నట్లు నా ముఖ మేదో పరాకుగానే ఉండి ఉంటుంది. దీన్నిబట్టి నన్ను నేను పూర్తిగా నీ కర్పించుకోలేనట్లు, మనిద్దరికీ మధ్య ఖాళీఉందనట్లు అనిపిస్తూ ఉందా నీకు. చిన్నప్పటినుండి మచ్చ తడుముతూ ఏవో ఆలోచనలలో పడిపోవడం నా కలవాటు. నా మీద ఏదో అసహ్యం కలగడంవల్ల యీ చిన్న అలవాటు గోరంతలు కొండంతలు చేస్తున్నావు. నేను నీకు నచ్చితే నవ్వేసి దాన్నిగురించే తలపోసేవాడివి కాదు. ఈ అలవాటే మెచ్చుకొనే మగవాళ్ళు ఉండకూడదూ అనేభావం నాలో కలిగేటప్పడికి నా వళ్ళు వణికింది.

నా మీద ప్రేమవల్లేకదా మొదట నీవీ మచ్చని గుర్తించావు. ఇప్పటికీ ఇందులో నాకు సందేహం లేదు. ఇట్టి చిన్న చికాకులే చిలవలు పలవలు వేసి కాపరాల్లో చిచ్చు పెడతాయి. ప్రేమికులైన దంపతు

లిలాంటివి పట్టించుకోరు: ఇలాంటి వాటిని గురించే పోరాడే వంపతులూ ఉంటారు. పట్టించుకోని వారంతా తప్పక ప్రేమిస్తారని, పట్టించుకొన్నంత మాత్రాన ప్రేమించరని అనను. నా అలవాటుని నువ్వింతగా పట్టించుకోక పోతే బాగుండేది అని మాత్రం గట్టిగా చెపుతున్నాను.

చివరకు నన్ను కొట్టడానికి తన్నడానికి సిద్ధమయ్యావు. ఎందుకు నీ కింత కాఠిన్యమని, మచ్చ ఉన్నంత మాత్రాన నేనింత దుఃఖ మనుభ వించాలా అని గోడు పెట్టాను. మచ్చ పై భాగాన్నేకదా ఉంది, "దీని నెట్లా మాన్పడం" అని కంపిత స్వరంతో అన్నావు. ఆ స్వరం బట్టి నీ మనోభావాన్ని, కొట్టినందుకు నీవు విచారించడం లేదనీ తెలుసుకొన్నాను. ఈ సంగతి ఎవరు విన్నా నిన్ను క్రూరుదంటారు. ఈ చిన్న విషయానికి మనిద్దరికీ ఇంత తగువులాటా ? నీవు కొట్టడం వల్ల హఠాత్తుగా నాలో స్వతంత్రం మొలిచినట్లనిపించింది.

"ఈ అలవాటు పోదు. ఇంక పోదు. నా చేతులు కట్టివేయి" అని నా రెండు చేతులు కలిపి నీ వైపు చాచాను. నీవు కంగారు పడినట్లు, నీ కోపంతోనే భావావేశం శూన్యమైనట్లు కనబడ్డావు. నా రిబ్బనుతో నా చేతులు కట్టివేశావు. కట్టివేసిన చేతులతోనే నేను నాతల వెంద్రుకల సరి దిద్దుకోబోతూ ఉంటే నీవు నన్ను చూచిన చూపు నా కానందం కలిగిం చింది. దీనితో నా చిరకాలపు టలవాటు తీరిపోతుందనుకున్నాను.

పిదప కూడ నా అలవాటు తలచూపడంవల్ల నాయందు నీ అమరాగం నశించిపోయింది ? నా విషయంలో నీ వింక కలుగజేసు కోవడం మానేశావు. "నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో" అనా నీ భావం. ఈ సారి మచ్చ తడుముతూ ఉంటే చూడనట్లే నటించి ఊరుకొన్నావు.

తిట్లకు, తన్నులకు లొంగని యీ అలవాటు చిత్రంగా యిట్లే పోయింది కదా తరువాత ! తీవ్ర ప్రక్రియలు పనిచేయలేదు. దానంతటదే

పోయింది "నీకేమి తెలుసు. ఇప్పుడేమో నేను మచ్చ ముట్టడమే లేదు" అని ఆనందంతో ఆ సంగతి అప్పుడే గ్రహించినట్లు చెప్పాను. హుంకరించి ఊరుకొన్నావు నీ కేమి పట్టనట్లు.

నీ కేమీ పట్టకపోతే నన్నెందు కంతగా తిట్టావు అని అడగాలనుకొన్నాను. "అంత సులభమైతే ఎందుకన్నాళ్ళు అలవాటు వదులుకొన్నావు కావని" నీ వడగాలనుకొన్నాను కానీ లు. కాని నాతో మాట్లాడనైనా మాట్లాడవు కదా! "మంచిదో చెడ్డదో అలవాటు నీ కిష్టమైతే మానుకోకు" అంటున్నట్లుంది నీ ముఖభావం. నాకు నిరుత్సాహం కల్గింది. నిన్ను విసిగించటానికి నీ ముందే మళ్ళీ మచ్చ తడమాలనుకున్నాను. కాని ఏమి చిత్రమో, నా చెయ్యి కదిలితేనా!

నా కెవ్వరు లేనట్లనిపించింది. కోపం ముంచుకొచ్చింది. నువ్వు దగ్గర లేనప్పుడు కూడ మచ్చ తడమాలనుకొన్నాను, కాని దానిపై సిగ్గు, ఏవగింపు కలిగాయి. నా చెయ్యి కదల నిరాకరించింది. నేలవైపు చూస్తూ పెదవి కొరుక్కొన్నాను. "నీ మచ్చ యేమయింది" అని అడుగుతావనుకొన్నాను. కాని నాటినుండి మన ప్రసంగాల్లో మచ్చ మాటే మాయమైంది. దాంతోపాటు ఇంకా చాలా విషయాలు కూడ మాయమయ్యాయి. నీవు తిట్టే రోజుల్లో మానుకోలేక పోయాను పాడు దాన్ని.

మళ్ళీ మాయింట్లో సంగతి.... మా అమ్మతో స్నానం చేశాను. "సయోకీ, వెనుకటి లాగ అందంగా లేవు. ఔను! వయస్సు నెదుర్కోవశమా" అంది మా అమ్మ. ఉలికిపడి ఆమె వైపు చూచాను. ఆమె మట్టుకు యథాప్రకారం లావుగాను, నిగనిగలాడుతూనే ఉంది. "ఆ మచ్చ ముచ్చటగా ఉండేది" అంది.

ఆ మచ్చవల్ల నిజంగా నష్టపోయాను. కాని మా అమ్మ కెలా చెప్పేది. "డాక్టరు సులభంగా బఠాణీ బద్దలాంటి నా మచ్చ తీసేయగల

డట" అని మాత్ర మన్నాను." డాక్టరా! కోసేస్తే మట్టుకు కోత మచ్చ ఉండదా? నీ మచ్చని గూర్చి నవ్వుకొనే వాళ్ళం. పెళ్ళయినా సమోకి మచ్చతోనే ఆడుకొంటూ ఉంటుంది కాబోసు అనుకునే వాళ్ళం అంది మా అమ్మ.

"ఔను ఆడుకుంటూనే ఉండే దాన్ని."

"మేమూ అలాగే అనుకున్నాం."

"ఈ దురలవాటు నా కెప్పుడారంభమైంది?"

"చంటి బిడ్డలకు పుట్టుమచ్చ లెప్పుడు వస్తాయో చూడలేదా?"

"నా బిడ్డలకు పుట్టుమచ్చలు లేవు."

"పెద్దవారైన కొద్దీ బయట పడతాయి. ఇక పోవు. నీ కున్నంత పెద్ద మచ్చ సాధారణంగా ఉండదనుకో. చాలా చిన్నప్పుడే నీకీ మచ్చ వచ్చి ఉంయింది" అంటూ మా అమ్మ నా భుజం చూసి నవ్వింది.

చిన్నప్పుడు నా మచ్చ ముచ్చటగా ఉండేది. మా అమ్మ మా అక్కలు దానిని పొడుస్తూ ఉండే వారు. వాళ్ళను చూచే, నేనూ దానితో ఆడటం మొదలు పెట్టాను.

పక్కమీద పరుండి మచ్చను స్పృశిస్తూ, ఇది చిన్నప్పుడెలా ఉండేదో, వయస్సులో ఎలా ఉండేదో అని జ్ఞాపకం తెచ్చుకుంటున్నాను. దీనితో చివరసారి ఆడుకొని చాలా కాలామయింది. ఎన్ని సంవత్సరా లయిందో!

నీకు దూరాన్నున్న మా పుట్టింట్లో నా యిష్టం వచ్చినట్లు మచ్చ బిళ్ళతో ఆడుకోవచ్చు. నన్ను నేవాళ్ళు లేరు. కాని ఏమి లాభం? నా ప్రేళ్ళు దాన్ని ముట్టుకోగానే నా కళ్ళంట నీళ్ళు కారాయి. చిన్నతనం జ్ఞాపకం తెచ్చుకోవాలని ముట్టుకొంటే జ్ఞాపకం వచ్చింది నీవే.

చెడ్డదాన్నని పేరు పడ్డాను. బహుశా నాకు విడాకులిస్తారేమో! కాని మా ఇంట్లో పడకమీద కూడ నిన్ను గూర్చే ఆలోచిస్తాననుకోలేదు. నా తలగడ తడిసింది. ప్రక్క కొరికాను. మచ్చనుగూర్చే కలగన్నాను. అది యెక్కడిగదో చెప్పలేను కాని నీవ్వుకూడ అక్కడే ఉన్నావు. మనతోపాటు ఇంకో స్త్రీ ఎవరో ఉన్నట్లుంది. నేను త్రాగుతున్నాను. మైకం కమ్మింది. నీతో ఏదో వాదిస్తున్నాను.

నా దురలవాటు మళ్ళీ వచ్చింది. నా ఎడమచేత్తో నా వక్షము మీదుగా వెదుకుతున్నాను. నా వ్రేళ్ళకు మచ్చబిళ్ళ తగిలింది. బాధలేకుండా ఊడివచ్చింది. వేయించిన బఠాణీ తొక్కలాగుంది. నీ ముక్కుప్రక్క నున్న పుట్టుమచ్చ గుంటలో నా మచ్చ నతకమని యిచ్చాను; గొడవ చేశాను. గోలపెట్టాను-నీదుస్తులుపట్టుకు వ్రేలాడేను. నీ వక్షము మీద పడిపోయాను. నేను మేల్కొనుసరికి తలగడ తడిగానేఉంది. నేనింకా ఏడుస్తూనే ఉన్నాను. బాగా అలిసిపోయాను కాని బరువుదింపినట్లు తేలిగ్గా ఉంది. ఒక్కసారి నవ్వువచ్చింది. నిజంగా మచ్చ మాయమైందా? కాని ఇంకా నా వ్రేళ్ళమధ్య నల్లని బఠానీలాగ ఉన్నట్లే ఉంది.

నీ ముక్కు ప్రక్కనున్న మచ్చను గూర్చి నే నెప్పుడూ ఆలోచించనేలేదు. ఎప్పుడు దానినిగూర్చి ఎత్తనూలేదు. కాని సదా నా మనస్సులో అది మెలగుతూనే ఉండేది. నా మచ్చకూడ చేరి నీ మచ్చ ఉబికితే బలే కట్టుకథ తయారౌతుంది. నా మచ్చగూర్చి నీవుకూడ కలగంటే నాకెంత సరదాగా ఉండేది. మరచాను, "నిజంగా నాకదే అసహ్యమనిపిస్తుంది" అన్నావు. ఈ మాటకూడ నీకు నాయందు గల ప్రేమకు చిహ్నమే అనుకొన్నాను. మచ్చ ముట్టుకొన్నంత మాత్రాన నాలోని సమస్త దుర్గుణాలు బయటకు వస్తున్నాయా?

చిన్నప్పుడు మా అమ్మ మా అక్కలు ఈ మచ్చను మెచ్చుకొని నన్ను లాలించడంవల్లే నాకీ అలవాటు వచ్చింది. ఇందులో నా నేరం తక్కువే "చాలా ఏళ్ళ క్రితం నేను మచ్చతో ఆడుకొంటూ ఉంటే నీవు తిట్టేదానవనుకొంటాను" అన్నాను మా అమ్మతో,

"ఔను, కాని చాలా ఏళ్ళ క్రితం కాదు."

"ఎందుకు నన్ను తిట్టేదానివి?"

"అది మంచిఅలవాటు కాబట్టి, అంతే".

"నేను మచ్చవేళ్ళతో ఆడుకొంటూ ఉంటే నీకెలా ఉండేది?"

"అంత మంచిపని కాదనిపించేది".

"నిజమే, నన్ను చూచి విచారించే దానవా? లేక ఏవగించుకొని అసహ్యపడే దానవా?"

"దాన్నిగురించి అంత ఆలోచించలేదు. ఎందుకస్తమానం తడుము కోవడం అనుకునే దాన్ని. తడుముకుంటూ ఉంటే నీ ముఖం కూడ మగ తగా ఉండేది.

"నీకు చికాకుగా తోచేదాన్నా?"

"ఆ, కొంచెం చికాకుగానే ఉండేది".

"నన్నుడికించడానికి మీరంతా నా మచ్చమీద పొడిచేవారా?"

"ఔను".

ఇప్పుడర్థమైంది. చిన్నప్పుడు మా అమ్మ మా అక్కలు నాపై చూపిన ప్రేమను జ్ఞాపకము తెచ్చుకోడానికే ఆ పరాకు ముఖంతో నా మచ్చను నేను స్పృశించేదాన్నన్న మాట. ఈ సంగతి నీకు విప్పి చెప్పవలసి ఉంది. మొదటినుంచి నీవు నా మచ్చను గూర్చి అపార్థం చేసుకొన్నావు.

నేను నీతో ఉన్నప్పుడు మరెవ్వరిని గూర్చియైనా ఆలోచింపగలనా? నోటితో చెప్పలేని ప్రేమను యీ అలవాటు ద్వారా తడవ తడవకు వ్యక్త పరచేదాన్నేమో! నీవా అలవాటును మాత్రమే గమనించి అసహ్యించు కొన్నావు.

ఇది చిన్న విషయమే, తప్పులేదనను. నేను చెడ్డదాని ననిపించిన టక్కైన విషయాలన్నీ కూడ ఇలాంటి చిన్న విషయాలే కాకూడదా? అవికూడ మొదట్లో నీయందు నాకు గల ప్రేమను సూచించేవే కాకూ డదా? అర్థము చేసుకోలేక వాటిని కూడ నీవు చెడ్డవిగా భావించి ఉండ రాదా? ఇలా వ్రాస్తే, తప్పు నాది కాదని వాదించే గయ్యాళి భార్య నౌతా నేమో: కాని ఈ సంగతులు నీకు చెప్పకుండా ఎలా ఉండగలను?

---

—అకుటగావా ర్యూనొసూకె

# 6. నరకదృశ్యం

హోరికావా ప్రభువు వంటి వాడుంటాడనుకోను. ఇప్పటి వరకు మాత్రం అలాంటి వారు పుట్టలేదు. పుట్టినప్పటినుండి అసాధారణ వ్యక్తే. అతడు చేసేవొక్కటి సాధారణమైనది కాదు. ఎప్పుడూ జనులులికిపడే పని ఏదో ఒకటి చేస్తూ ఉండేవాడు. అతని దర్జా చూడాలంటే అతడు తలపెట్టే కార్యాలు చూస్తే చాలు. తన గొప్ప చాటాలని మాత్రమే ఆయన ఉద్దేశం కాదు. ఉదారత్వం ఔదార్యం కూడ లేకపోలేదు. పేద వాళ్ళ నేమరేవాడు కాదు. తనతోపాటు దేశమంతా కులాసాగా ఉండాలనే అతని కోరిక.

హిగాషీ సంజో వద్ద నున్న కవారా సౌధాన్ని గూర్చిన ఒక కథ ఉంది. చనిపోయిన వామపక్ష ప్రధాని, తోరు యొక్క దయ్యం ప్రతిరాత్రి ఆ సౌధంలోకి వచ్చేదట. చివరకు ప్రభువే ఆ దయ్యాన్ని భూలనాడి తరిమే వాడట. రాజధానిలో పురుషులు, స్త్రీలు, పిల్లలు అతణ్ణి అవతార పురుషుడుగా చూసేవారు. పుష్పోత్సవం నుంచి వస్తూఉంటే ఆయన రథం యెద్దు బెదిరి, దారేపోయే ఒక ముసలివాణ్ణి తొక్కేసింది. ఆ వృద్ధుడు రెండు చేతులెత్తి ప్రభువువారి యెద్దు త్రొక్కినందుకు కృతజ్ఞుణ్ణి అన్నాడట.

ప్రభువు జీవితంలో ఇలాంటి కథ లింకా చాలా ఉన్నాయి. ఒక విందులో ఒకనికి ముప్పై గుర్రాలు దానం చేసేశారు. నగరా వంతెన కట్టే

అప్పుడు తన కిష్టుడైన ఒక కుర్రవాణ్ణి ఒక స్తంభంలో పాతేయడాని కిచ్చేశాడు. అవన్నీ చెప్పితే దాని కంతుండదు. ఇట్టి గాథలు చాలా ఉన్నా, క్రౌర్యంలో ఏదీ కూడ నరకం సీను తయారుచేయించిన కథకు సాటికాదు. ఆ తెర ఇప్పటికీ వారింట్లో అమూల్యమైన వస్తువులలో నొకటిగా ఉంది. ఆయన సాధారణంగా తొట్రుపడే మనిషి కాదు. కాని ఆ, సీను చిత్రించిన సందర్భంలో నిలువునా నిర్ఘాంత పోయారు. ఇక ఆయన పరివారకులం మా మాట చెప్పాలా? ఆ సమయాన్ని మా జీవాత్మలే ఎగిరిపోతాయను కున్నాం. నే నాయన్ని ఇరవై యేళ్ళు సేవించాను. కాని ఆ భయంకర దృశ్యం చూచినప్పుడంతటి ఘోరం ఎన్నడూ సంభవించి ఉండదను కొన్నాను. ఆ కథంతా చెప్పడానికి ముందు ఆ తెర చిత్రించిన యోషిహిదె గూర్చి కొంచెం చెప్పాలి.

## 2

నేటికీ చాల మందికి యోషిహిదె జ్ఞాపక మున్నాడు. ఆ కాలంలో అతణ్ణి మించిన చిత్రకారుడే లేడు. అతని కప్పటికి యేభై యేళ్ళ వయస్సుంటుంది. చూడ్డానికి బాగుండడు. మనిషి పొట్టి. ఎముకలు కనపడేవి. మరీ ఎర్రని పెదవులతో యేదో చెడ్డ జంతువులా గుండేవాడు. నాకు నమ్మకం లేదు కాని కొందరంటారు, ఎర్రరంగు కుంచె పెదవుల కంటించు కొనే వాడని. కోతిలా గుంటాడని కొందరనేవారు. అతని కొక్కతే కూతురు. పదిహేనేండ్ల యూజుకికి తండ్రి పోలిక లేమీ లేవు. చాలా అందగత్తె. రాణివాసంలో ఉండేది. చాలా చిన్నతనంలోనే తల్లిపోయిన పిల్లపడంవల్ల చిన్న వయస్సులోనే పెద్దవాళ్ల కుండవలసిన నెమ్మది, మెత్తదనం, తెలివితేటలు అబ్బాయి. రాణీగారు ఆమె చెలికత్తెలు యూజుకీ నెక్కువ గారాబంగా చూసేవారు.

తాండా నుంచి ఒక పెంపుడు కోతి వచ్చింది. ప్రభువు కొడుకు పెంచేవాడు. దానికి యోషిహిదే అని పేరు పెట్టాడు. కోతిని చూస్తేనే నవ్వు వచ్చేది. దానికితోడీ పేరు చూసి ప్రాసాదంలో నవ్వనివారు లేరు. అది చెట్లెక్కినా, దాపలు పాడుచేసినా, అదేమి చేసినా సరే యోషిహిదే యోషిహిదే అంటూ చప్పట్లు కొడుతూ దాన్ని గోల పెట్టించేవారు.

ఒకనాడు యూజుకీ పెద్ద హాలులోంచి ఎర్రపూలరెమ్మ చేత్తో పట్టుకొని వెళ్తూ ఉంటే, ఒక జారుడుతలుపు వెనుకనుంచి కోతి పరుగెత్తుకొంటూ వచ్చింది. దాని కాలొకటి బెణికి ఉంటుంది. కుంటుతూ ఉంది. రివ్వున గెంత లేకపోతూ ఉంది. దాని వెనకాలే ప్రభువు కొడుకు చిన్న బెత్తం ఆడించుకొంటూ, "ఆగు దొంగా, బత్తాయి దొంగా" అంటూ వస్తున్నాడు. యూజుకీ తటపటాయిస్తూ ఉంది కాని కోతి ఆమె గౌను పట్టుకొని అతిదీనంగా ఏడవ నారంభించింది. ప్రభు కుమారుని కెదురుగా యూజుకీ వంగి, మధురంగా, "క్షమించాలి. ఇది జంతువు కదా! ప్రభువు దీన్ని క్షమించాలి" అంది. కోపంతో వచ్చాడు. ధుమధుమలాడుతూ రెండు మూడు సార్లు కాలు నేలకు తన్ని, "అది బత్తాయిపండు ఎత్తుకు పోయింది. దాన్నెందుకు సమర్థిస్తావు?" అన్నాడు కుమార ప్రభువు. "ఇది జంతువే కదా" అంది మళ్ళీ యూజుకీ. కాస్సేపుండి దీనంగా నవ్వుతూ "మీరు దీన్ని యోషిహిదే అని పిలుస్తారు కాబట్టి దీన్ని శిక్షిస్తే మా తండ్రిని శిక్షించినట్లే. అది నేను చూడలేను" అంది ధైర్యంగా. ఆ మాటలకు లొంగిపోయాడతడు.

"సరే, మీ తండ్రికి దెబ్బలు పడకుండా అడ్డుకున్నావంటే క్షమిస్తాను, నా కిష్టం లేకపోయినా" అంటూ బెత్తం క్రింద పారేసి జారుడు తలుపుగుండా లోపలికి వెళ్ళిపోయాడు.

# 3

యూజుకీకి కోతికీ నాటి నుంచి స్నేహం. రాజకుమారి తనకిచ్చిన బంగారు గంట యూజుకీ ఎర్రటి త్రాడుతో దాని మెడకు కట్టింది. కోతి ఆమె నొక్క క్షణం వదిలేదుకాదు. ఒకసారి ఆమెకు జలుబుచేసి మంచం దిగకపోతే కోతి దిగాలుపడి, ఆమె తలగడ ప్రక్కనే గోళ్ళు కొరుక్కుంటూ కూర్చుంది. ఎవ్వరూ దాన్నక్కడ నుండి కదలింపలేక పోయారు.

అప్పటి నుండి కోతి నెవ్వరూ అల్లరి చేసేవారు కారు. బుజ్జగింపసాగారు కూడ. ప్రభువు కొడుకు కూడ అప్పుడప్పుడు దానికి పండో కాయో యెగరేస్తూ ఉండేవాడు. ఒకసారి ఒక సామూరీ జాతి సేవకుడు దాన్ని తన్నాడని విని ప్రభు కుమారు డుగ్రుడయ్యాడు. తన కొడుకు కోతి నల్లరి చేయకుండా చూస్తున్నాడని విని పెద్ద ప్రభువు సంతోషించి కోతి నెత్తుకొని యూజుకీని తన వద్దకు రమ్మన్నాడు. ఆ సంవత్సరంలో ఆమె దాన్నెందుకంతగా ప్రేమిస్తూ ఉందో విని ఉంటాడు.

"పితృభక్తిగల చిన్న దానవు, నీకు తగిన బహుమాన మిస్తా" నంటూ, ఉత్సవ సమయాల్లో ధరించే విలువైన యెర్రని గౌను నిచ్చాడు. ఆమె స్వీకరించేటప్పుడు బహుగౌరవంతో నమస్కరించినట్లే కోతి కూడ చేసింది. ప్రభువు సంతోషించాడు. ఆ సంతోషం ఆమెయందు పొందిన అనురాగంవల్ల అని కొంద రపోహ పడ్డారు. నిజాని కామె పితృభక్తి చూసే, ప్రభు వామెయెడల అనుకూలు డయ్యాడు. ఈ అపోహకు మరి కొన్ని కారణాలుండవచ్చు. దాన్ని గూర్చి తరువాత ముచ్చటిస్తా. ఎంత అందగత్తెయైనా కళాకారుని కూతుర్ని ప్రేమించే తరహా వాడుకాడు హోరికావా ప్రభువు.

ఆ గౌరవం పొంది, యోషిహిడే కూతురు ప్రభువు ఎదుటనుండి తొలగిపోయింది. ఆమె తెలివైంది, మంచిదీ కాబట్టి ఇతర రాణీవాస స్త్రీల కసూయకల్గ లేదు. ఆమెను ఆమె కోతిని ఇంకా మరింత ఆదరంతో చూచేవారు. ప్రభు కుమార్తే, ఆమె ఎప్పుడూ విడిచి ఉండే వారు కారు. ప్రభు కుమారి యొక్క విహార రథంలో యూజాకి తప్పక ఉండవలసిందే.

కాస్సేపు కూతుర్ని వదలి తండ్రి సంగతి చూద్దాం. కోతి నందరూ మెచ్చుకొన మొదలు పెట్టినా, యోషిహిడేని మాత్ర మందరూ అసహ్యించు కొంటూనే ఉన్నారు. రాజ ప్రాసాదంలో ఉన్న వారు మాత్రమే అస హ్యించుకోడం కాదు. మోకొగావా మతగురువుకీ అసహ్యమే. అతని పేరు వింటే దయ్యాన్ని చూచినట్లుండేది మతగురువుకి. మతగురువుగారి హాస్యచిత్రం యోషిహిడే వేశాడని అయన గృహసేవకు లనేవారు. ఇది నిజం కాకపోవచ్చు. ఏది ఏమైనా యోషిహిడే అంటే ప్రతి వారికీ అస హ్యమే. ఎవరన్నా అతణ్ణి తిట్టని వాళ్ళున్నారంటే, ఒక రిద్దరు చిత్రకారు లైనా మై యుండాలి, లేక అతని బొమ్మన్నా కాని అతణ్ణెరుగని వారైనా అయి ఉండాలి. చూడ్డానికి వికారంగా ఉండటమే కాక అతని పద్ధతులు కూడ అసహ్యంగా ఉండేవి. అసహ్యించుకొన్నారంటే అతందే తప్పు. ఇతరులిది కాదు.

# 4

యోషిహిడేకి సిగ్గులేదు. సోమరి, కోపధారి, పిసినిగొట్టు, అత్యా శాపరుడు, అన్నిటి కంటే పొగరుమోతు, ఇతరులంటే తృణీకారం, తానే దేశానికంతకూ మహా గొప్ప చిత్రకారుణ్ణని ధీమా. తన కళగూర్చి తాను గర్విస్తే తప్పులేదు కాని ప్రతిదాన్నీ తృణీకరించి మాట్లాడేవాడు. సంఘంలో ఆచార వ్యవహారాలు కూడ వేళాకోళం చేసేవాడు. అతని

శీలంలోనే ఉందా దోషం, సౌందర్య దేవతను చిత్రింపబోయి మామూలు భోగం దాన్ని గీస్తాడు. సాహసదేవతను చిత్రింపబోయి, జైలులోపడి వచ్చిన దుర్మార్గుణ్ణి వేస్తాడు. అతడు ఎంచుకొనే నమోనాలు ఎవరినైనా చకితుల్ని చేస్తాయి. అలాంటి నమోనాలు తీసుకొన్నందు కతన్ని శిక్షిస్తే, "నేను చిత్రించిన దేవతలు, బుద్ధ దేవుళ్ళు నన్ను శిక్షించరు" అంటాడు.

అతనివద్ద కళ నభ్యసించేవాళ్ళు తమ గురువుకి చివరకే దుస్థితి పట్టుతుందో అని చింతించేవారు. చాలామంది అతని వద్ద నేర్చుకోడం మానేశారు, జపానులోకెల్లా తానే గొప్పవాణ్ణని అతని గర్వం. అపురూప కళాకారుడే అయినా తన స్థితికిమించి ప్రవర్తించేవాడు, కిట్టని కళాకారు లితనిది వట్టి డాబుసరి అని, చిత్రకళలో అతనివి వెర్రిపోకడలని ప్రచారం చేసేవారు. పూర్వపు చిత్రకారుల్ని ఎత్తేసేవారు. పూర్వం వారి చిత్రాల్లో వెన్నెల రాత్రిని వికసించిన ప్లమ్ పువ్వులు చిత్రించేరంటే వాటి వాసన ముక్కులకు కొట్టేది. రాజోద్యోగి వేణువూదు తున్నట్లు గీశారంటే ఆ స్వరం చెవులకు వినబడుతున్నది అనేవారు. పూర్వుల చిత్రాలు అమిత సౌందర్యానికి పేరుపొందితే, యోషిహిడి బొమ్మలెప్పుడూ వికృతంగా వికారంగా ఉంటాయి. ర్యూగై దేవాలయం గుమ్మంమీద "జీవిత మరణ పంచముఖము"లని చిత్రించాడు. రాత్రిపూట అటువెళ్ళితే అతడు చిత్రించిన దేవతల మూల్గులు నిట్టూర్పులు వినబడలాయి. కుళ్ళిన శవాల వాసన కొట్టుతుందని కూడా అనేవారు కొందరు. ప్రభువు ఆజ్ఞప్రకారం వారి కుటుంబ స్త్రీల చిత్రాలు యోషిహిడి గీస్తే మూడేండ్లు తిరగకుండా వాళ్ళంతా రోగాలువచ్చి చచ్చిపోయారు. ఇది ఆధారంచేసుకొని అతని విరోధులతని కళకు చేతబడికి సంబంధం ఉందని పుకారు లేవదీశారు,

ఈ చెడ్డపేరు విని యోషిహిడీకి సరదాయే కాని దిగులులేదు. నీకు వికారరూపాలే ఇష్టంలాగుంది అని ప్రభువొకసారి అన్నాడు. అతని ఎర్ర

పెదవులు దుష్టహాసంచేస్తూ వంకర్లు తిరిగాయి. "రంగులు పులమడం మాత్రం వచ్చిన వాళ్ళకు వికృతవస్తువులలోని సౌందర్యం" తెలియదంటూ ఏవగించుకొంటూ పలికారు.

దేవుడూ దెయ్యంలేని యోషిహిదే హృదయంలో ఒకే ఒక కోమల కోణం ఉంది.

## 5

అతని కొక్కతే కుమార్తె. ఆమె నమితంగా ప్రేమిస్తాడు. యోషికి శాంత స్వభావం తండ్రిని గాఢంగా ప్రేమిస్తుంది. ఆమె పితృ భక్తి కతని పుత్రికావాత్సల్యము తీసిపోదు. దేవాలయానికి, దేవుడికి ఒక్క చిల్లిగవ్వకూడ ఇవ్వనివాడు కుమార్తె గౌనులకు, తలపిన్నులకు లెక్క లేకుండా ఖర్చుపెడతాడంటే నమ్మడం కష్టమేకదా! ఆవేశంవంటి ప్రేమ అతనిది. కూతురికి తగిన వరుణ్ణి చూడాలన్నమాటే అతనికి లేదు. ఆమె నెవరన్నా దుష్టత్వంతో వశం చేసుకోవాలని చూశాడా, అట్టివారిని హత మార్చడానికి హంతకులనైనా నియమిస్తాడు, హోరికావా రాణివాసంలో ఆమెను తీసుకోడమతని కిష్టములేదు. ప్రభువెదుటకూడ నసిగాడేకాని మనస్ఫూర్తిగా ఇష్టంచూపలేదు. ఇది చూచి కల్పించారు కొందరు ప్రభువు యోషికితో తండ్రి కిష్టము లేకపోయినా భోగములనుభవించాడని.

రాణివాసంనుంచి తన కూతురు వచ్చేయాలనే అతని వాంఛ. జ్ఞాన దేవత మంజూను చిత్రించమని ప్రభువాజ్ఞాపింప యోషిహిదే ప్రభువు కిష్టుడైన అనుచరుణ్ణే నమూనాగా తీసికొని చాలా చక్కగా చిత్రించాడు. దానికెంతో సంతోషించి, నీకేం కావాలి బహుమానంగా అడుగు, ఏదైనా సరే ఇచ్చేస్తానన్నారు ప్రభువు, ఆ ప్రశంసనందుకొని యోషిహిదే సాహసంగా తన కూతుర్ని ప్రభువుసేవనుంచి తప్పించమని కోరాడు. ఎవరైనా

తన కూతుర్ని రాణివాసంలోకి తీసుకోమని అడగడానికే సాహసించలేరు, అలాంటిది యోషిహిడే తప్ప మరెవ్వరు తన కూతురి విడుదల కోరగలరు. ఎంత ప్రేమించినా అలాగ అడగడం సాహసమే. అంతవరకు కులాసాగా ఉన్న ప్రభువుకు కోపంవచ్చి చాలాసేపు మౌనంగా యోషిహిడే ముఖము పైపే పరీక్షగా చూచాడు.

"వీలులేదు" అని ఉమ్మివేసి లేచిపోయాడు ప్రభువు, ఇలాగే మరోనాలుగైదుసార్లు జరిగింది. ఒకసారి కొకసారి ప్రభువుకు యోషిహిడె మీద కోపం హెచ్చింది. అది తెలిసే కాబోలు యూజుకీ తన తండ్రి క్షేమం శంకిస్తూ గదిలో ఏకాంతంగా నోట్లో గుడ్డలు కుక్కుకొని యేడ్చేది. ఆమెను విడిచిపెట్టనందువల్లే ప్రభువు యూజుకీని ప్రేమిస్తున్నాడన్న వదంతి మరింత విరివిగా వ్యాపించింది. ప్రభువు కోరిక యూజుకీ తీర్చనందువల్లే నరకం సీను వ్రాయిస్తున్నాడన్న వదంతి కూడా ఉంది. కాని అది నిజమై యుండదు.

ప్రభువామెను విడవడానికి కారణం ఆమెమీద ప్రభువుకుగల జాలే. కఠినుడైన తండ్రికి కప్పగించే బదులు యే ఇబ్బందీలేని తన ప్రాసాదం లోనే ఉంచదలచాడు. కేవలం దయవల్లే అట్లు చేశాడు. ఆమె ప్రభువు ఆదరంపొందిందనడములో సందేహంలేదు. కాని ఆమె అతని ఉంపుడుకత్తె అనడం మాత్రం అసత్యం. నిరాధారం, అదెట్లా ఉన్నా, కూతుర్ని కోరడంవల్ల యోషిహిడె ప్రభువు కనిష్టుడయ్యాడు. ప్రభువు వొకసారి హఠాత్తుగా అతణ్ణి పిలిపించి, కారణమేమైతేయేం నరక రంగాలు చిత్రించమన్నాడు.

# 6

నరకం తెర అనగానే యోషిహిడే వ్రాసిన యథార్థ నరక చిత్రాలు నాముందు ప్రత్యక్షమౌతున్నాయి. ఇతరులు కూడ నరక చిత్రాలు వ్రాసి

ఉన్నారు కాని యోషిహిడి ఎత్తుగడే వేరు. మొదటి భాగంలో ఒక మూల నరకంలోని పదిమంది యముళ్ళను వారి కుటుంబాల్ని చిన్న సైజున చిత్రించి తక్కిన దానిలో మండిపోడానికి సిద్ధంగా ఉన్న కత్తుల అరణ్యం మధ్య నొక భయంకర అగ్నిగుండం చూపాడు. నరకోద్యోగుల దుస్తుల పసుపు ఊదా రంగులు తప్ప తక్కినదంతా మంటలు, వాటిమధ్య కారు నలుపు పొగ, వాంట్లో అగ్నికణాలు తాండవిస్తున్నాయి.

ఈ చిత్రంలో కుంచె పనితనమే చాలు ఆశ్చర్యంగొల్పడానికి. కాని పగటీదుచుకొనే మంటల్లో పాపాత్ములు దొర్లిదొర్లి పడుతున్న దృశ్యం మరి యే సామాన్య నరక చిత్రంలోను ఎవరూ చిత్రించలేదు. ఆ మంటల్లో మహారాజులు దగ్గర్నించి బిచ్చగాళ్ళదాకా అన్ని హోదాలవారు చిత్రింప బడ్డారు. రాజలాంఛన వస్త్రాలుధరించిన రాజోద్యోగులు, దర్బారు దుస్తులు ధరించిన మురిపెములొలుకు ముద్దరాండ్రు, రుద్రాక్షలు త్రిప్పుతూ మంత్రాలు చదివే పూజారులు, ఎత్తైన పాదుకలు ధరించిన పండితులు, తెల్లలంగాల చిన్నపిల్లలు, జ్యోతిష్కులు ఇంకా రకరకాలవారు అందులో ఉన్నారు. వాళ్ళ కళ్ళల్లో పొగలు క్రమ్ముతున్నాయి. ఎద్దు తలల, గుఱ్ఱపు తలల జైలు ఉద్యోగులు పోట్లు పొడుస్తున్నారు. తుపాను కెగిరిపోయే ఎండుటాకుల్లాగ అన్ని వైపులకు చెదరగొట్టబడి పర్వెత్తుతున్నారు. మంత్రగత్తెల తల వెండ్రుకలు పట్కారుల్తో పట్టుకొని వారి అవయ వాలు దిగించి కట్టేస్తున్నారు. ఈటెలు నాటిన రొమ్ములతో యువరాజులు గబ్బిలాల్లాగ వ్రేలాడుతున్నారు. వాళ్ళని ఇనుప కంచెలతోకొట్టి పెద్ద రాళ్ళతో చిదకకొట్టున్నారు. వాళ్ళని దయ్యపు పక్షులు పీకుతున్నాయి. రెక్కల విషసర్పాలు మ్రింగుతున్నాయి. ఎంతమంది పాపుల్ని, ఎన్ని రకాల హింసల్ని చిత్రించాడో చెప్పలేము.

దీనిలో ఒక మరీ భయంకరమైన దృశ్యం పేర్కొనవలసిఉంది. కత్తులచెట్ల శిఖరాలు జంతువుల కోరల్లాగ వాడిగా ఉన్నాయి. వానిపై

నుండి ఒక ఎద్దుల రథం క్రిందికి పడిపోతూఉంది. నరకం గాలి దెబ్బకు రథం తలుపులు తిపీమని తెరుచుకొన్నాయి. దాంట్లో మిలమిలలాడే దుస్తులు ధరించిన చక్రవర్తి ప్రియురాలుంది. ఆమె పొడుగాటి పెంప్రుకలు మంటల్లో టపటపకొట్టుకుంటున్నాయి. మహావేదనతో ఆమె తెల్లటి మెడ అటుయిటూ కొట్టుకొంటూ ఉంది. మండుతూఉన్న ఆ కూలిపోయే రథం లోని స్త్రీ ఆర్తనాదంవల్ల నరకంలోని అన్ని హింసలు ప్రత్యక్షంగా చూచి నట్లయింది. ఆ చిత్రంలోని భయంకరత్వమంతా యీ ఒక్క దృశ్యంలో కేంద్రీకృతమైంది. ఈ ఆవేశపూరితకల్పన చూచేవారి కామె భయంకర ఆర్తారావం చెవులలో వినబడుతున్నట్లు తోస్తుంది.

ముందుగా చెప్పేస్తున్నానేమో నరకం తెర కథ, ఇది కథ చివరి భాగం ముందే చెప్పేశాను. నరక చిత్రం గీయమని ప్రభువాజ్ఞాపించిన యోషిహిదే దగ్గరకు వద్దాం.

# 7

ఐదారు నెలల నుంచి యోషిహిదా తెర చిత్రిస్తూ ఉండటంవల్ల ఒక్కసారి కూడ ప్రభు ప్రాసాదానికి పోలేదు. తన పనిలో నిమగ్నుడై తన కంత ప్రియమైన కూతుర్ని చూడ్డానికి కూడా వెళ్ళలేదంటే మెచ్చుకో తగ్గది కాదా ? అతనివద్ద అభ్యసించే శిష్యుడు చెప్పాడు, పనిలో యోషి హిదీ దిగాడు అంటే మంత్రబద్ధుడైనట్లే. చేతబడి నేర్చుకొన్నాడని, అదృష్టదేవత అతనికి సాయపడుతుందని అందుకే అంత పేరు వచ్చిందని వదంతులున్నాయి కదా ! దానికి నిదర్శనంగా అతడు పని చేసేటప్పు డతనికి తెలియకుండా మనం లోపలికి చూస్తే అతనిచుట్టూ దయ్యాపు నక్కలు గుమిగూడి కనబడతాయి. కుంచె చేత బట్టాడంటే, పని ముగిసే వరకు ప్రపంచమే మరచిపోతాడు. రాత్రింబవళ్ళూ ఒకగదిలో

లోపల గడియలు వేసుకొని ఉండిపోయే వాడు. వెలుపలిలో కనుసు పెట్టేవాడే కాదు. నరకచిత్రం రాసే రోజుల్లో అతని ఏకాగ్రత మరీ తీక్షంగా, పరిపూర్ణంగా ఉండేది.

పగలు తలుపులు బిగించి లోపల ఒక చిన్న దీపకాంతిలో రంగులు కలిపేవాడు. అభ్యాసకులకు అనేక రకాల దుస్తులు వేసి జాగ్రత్తగా చిత్రించే వాడు. ఒక్క నరక చిత్రానికే గాదు ఏది వేసినా అలాగే చేసేవాడు. "జీవన్మరణ పంచ ముఖములు" బొమ్మ చిత్రించే టప్పుడు కూడ ఒకనాడు రోడ్డు ప్రక్క ర్యాగాజీ పట్టణంలో ఒక శవాన్ని చూశాడు. దాన్ని చూచి ఎవ్వడైనా ముఖం త్రిప్పుకుంటాడు. కాని యోషిహిడీ జనంలోంచి ఒక్కడూ వచ్చి శవం ప్రక్కన కూర్చుంటె సగం కుళ్ళిన దాని ముఖం, అవయవాలు, ఎలాగున్నవలాగ వ్రాసు కొన్నాడు.

అతని తీక్షణ ఏకాగ్రత వర్ణించడం కష్టం. మీరు గ్రహించడం కూడ కష్టం. సూక్ష్మవివరాలు చెప్పలేనుగాని స్థూలంగా చెప్పుతాను. అభ్యాసకుడు ఒక రోజున రంగులు కలుపుతున్నాడు. హఠాత్తుగా యోషి హిడి వచ్చి, "కాస్త నిద్రపోతాను. కాని ఈ మధ్య పీడకలలు నన్ను బాధిస్తున్నాయి" అన్నాడు. అదేమంత పెద్ద విషయం కాదు కాబట్టి "అలాగా" అని అభ్యాసకుడు శాంతంగా క్లుప్తంగా అంటూ తన పని నుండి తలయెత్తి చూడలేదు. "నేను నిద్ర పోయేటప్పుడు నీవు నా తల ప్రక్క కూర్చో" అన్నాడు దిగులుతో చిత్రకారుడు. కలల కంత భయ పడడం చిత్రంగా ఉందనుకొని "సరే" అన్నాడు అభ్యాసకుడు. "తక్షణం రా. నేను నిద్ర పోయేటప్పు డింకెవర్ని లోనికి రానీయకు" అన్నాడు. లోనికి అంటే చిత్రం వ్రాస్తూ ఉన్న శాలలోకి. ఆ శాల గడియలు రాత్రి ళ్ళలాగే పగలు కూడ బిగించే ఉంటాయి. ఒక దీపం మాత్రం ఎప్పుడూ

వెలుగుతూ ఉంటుంది. ముందుగా చిత్రం యొక్క చిత్తుప్రతి పెన్సిలుతో వ్రాయబడింది. పూర్తిగా అలసిపోయిన వానివలె యోషిహిడీ ప్రక్క మీద పడుకున్నాడు. ఒక గంటలోపుగానే అభ్యాసకునికి చాలా వికారమైన కంఠ ధ్వని గురువు ముఖం నుంచి వినబడ సాగింది.

# 8

ఆ ధ్వనిలో మాటలు దొర్లుతున్నాయి. నీళ్ళల్లో మునిగిపోయేవాడి కంఠధ్వనిలా గుంది. "ఏమిటీ, నన్ను పిలుస్తున్నావా ? ఎక్కడికి ? ఎక్కడికీ ?— నరకానికా ? మంట లెగసే నరకానికా ? ఎవరది ? ఎవ రండీ మీరు? ఎవరో తెలిస్తే—" అభ్యాసకుని చెయ్యి రంగులు కలపడం మానేసింది. గురువుగారి రహస్యాలు తాను వినవచ్చా అనే సందేహంతో గురువు ముఖం చూచాడు. ముడతలు పడ్డ ముఖం వెలవెల బోతూంది. పెద్దపెద్ద చెమట బిందువులు ముఖం మీద క్రమ్మాయి. పెదవు లెండిపో యాయి. పళ్ళూడిన నోరు గాలి కోసమా అన్నట్లు విప్పుకొంది. సన్నని దారం మీద నడుస్తున్న వానిలాగ మెదులుతూఉంది అతని నాలుక.

"ఎవరో తెలుస్తే— ఆ, మీరా ? మీరే అనుకొన్నా ! ఏమిటీ ? నన్ను కలుసుకోడానికి వచ్చారా ? నేను రావాలా ? నరకానికా ? నర కంలో నా కూతురు నా కోసం ఎదురు చూస్తూఉందా ?"

ఆక్షణాన్ని చిత్రంగా ఒక అదృష్టమైన నీడ తెరమీదికి వాలింది. అదేమో అర్థంకాక భయంతో అభ్యాసకుడు గురువుగారిని లేపడానికి బలం కొద్దీ గుంజాడు. కాని యోషిహిడీ ఇంకా పీడకల పిడికిటిలోనే ఉన్నాడు. అలా పలకరిస్తూనేఉన్నాడు. దాంట్లోంచి ఇవతల బడలేకున్నాడు. శిష్యుడు సాహసం చేసి రంగులు కలపడానికున్న నీళ్ళతని ముఖాన్ని జల్లాడు.

"అదిగో వేచిఉంది, ఎక్కు బండి. ఎక్కు నరకానికి పద." ఈ మాటలంటూ ఉన్నప్పుడు యోషిహికీ కంఠం మారింది. పీక పిసికేస్తూ ఉంటే వచ్చేధ్వని బాగుంది. చివరికి కళ్ళు తెరిచాడు. సూదుల పెట్టె పొడిస్తే లేచినట్లు లేచి ఒక గెంతు వేశాడు భయంతో. ఆ పీడకల ఇంకా అంటిపెట్టే ఉంది అతణ్ణి. అతని ఆకారం భయంకరంగా ఉంది. నోరావలించి బయట చూస్తున్నాడు. కొంత తమాయించుకొని, "ఆ ఇప్పుడు నద్దుకొండి, నీవు వెళ్ళు" అని శిష్యునితో చటుక్కున అన్నాడు. తక్షణం పోకపోతే తిడతాడని అభ్యాసకుడు లేచిపోయి బయట పడ్డాక దుస్స్వప్నం లోంచి బయట పడ్డవాడిలాగ అయ్యాడు.

ఇంతటితో అయిందా ? నెల్లాళ్ళ తరువాత ఇంకో అభ్యాసకుణ్ణి వెనక గదిలోకి రమ్మన్నాడు, నూనెదీపం గుడ్డి వెలుతురులో యోషిహిడీ అలవాటు ప్రకారం కుంచె కొడుతూ హఠాత్తుగా అతణ్ణి, "బట్టలు విప్పేయి" అన్నాడు. ఇదివరలో అనేక సార్లు అట్లు చేయించే ఉన్నాడు కాబట్టి అభ్యాసకుడు లక్షణం అట్లా చేశాడు. యోషిహికీ ముఖం ముడుచుకొని ఉంది. "గొలుసులు కట్టిన మనిషిని చూడాలి. కాస్సేపు నేను చెప్పినట్లు చెయ్యి" అని నిర్దయగా అన్నాడు. అభ్యాసకుడు మంచి వస్తాదు. కుంచె పట్టుకోడం కంటే కత్తులతో సాము చేయడం మేలనుకొనే రకం. ఈ విచిత్రమైన కోరిక విని గురువుగారికి మతి చెడిందా, తన్ను చంప దలచుకోలేదు కదా అని సంశయించాడు. యోషిహిడీ అంతలోనే, ఆలస్యం కోర్వలేక, ఏ మూలనుండో ఒక ఇనపగొలుసు తెచ్చి అభ్యాసకుని వీపు మీదకెక్కి అతని చేతులు విరిచి కట్టి గొలుసు దేహానికంతకు చుట్లుచుట్లుగా బిగించాడు. ఒక వైపు గొలుసు చివర పట్టుకొని లాగేటప్పుటికి శిష్యుడు దొర్లుతూ దుర్భర వేదనపొందాడు.

# 9

దొర్లించిన సారాపీపా లాగున్నాడు శిష్యుడు. కాళ్ళు చేతులు కట్టేయడం చేత అతడు తల మాత్రం త్రిప్పుతున్నాడు. లావు పాటివాడు, రక్త ప్రసారం ఆగి ఒళ్ళంతా కందగడ్డ లాగయింది. యోషిహిదీకి ఏమ పుట్టినట్లయినా లేదు. చుట్టూ తిరుగుతూ "సారాపీపా" అంటూ శిష్యుని బొమ్మ (స్కెచ్) గీస్తూ ఉన్నాడు.

ఈ హింసాకాండ ఇంకా సాగిఉండేది కాని ఇంతలో పీపా వెనక నుండి ఏదో నల్లని నూని కాలవలాగ నెమ్మదిగా జారుతూ, తరువాత మరీ నెమ్మదిగా ప్రాకుతూ, చివరికి తళతళ లాడుతూ అభ్యాసకుని ముక్కు దగ్గరకు వచ్చింది. పాము పాము అని అభ్యాసకుడరచాడు. భయాని కతని రక్తం గడ్డ కట్టుకుపోయింది. ఇంకో నిముషమాగుతే పాము అతని తల మీద కాటువేసి ఉండేది. హృదయంలేని యోషిహిదీ కూడ అలజడి పొందాడు. కుంచె క్రింద పడేసి, మెరుపులాగ ఎగిరివచ్చి, తెలివిగా తోక పట్టుకొని పాము నెత్తాడు. పాము తలెత్తి, వల్లు చుట్టులు చుట్టుకొని అతని చెయ్యి కాటెయ్యాలని చూచింది, కాని వెయ్యలేక పోయింది. నా బొమ్మ పాడుచేశావు అంటూ కోపంతో దాన్నొక పీపాలో పడేసి, ఇష్టం లేకపోయినా శిష్యుని వంటి మీది గొలుసులు విప్పేశాడు. ఇంత కష్టపడిన అభ్యాసకునికి అభివందనాలన్నా దక్కలేదు. బొమ్మ పాడయిందన్న బాధే కాని శిష్యుడు చచ్చినా అతని కక్కరలేదు. నమోనా కోసం ఉంచుకొన్న పామే అది.

ఈ కథ అతని పిచ్చిని, అతని దుష్ట ఏకాగ్రతను తెలుపుతుంది. ఒక శిష్యుని ప్రాణాలే తీసిన మరొక దారుణ సంఘటన చెప్పాలని ఉంది. ఆ శిష్యుడు పదమూడు పద్నాలుగు సంవత్సరాలవాడు. ఆడపిల్లలాగ అందంగా కోమలంగా ఉంటాడు. ఒకరాత్రి ఆకస్మికంగా అతణ్ణి తన గది

లోనికి పిలిచాడు. పిల్లి అంటే ఉన్న ఒక విచిత్రమైన పక్షికి, రక్తం కారుతున్న మాంసం ముక్క తినిపిస్తున్నాడు యోషిహిదే. దానివి పెద్ద గుండ్రని పసుపురంగు కళ్ళు. చెవులు ఈకలలాగ రెండు వైపులా నిక్కబొడుచుకొని ఉన్నాయి. చిత్రంగా పిల్లిలాగ ఉంది.

# 10

తన విషయాల్లో ఎవరూ కలుగ చేసుకోడం యోషిహిదేకి ఇష్టం లేదు. పాములున్నట్టే ఇంకా అతని గదిలో ఏమేమి ఉన్నాయో శిష్యుడికి కూడా తెలియదు. వ్రాస్తూఉన్న బొమ్మ అవసరాలబట్టి వెండిగిన్నెలో, పుర్రెలో, లక్కబొమ్మలో, ఏవే పురాతన వస్తువులో పైకి తీసి బల్లమీద పెట్టేవాడు. ఇవి ఎక్కడవాస్తాడో, ఎవరికీ తెలియదు. ఇలాంటి వాటిని బట్టే అతనికేదో అదృష్ట దేవత అమానుషశక్తి ప్రసాదిస్తూ ఉంటుందన్న వదంతి పుట్టింది.

నరక చిత్రాని కవసరం కాబోలిపక్షి అనుకొని గురువుకు నమస్కరించి ఏమి ఆజ్ఞ అన్నాడు. అది విననట్లు, యోషిహిదే తన రెక్క పక్షి వైపే అడిస్తూ, "చాలా సాధువైన పక్షికదా!" అన్నాడు. పిల్లిలాంటి ఆ చెవుల పక్షిని భయభావంతో చూశాడు శిష్యుడు. అతణ్ణి వెక్కిరిస్తూ యోషిహిదే "ఏం, ఇలాంటి పక్షి నెప్పుడూ చూడలేదా?" రాజధానీ పట్టణాల్లో ఉండే వాళ్ళతో ఇదే చిక్కు. ఇది కొమ్ముల గుడ్లగూబ. రెండు మూడు రోజుల క్రితం ఒక వేటగాడు తెచ్చి నా కిచ్చాడు. ఇంత సాధువైన ఈ జాతి పక్షు లరుదు" అంటూ అది మాసం తినడమైన తరువాత చెయ్యెత్తి దాని వీపుమీద అపసవ్యంగా నిమిరాడు. దాంతో అది కీచుమని గీ పెట్టి, బల్లమీదనించి లేచి, గోళ్ళు విప్పి, శిష్యుని ముఖంమీద పడింది. అతడు భయపడి ముఖానికి చెయ్యడ్డు పెట్టుకున్నాడు. లేకుంటే గీరేసి

ఉండును. భయంతో అరుస్తూ దాన్ని తరమడానికి తన షర్టుతీశాడు. చిన్నవాడు కాబట్టి అతణ్ని లోకువగట్టి అది గీ పెట్టి మళ్ళా ఎదుర్కొంది. గురువున్నట్లే మరచిపోయి ఆ కుర్రవాడు గదిలో అటూ ఇటూ పరుగెత్తాడు. నిలబడి కొట్టబోయాడు, కూర్చుండి తరిమేయ బోయాడు. అతని కళ్ళు పీకేయడాని కా దుష్టపక్షి క్రిందికీ మీదికీ ఎగురుతూ ఉంది. అది రెక్కలు కొట్టుకుంటూ ఉంటే కుళ్ళిన ఆకుల వాసన, జలపాతంయొక్క నీటి తుంపరలు లేచాయి. అది మహాభయంకరంగా ఉంది. భయపడిన కుర్రవాడి కంటి కా గది దుష్టవాయువులతో కప్పబడిన దూరపు కొండల లోని లోయలాగుంది; గదిలోని నూనెదీపం కాంతి చంద్రుని మసక వెన్నెల లాగుంది.

ఆపక్షి దూకుడుకన్నా గురువుగారి స్థితి ఆ కుర్రావాడికి నిస్పృహ భీతావహం కలిగించింది. ఇదంతా శాంతంగా పరీక్షిస్తూ, గురువు కాగితం తీసి, జాగ్రత్తగా ఒక ఆడపిల్లవంటి కుర్రవాణ్ణి ఘోరమైన పక్షి చెండాడుతున్న చిత్రంగీస్తున్నాడు. ఓరకంట కుర్రవాడదిచూచి హడలిపోయాడు. చిత్రంకోసం తన్ను చంపేస్తాడని భావించాడు.

# 11

ఇది నమ్మడానికి వీల్లేదంటారా? పక్షితో కుర్రవాడు కొట్లాడడం బొమ్మగా వ్రాసుకోడానికే ఆ రాత్రి ఆ కుర్రవాణ్ణి పిలిచి యోషిహిడీ అతని మీద ఆ పక్షిని వదిలాడు. అది గ్రహించుకోగానే కుర్రవాడు తల చేతులతో కప్పుకొని, సత్తువకొద్దీ అరుస్తూ తలుపు ప్రక్క నొక మూల పడిపోయాడు. కంగారు పడినట్లు యోషిహిడీ అరుస్తూలేచాడు కాని పక్షి రెక్కల గోల ఎక్కువైంది. ఏమో చీల్చిన ధ్వని, పడగొట్టిన ధ్వని హెచ్చవుతూంది. మూలనుంచి కూలిన కుర్రవాడు భయంతో తలెత్తి

చూశాడు. గదిని చీకటావరించింది. దక్కిన శిష్యుల కోసం యోషిహిడే కేకవేశాడు.

దూరాన్నుంచి ఒక శిష్యుడు పలికాడు. ఒక్క నిముషంలో దీపం తీసుకొని పరుగెత్తుకొని వచ్చాడు. ఆ దీపం మసక కాంతిలో చూస్తే గది లోని దీపపు సెమ్మె బోర్లపడి ఉంది. నూనెతో తడిసిన వాపటిద పక్షి ఒక రెక్క కొట్టుకొంటూ ఉంది. టేబిల్ కావలప్రక్క మోకాళ్ళమీద కూర్చున్న యోషిహిడే విస్మయపాటుతో అర్ధంలేని మాటలేవో తనలో గొణుక్కుంటున్నాడు. నల్లటి త్రాచుపాము యొకటి పక్షియొక్క రెక్కని మెడని చుట్టేస్తూఉంది. బహుశ శిష్యుడు కూర్చున్నప్పుడు సీసా దొర్లిపోయి ఉంటుంది. దాంట్లోంచి పాము బయటికి రాగానే పక్షి దాన్ని ఒడిసిపట్టా లని చూచి ఉంటుంది దాంతో ఆ గోల, ఆ అల్లరి, ఆ దృశ్యం చూచే శిష్యు లిద్దరికీ నోళ్ళు పెకలలేదు. గమ్మున తలవంచుకొని లోపలికి పోయారు. తరువాత పక్షి, పామూ ఏమయ్యాయో ఎవరికీ తెలియదు.

ఇలాంటివే ఇంకా కొన్ని సందర్భాలున్నాయి. బొమ్మవేయడం ఆరంభించింది వర్షాకాలం మొదట్లో. అప్పటినుంచి శీతాకాలాంతం వరకు గురువుగారి పర్యాప్త వాలకం చూచి శిష్యులు ప్రాణాలు గుప్పిట్లో పెట్టు కొని ఉండేవాళ్ళు. శీతాకాలం ఆఖరయ్యే సమయానికి చిత్రం గూర్చిన యేదో పెద్ద సమస్య యోషిహిడేకి వచ్చిపడింది. వెనుకటికంటే కూడ రాక్షసవాలకం ఎక్కువైంది. మాట ఇంకా వాడిగా ఉంది. చిత్రం పది వంతుల్లో ఎనిమిది వంతులు ముగిసింది. కాని ఇంక ముందుకు నడవడం లేదు. తక్కిన ఆవరణ రేఖలు పూరింపబడే సూచన కనబడటంలేదు.

వచ్చిన ఆటంకం ఏమిటో ఎవరికీ తెలియదు. తెలుసుకోవాలని ఎవరూ ప్రయత్నింపనూ లేదు. ఇదివరకు శిష్యులకు కాస్త ఆసక్తి ఉండేది. ఇప్పుడిక పెద్దపులి బోనులోనో తోడేలు బోనులోనో తగులుక్కున్నట్లు భయ పడి ఎంత దూరంగా వీలైతే అంత దూరంగా ఉంటూ ఉన్నారు.

# 12

ఈ మధ్య యోషిహిదీలో కానవస్తున్న విశేషమేమిటంటే అంత ఇసుప మనిషీ ఎవరూ లేనప్పు డేమి కారణమో కాని ఇట్టే కన్నీళ్ళు పెట్టుకొనేవాడు. తరుచుగా ఏడుస్తూ ఉండేవాడు. ఒక నాడొక శిష్యు డేదో పనిమీద తోటలోనికి వెళ్ళాడు. పరధ్యానంగా వరండాలోంచి వసంతాగమ సూచనలు గల ఆకాశం పైపు చూస్తూ కళ్ళనీళ్ళు కార్చాడు. కంగారుపడి శిష్యుడు నెమ్మదిగా వెనక్కి వచ్చేశాడు. నమోనాకోసం కుళ్ళిన శవాన్ని నిదానంగా వ్రాసుకొన్న యోషిహిదీయే యిట్లా యేడవడం చిత్రంగా లేదూ!

మతిగలవాళ్ళ కర్థంకాని పిచ్చి పట్టుదలతో ఇక్కడ తండ్రి చిత్రం వేస్తూఉంటే, అక్కడ యూజుకీ నిరుత్సాహం పొందుతూ పొంగి పొరలి వచ్చే యేడుపు నణచుకొంటూ ఉండేది. ఆ కోమలి కనురెప్పలు దళస రెక్కి నల్లబడ్డాయి. ముఖం దీనంగా ఉండేది. మొదట్లో అది ప్రణయ వేదన అనుకొని తండ్రిని నిందించేవారు. తరువాత హోరికావా ప్రభువా మెను నిర్బంధిస్తున్నాడని తెలిసి దాంతో ఇంకామెనుగూర్చి మాట్లాడుకోటం మానేశారు.

ఆ దినాల్లో నే నొక రాత్రి ప్రాసాదపు వరండాలోంచి వెళ్ళు తున్నాను. హఠాత్తుగా ఎక్కడినించో కోతి వచ్చి నా పంచి పట్టుకులాగ డము మొదలుపెట్టింది. రాత్రి వెచ్చగాఉంది. చంద్రుడు మసగగా వెలుగు తున్నాడు. ప్లమ్ పువ్వులు వాసన వెదజల్లుతున్నాయి. మతిపోయినట్టు కోతి పండ్లు చూపుతూ, ముక్కు విరుస్తూ, కిచకిచ అరుస్తూ ఉంది. నా గుడ్డ పీకుతున్నందుకు కోపంవచ్చి నెమ్మదిగా దాన్ని తన్ని ముందుకు పోవాలనుకున్నాను. దాన్ని తన్నిన సామూరీసేవకునిపై యువరాజు

కాగ్రహం వచ్చిన సంగతి జ్ఞాపకంవచ్చి, కోతి విపరీతచేష్ట కొంచెం పరకాయించి చూచి కొంచెం దూరం అది లాగుతూ ఉన్న వైపుకు వెళ్ళాను.

వరండామలుపు తిరిగే సరికి దేవదారు చెట్టుంది. దాని కావలనున్న చిన్న కుండీలో నీళ్ళు వెన్నెలలో తళతళ లాడుతున్నాయి. దగ్గరలో ఒక గదిలో మనుష్యులు దెబ్బలాడుతూ ఉన్న ధ్వని వినబడుతూఉంది. ఆ నిశ్శబ్దంలో అవొక్కటే ధ్వని. కుండీలో చేప ఎగిరినప్పుడు సన్నని ధ్వని మాత్రమౌతూఉంది. ఆ దెబ్బలాట ధ్వని విని ఆశ్చర్యంతో అలాగేనిలబడి పోయాను. ఎవరో పోకిరివాళ్ళు చేస్తూఉన్న అల్లరి అనుకొని నెమ్మదిగా, ఊపిరి కూడా పీల్చుకుండా అటు వెళ్ళాను వాళ్ళకు నా తడాఖా చూపాలని.

# 13

నేను భయపడి వెనుదీస్తున్నాననుకొంది కోతి. రెండు మూడు సార్లు హడావడిగా నా చుట్టూ తిరుగుతూ, పీక పిసికినట్లు అరుస్తూ, నా భుజాల మీద కెగిరింది. కొరుకుతుందేమోనని తల వెనక్కి బలంగా త్రిప్పాను. ఆ విసురుకు పడిపోకుండా కోతి నా షర్టు పట్టుకు వ్రేలాడింది. నేను రెండుమూడడుగులు వెనక్కి తూలి జారుడు తలుపు మీద బరువుగా పడ్డాను. తలుపు విప్పుకొంది. వెన్నెల పొడలేని లోనిభాగానికి వెళ్ళబోతూ ఉంటే, గదిలోంచి ఒక స్త్రీ పరుగున, మీట నొక్కితే ఇవతల పడ్డట్టు వచ్చి పడింది. నా మీద పడిపోవలసిందే. నన్ను దాటి మోకాళ్ళ మీద పడి ఆయాసంగా ఊపిరి పీల్చుకొంటూ, నన్నుచూసి, ఇంకా ఏదో ఆపదలో ఉన్నట్లే వణికిపోతూ ఉంది.

ఆమె యాజుకీ అని చెప్పాలా? ఆమెను తేరి పారచూశాను. మనిషి చాలా మారిపోయింది. ఆమె పెద్దపెద్ద కళ్ళు మెరుస్తున్నాయి.

బుగ్గలు ఎర్రని అగ్ని జ్వాలలు కురుస్తున్నాయి. ఆమె గౌను జాకెట్టు చెదిరిపోయి ఉన్నా ఆమెకు మామూలుగా లేని ఆకర్షణ నిచ్చాయి. యోషిహిటీ యొక్క లజ్జావతియైన కుమార్తెనా యీమె ? తలుపు కాను కొని నిలిచి ఆమె సుందర విగ్రహం చూస్తున్నాను. ఎవరో భయంతో పారిపోతున్న అడుగుల ధ్వని వినబడి అదేమిటని నా కళ్ళతోనే ఆమె నడిగాను.

పెదవులు కొరుక్కొని తల పంకించిందిగాని యేమీ మాట్లాడలేదు. చాలా సిగ్గుపడిపోయినట్లగపడింది. వంగి ఆమె చెవిలో నెమ్మదిగా ఏమిటిది అని అడిగాను. ఆమె తల త్రిప్పింది. కనురెప్పల మీదికి కన్నీళ్ళు జారుతున్నాయి. ఇంకా గట్టిగా పెదవులు కరుచుకొంది.

నేను మూర్ఖుణ్ణన్నమాట తెలిసినదే ! ఏ సంగతీ పూర్తిగా స్పష్టమైతేకాని గ్రహింపలేను. ఆమెతో ఏమి మాట్లాడాలో తెలియక, ఆమె గుండె మ్రోత వింటూ ఉన్నట్లు ఒక నిముషం నిలబడ్డాను. ఇంక ఎక్కువగా ఆమె నేమీ అడగకూడ దనుకున్నాను.

అలా ఎంత సేపున్నానో తెలియదు. నేను వచ్చిన తలుపు వేసేస్తూ ఈ పాటికి కొంచెం సేదదేరిన యూజుకీని లోనికి వెళ్ళి పొమ్మని చెప్పాను. ఎవ్వరూ దగ్గర లేకపోయినా, నా ఉద్యోగం బట్టి నే నామెను కలత గలిగించి ఉంటాననుకొని నెమ్మదిగా వెళ్ళిపోయాను. పదడుగులు వెళ్ళే సరికి మళ్ళీ ఏదో భయం భయంగా నా పంచి లాగినట్లయింది. ఆశ్చర్యంతో చూచాను, ఎవరనుకున్నారు ? బంగారు గంట ధ్వని చేస్తూ, మనిషిలాగ తిరిగి తిరిగి చేతులు జోడిస్తూ తల వంచింది ఆ కోతే !

# 14

రెండు వారాల తరువాత యోషిహిడే ఒకనాడు ప్రాసాదానికి వచ్చి తక్షణం ప్రభు దర్శనం కావాలన్నాడు. తక్కువ అంతస్తు వాడేమైనా యోషిహిడే ప్రభువు కనుగ్రహ పాత్రుడు. సాధారణంగా ప్రభు దర్శనం దొరకడం కష్టం, కాని ప్రభువు యోషిహిడేని తక్షణం సముఖానికి పిలి పించుకొన్నాడు. ప్రభు ఎదుట సగౌరవంగా సాష్టాంగపడి, తన బొంగురు గొంతుకతో ఇట్లన్నాడు.

"కొన్నాళ్ళ క్రితం నరక చిత్రం వేయమన్నారు. నానా కష్టాలుపడి రాత్రింబవళ్ళు పనిచేశాను. ఆ చిత్రం చాలా వరకు పూర్తి అయింది. చూడవచ్చు."

"నీ కభినందనాలు, సంతోషం" అన్నాడు. కాని ప్రభువు కంఠ ధ్వనిలో అభిరుచి గాని విశ్వాసం గాని తోచలేదు.

"అభినందనల కింకా సమయం కాదు, చిత్రం పూర్తి కావచ్చిందే కాని ఒక్క భాగం దానిలో ఇపుడు చిత్రింపలేకున్నాను" అని కొంచెం విసుగుతో నేలను చూస్తూ అన్నాడు యోషిహిడే.

"ఏమిటీ, ఒక భాగం చిత్రింప లేవూ ?"

"లేనండి. నమూనా లేందే చిత్రింపలేను. లేకుండా చిత్రించినా దాంట్లో యాథార్థ్యం స్ఫురింపదు. దాని అర్థం చిత్రింపలేనన్న మాటేగదా!"

ప్రభువు ముఖం పరిహాస ముద్ర దాల్చింది. "ఐతే నరకం చిత్రించ దానికి నీవు నరకం చూడాలంటావా ?"

"ఔను. కొన్నాళ్ళ క్రితం గొప్ప అగ్ని ప్రమాదం చూశాను. ఆ మంటలు నరకపు అగ్నిజ్వాలలా లాగున్నాయి. అప్పుడు చూచిన మంటలే నా చిత్రంలో వేసినవి. ఆ చిత్రం యేలిన వారికి జ్ఞాపకముందనుకుంటాను".

"ఐతే నేరస్థుల మాటేమిటి? జైలు ఉద్యోగుల్ని చూడలేదను కుంటాను. చూచావా?" అని ప్రభువు యోషిహిడీ మాటలు సరిగా విని పించుకోకుండానే వెంటనే అన్నాడు.

"ఇనపగొలుసులతో బంధింపబడ్డ వారిని చూచాను. ఘోర పక్షుల పాలబడ్డ వారిని చూచాను. శిక్ష ననుభవించే నేరస్థుల గోడు నేను చూడ నిది కాదు. జైలుద్యోగుల్నా? అనేకసార్లు కలలో కట్టెదుటే చూచాను. ఆవు తలలతో, గుఱ్ఱపు తలలతో, మూడేసి ముఖాలతో, ఆరేసి చేతులతో రాక్షసుల్లా గుండేవారు. వారి చేతులతో చప్పట్లు చరిస్తే ధ్వని కాదు. వారు నోరు విప్పి అరుస్తే ధ్వని పుట్టదు. నన్ను హింసించడానికి వారంతా వచ్చేవారు. వారిని ప్రతిపగలు ప్రతిరాత్రి చూస్తునే ఉన్నానంటే ఇందులో యేమీ ఉత్ప్రేక్ష లేదు. ఇప్పుడు నేను చిత్రింపదలచినది చిత్రింప లేనిది ఇంకా కష్టమైంది.

ప్రభువుకు చాలా ఆశ్చర్యంవేసింది. కోపంతో అతనివైపు చాలా సేపు చూచాడు. కనుబొమ్మలు ముడిచి, కఠినంగా "నీవు చిత్రింపలేని దేమిటి?" అన్నాడు.

# 15

నరక చిత్రానికి మధ్యగా ఆకాశంలోంచి దొర్లి పడిపోతున్న ఒక రథం చిత్రించదలచాను. అంటూ కోర చూపున ప్రభువుని చూచాడు. చిత్రాల గూర్చి మాట్లాడేటప్పుడు యోషిహిడీ పిచ్చివాడిలాగ ఐపోతాడు. ఇప్పుడు సరిగా పిచ్చివాడులాగే ఉన్నాడు. "రథంలో ఒక చక్కని రాజాంతఃపుర స్త్రీ ఉంటుంది. విజృంభించుచున్న మంటల్లో, విరబోసిన వెంట్రుకలతో, ఆమె గోలపెడుతూ చుట్టలు చుట్టుకుపోతూ ఉంటుంది. పొగల్లో ముఖం వంకర్లు పోతుంది. తన కనుబొమ్మ లెత్తి రథం టాపు

చూస్తూ ఉంటే వర్షంలాగ పడుతూఉన్న అగ్నికణాల నడగించడానికి రథం వెదురు తలుపుల మూసేయబోతుంది. కీచుమంటూ అరుస్తూ అనేక పక్షులు బంపెచుట్టూ తిరుగుతుంటాయి, బండిలో నున్న ఆ సుందరి—ఆమెను చిత్రించలేకున్నాను.

"సరే, ఇంకా యేమిటి ?" యోషిహిడీ నింకా మాట్లాడించడ మెందుకో ప్రభువుకు సరదాగా ఉంది. చిత్రకారుని ఎర్రని పెదవులు దడదడ లాడుతున్నాయి. మాట్లాడుతూనే కలగంటూ ఉన్న మనిషిలా గున్నాడు." చిత్రించలేను. ఒక రథం కాల్పించండి. అలాగైతేనే—" అని మొరిగినట్లు పలికాడు.

ప్రభువు ముఖం నల్లబడింది. కాని వెంటనే పెద్దపెట్టున నవ్వాడు. "నీ కోరిక ప్రకారం అక్షరాలా అట్లాగే చేయిస్తా" అంటూ నవ్వితే ప్రభువుకు ఆయాసం వచ్చి ఉక్కిరి బిక్కిరై పోయాడు. "రథం కాల్పించడం సాధ్యమా అసాధ్యమా అన్నది మన మిప్పుడు తర్కించ నక్కరలేదు" అన్నాడు ప్రభువు.

ఈ మాటలు వింటుంటే నా ఒళ్ళు భయంతో కంపించింది. అది రాబోయే ఉపద్రవానికి సూచనేమో ! యోషిహిడీయొక్క పిచ్చి తనకు కూడ పట్టినట్లు కనబడుతున్నాడు ప్రభువు. అతని పెదవులమీద నురగ కనబడుతూవుంది. అతని కనుకొనలలో ఛీత్కారం మెరుపులాగ మెరిసింది. కంఠంలోంచి పెద్ద నవ్వు విరగబడి పొంగింది. "ఆ, నీ కోసం ఒక రథం తగులపెట్టిస్తా. ఆ రథంలో అమూల్య వస్త్రాలు ధరించిన అపురూప సుందరి ఉంటుంది. ఆమె మంటలు కక్కే పొగల్లో దారుణ యాతనతో చస్తుంది. ఇట్టిది చిత్రింపవలచినవాడు జపానులోకెల్లా మేటి చిత్రాకారుడై యుండాలి కదా ! అతణ్ణి నేను మెచ్చుకుంటా, మెచ్చుకుంటా" అన్నాడు. ఇట్లు ఉద్రేకంతో పలికిన ప్రభువు మాటలు విని యోషిహిడీ

వివశుడయ్యాడు. ఊపిరి తీయడాని కాయాసపడుతున్నట్లు పెదవులు కదు లుస్తున్నాడు. అంతలో అతని దేహం కాస్త విశ్రాంతి పొందింది. తన రెండు చేతులూ చాపకానిస్తూ వంగి నమస్కారం చేశాడు. "విధికి నా యందెంత దయ!" అని ఇతరులకు వినబడనంత నెమ్మదిగా అను కొన్నాడు. తన కోరిక ఎంత భీకరమైనదో బహుశా ప్రభువుమాటల్లో అతని కనగాహన అయిందేమో! ఆ ఒక్క సందర్భంలోనే నాకు యోషి హిడీని చూచి జాలిపుట్టింది.

# 16

రెండు మూడు రోజుల్లో తాను చెప్పింది చేయడానికి సిద్ధంగా ఉన్నానని ప్రభువు యోషిహిదీకి చెప్పాడు. రథాన్ని హోరికావాలో కాల్చ దలచలేదు. రాజధాని కావల యూకిజీ అనే గ్రామంలో వారికున్న మకా ములో కాల్చదలచారు. పూర్వం ప్రభువు చెల్లెలు ఇక్కడే ఉండేది. చాలా కాలంనుంచీ అచట ఎవ్వరూ లేరు. పెద్దతోట ఉంది. కాని చూచేవాళ్ళె వరూలేరు. దీనికనేక కారణాలు చెప్పుతారు. చనిపోయిన చెల్లెలు చీకటి రాత్రుళ్ళు ఎర్రని చొక్కా తొడుక్కొని నేల తాకకుండా వరండాలలో తిరుగుతుందని చెప్పుతారు. పగటిపూటే ఆ మకాం బిక్కుబిక్కుమంటూ ఉంటుంది. ఇక రాత్రిళ్ళు చెప్పనక్కరలేదు. కనబడని సెలయేరు ప్రవా హపు హోరు, నక్షత్రాల వెలుతురులో నారాయణ పక్షులు భయంకరాకా రాలతో ఎగురుతూ ఉంటే మహాఘోరంగా ఉంటుంది.

ఆవాళ కారుచీకటి. గడ్డి వెంటెలతో వరాండాలో ఎత్తైన ఆసనం ఏర్పరచి తెల్లసిల్కుగుడ్డ కప్పారు. దాని మీద ప్రభువు ఆసీనుడయ్యాడు. లేత పసుపురంగు అంగీ తురాయిలు చెక్కిన ముదర ఎర్రరంగు పంచె కట్టాడు. వెనకా ముందూ, కుడి ఎడమ ప్రక్కలా, ఐదారుగురు ఘటి

దుబులాంటి రక్షకభటులు భయస్తులతో నిలబడి ఉన్నారు. అందులో ఒకడు మిడునోకా యుద్ధంలో ఆకలికి మనుష్యమాంసం తిన్న సమూరీ జాతివాడు. అప్పటినుంచి వాడికి బ్రతికున్న దున్నని రెండు కొమ్ములు పట్టుకొని రెండు ముక్కలుగా చీల్చివేయగల బలం వచ్చిందంటారు. అతని పొడుగాటి కత్తి ప్రక్కన సముద్రపుకాకి తోకలాగ వ్రేలాడుతూఉంది. అతను వచ్చేదాక క్రిందగా నిలబడ్డాడు. కాగడాలు కాల్చేవు వస్త్రాల వాసంగాను కాల్చేవు మంటంగాను వెలుగుతున్నాయి. మా వంట్లో రక్తం పేరుకుపోయే పరిస్థితిలో ఉన్నాం కాబట్టి మేము మేల్కొన్నామా? కల గంటున్నామా? మాకే తెలియడంలేదు.

లోపలికి రథాన్ని లాక్కొచ్చారు. దాని యాప్త బరువుగా ఉంది. ఎద్దుల్ని కట్టలేదు. కాడిని ఒక చట్రకాన్ని నిలబెట్టారు. దానిమీదనున్న బంగారు పనితనం నక్షత్రాలలాగ మెరుస్తూ ఉంది. వసంత కాలపు రాత్రే అయినా మాకు భయంవల్ల ఒళ్ళు చల్లబడుతూఉంది. రథాన్ని నగిషీలు కుట్టిన ఊదా తెరలతో పట్టంగా కప్పారు. లోపలేముందో కనబడటం లేదు. దానిచుట్టూ కాగడాలు పట్టుకొని సేవకులు సమయంకోస ఎదురు చూస్తూ నిలబడ్డారు. యోషిహిడే వరండావైపు తిరిగి కొంచెం దూరం నుంచి మోకరించాడు. మామూలుకంటే కురచగాను, కురూపిగాను కన బడ్డాడు. నక్షత్రాలతో వెలుగుతున్న ఆకాశం అతణ్ని క్రిందకు నొక్కేస్తూ ఉందా అనిపించింది. అతని ప్రక్కన కూర్చున్నవాడతని శిష్యుడే. నాకు వాళ్ళు కొంచెం దూరంలో ఉండటంచేత వాళ్ళ బట్టల రంగు స్పష్టంగా కనబడటంలేదు.

# 17

నడిరాత్రి అయి ఉంటుంది. సెలయేటిని క్రమ్మిన చీకటి మా ఉచ్ఛ్వాసాలుకూడ గమనిస్తూఉందా అనిపించింది. నెమ్మదిగా వీస్తూ

ఉన్న పిల్లవాయుని కాగడా పొగ క్రమ్మింది. నిశ్చలంగా నిశ్శబ్దంగా ప్రభువా వాతావరణం కాస్సేపు చూశాడు. ముందుకు వంగి యోషిహిడీ అని కఠోరంగా అరచాడు. అతడేదో జవాబుచెప్పి ఉంటాడు కాని నా కదొక ఆర్తనాదంలాగ వినబడింది.

"యోషిహిడీ! నీ కోరిక ప్రకారం యీ రాత్రి యీ రథం కాల్పిస్తున్నాను" అంటూ ప్రభువు చుట్టు ప్రక్కలనున్న వాళ్ళ నోరచూపులను చూడడమేగాక ఒకరిద్దరి వైపుచూచి నర్మగర్భితమైన మందహాసంకూడా చేసినట్లు అనుమానం. యోషిహిడీ తలయెత్తి వరండావైపు చూశాడే కాని యేమీ అనలేదు. కూర్చున్నచోటునుంచి లేవలేదు.

"నే నెప్పుడూ వాడుకొనే రథమిది. నీకు తెలుసునుకదా! దాన్నుంచి నీకు మండుతున్న నరకాన్నే చూపిస్తా" అని ప్రభువు మళ్ళీ ఆగి అనుచరులకు కన్నుగీటాడు. కంఠం వికృతంగా మార్చాడు. "ఆ రథంలో నా ఆజ్ఞ ప్రకారం ఒక ఆడదోషిని ఉంచాం. బండిని అంటించగానే ఆమె మాంసం వేపుడై పోతుంది. ఎముకలు భస్మమౌతాయి. ఘోర సంక్షోభంతో చస్తుంది. నీ చిత్రాని కిలాంటి నమూనా నీ కెన్నడూ దొరకదు. మంచులాంటి ఆమె తెల్లని దేహం మంటలో మాడిపోతూఉంటే చూడ్డానికి జంకకు. అగ్ని జ్వాలలలో ఎగిరే ఆమె నల్లని వెంట్రుకలు బాగాచూడు" అన్నాడు.

ఇలా మూడోసారి మాట్లాడి ప్రభువూరుకొన్నాడు. అతని మనస్సులోని ఉద్దేశమేమిటో తెలియదు. లోలోన ఉబుకుతున్న నవ్వుతో అతని భుజాలు కదిలాయి. "వచ్చే తరాలవా రిలాంటి దెన్నడూ చూడలేరు. నే నిక్కడనుండే చూస్తాను. తెర లెత్తండి. లోపలున్న మనిషిని యోషిహిడీకు చూపండి" అన్నాడు.

ప్రభువాజ్ఞప్రకారం ఒక సేవకుడు ఒక చేత్తో కాగడా పైకెత్తి బండి దగ్గరకు వెళ్ళి రెండోచేత్తో తెర ఎత్తాడు, రెప రెపలాడుతున్న

కాగడా పటపట ధ్వనిచేస్తూ మండుతూంది, బండిలోనికి మంచి వెలుతురు పడింది. క్రూరంగా గొలుసులతో బంధింపబడి పరుపుమీద పడిఉన్న ఒక స్త్రీ కానవచ్చింది. ఎవరామె? ఆమెయైయుండదు! విశేషంగా కుట్టుపనిగల ఎర్రని దుస్తులు వంటిమీద నున్నాయి. నల్లని వెంట్రుకలు క్రిందకు వ్రేలాడు తున్నాయి. చూడ ముచ్చటగా నున్నాయి.అందులో అక్కడక్కడ గ్రుచ్చిన బంగారు పిన్నులు అందంగా మెరుస్తున్నాయి. కాని నోటిమీద నుంచి గుడ్డ వెనక్కి కట్టేశారు. సన్నని దేహం. అందమైన విగ్రహం. ఈవాళ బట్టలు తేడాగా ఉన్నాయి కాని ఆమె యూజుకీయే. అది చూచి ఒక్క కేక పెదవుల దాకా వచ్చేసిందినాకు.

ఆ సమయాన్న నా కెదురుగా ఉన్న సామురాయిజాతి సేవకుడు చయిక్కున లేచి కత్తిమీద చేయివేశాడు. యోషిహిదేను చూచి ఉంటాడు. నేనులికిపడి యోషిహిదేను చూచాను. కూతుర్ని చూడగానే అతడు సగం రాయైపోయాడు. హఠాత్తుగా గెంతి, రెండు చేతులు ముందుకు చాచి, ప్రపంచాన్నే మరచి రథంవైపు పరుగెత్తాడు. చీకట్లో దూరాన్నుండటం వల్ల అతని ముఖవాలక మెలాఉన్నదీ చెప్పలేను. మసగకాంతిలో అతని తెల్లని దేహం నల్లటి చీకటిని చీల్చుకొంటూ పోతూఉంటే ఏదో అదృశ్య శక్తి అతణ్ణి భూమి మీదనుంచి ఎత్తి ఉపరిభాగాన్నే ఉంచిందా అనిపించింది. "అంటించండి'' అనే ప్రభువాజ్ఞను అందుకొని సేవకులు మనిషితో ఉన్న బండికి కాగడాలన్నీ అంటించే సరికి అది మంటలతో వెలిగిపోయింది.

# 18

మేముచూస్తూ ఉండగానే జ్వాలలు రథాన్ని చుట్టేశాయి. రథం కప్పుకు మూలల నుండి వ్రేలాడుతూఉన్న కుచ్చులు గాలికి కొట్టుకొంటూ ఉన్నాయి. నల్లని చీకట్లో తెల్లని పొగలు పొంగుకొచ్చాయి. రథానికిగల

పెనుదు, తలుపులు తెరలు, దాని టాపున ఉన్న అలంకారాలు ఆ అగ్ని కణాల తుపానులో కొట్టుకుపోతున్నాయి. మంటల నాలికలు కిటికీల క్రింద నుంచి ఆకాశంలోకెగబ్రాకుతూ, భూమిని కూలిన సూర్యుని దివ్యకిరణాలలాగున్నాయి. ఇదివరకు నేను అరచినంత పని చేశానుకాని ఇప్పుడు వివశుణ్ణి మూగనియై పోయాను. నోరావలించి ఆ దారుణ దృశ్యం చూస్తున్నాను. కాని తండ్రి యోషిహిదే—?

అతని ముఖమింకా జ్ఞాపకం వస్తూఉంది. రథంవైపు అమాంతంగా పరుగెత్తాడు. కాని మంటలు ప్రజ్వలించేసరి కాగి, చేతులు చాచి, పొడుచుకువస్తున్న ఆ కళ్ళతో రథాన్ని కప్పేస్తూఉన్న మంటల్ని, పొగల్ని చూస్తున్నాడు. ఆ మంటల్లో పడిపోతాడా అన్నట్లు చూస్తున్నాడు. ఆ మంటల కాంతికి అతని ముఖం మీద ముడతలూ, తల మీద వెంట్రుకలూ స్పష్టంగా కనబడుతున్నాయి. అతని అంతరంగంలో చెలరేగుతున్న దుఃఖం, విభ్రమం, భయమూ విప్పారి తేరిపారచూస్తూఉన్న అతని కళ్ళలోతుల్లోను, వంకరలుపోయిన పెదవులలోను, పీక్కుపోతున్న చెంపల్లోను, స్పష్టంగా చెక్కబడినట్లు కనబడుతున్నాయి. మహానేరం చేసిన దొంగని ఉరికంబానికో, యమధర్మరాజు యెదుటికో లాక్కుపోతూ ఉంటే ఇంతకంటె గోల పెట్టడు. అతన్ని చూచి రాక్షసుడులాగున్న సామూరీ వాడుకూడ వివర్ణుడై హోరికావా ప్రభువు వైపు భయంతో చూచాడు.

కాని ప్రభువు మాత్రం రథం నుండి దృష్టి మరల్పలేదు. అప్పుడప్పుడు పెదవులు కొరుక్కొంటున్నాడు. వికారపు నవ్వు నవ్వుతున్నాడు. రథం, రథంలోని యువతిని గూర్చి నేను చూచిందంతా చెప్పడానికి ధైర్యం చాలదు. పొగలో ఉక్కిరి బిక్కిరియైన ఆమె తెల్లని ముఖం పైకి తిరిగింది. పొడుగుగా వ్రేలాడుతున్న ఆమె తల వెంట్రుకలు పొగలో ఎగిరి కొట్టుకొంటున్నాయి. ఆమె ఎర్రటి దుస్తుల్లో - అబ్బా, ఎంత

అందంగా ఉంది! ఎంత దారుణ దృశ్యం! రాత్రి గాలి తగ్గిపోయాక పొగ అవతలివైపుకి మళ్ళింది. ఎర్రని మంటల మీద బంగారు రజను జల్లినట్లయింది. ఆమె నోటికట్లు పీకేసింది. గొలుసులు తెగిపోతాయన్నట్లు తన్నుకొంది. నేనూ, ఆ రాక్షస సామూకి కూడ యమయాతనలు కళ్ళారా చూస్తున్నామనుకొన్నాం. మా దేహాలు వణికిపోతున్నాయి.

చెట్ల శిఖరాలు కదులుతూ ఉంటే మళ్ళీ రాత్రి గాలి వీవసాగిందా అనుకొన్నాం. ఆకుల గలగల ఆకాశంలో వినవస్తూఉండే నల్లనిదేదో, భూమి నంటనిది, ఆకాశంలో ఎగరనిది, బంతిలాగ గెంతుతూ ఇంటి కప్పునుంచి మండిపోతున్న రథంలోకి దూకింది. కూలిపోతున్న కిటికీల లోంచి కుంకుమరంగు దాగులతో అదిరిపడింది. తన్నుకొంటున్న సుందరి మీద తన చేతులు కప్పి సిల్కుగుడ్డ చింపుతున్న ధ్వనిలో కీచు మంటూ అరచింది. రెండుమూడు సార్లు అట్లా అరచింది. మేమిద్దరం మాకు తెలియకుండానే అరచాం. ఆ సుందరి భుజాల కంటుకొని యోషిహిడే కోతి, అద్దాల్లోంచిలాగ మంటల్లోంచి స్పష్టంగా కనబడుతూ ఉంది. దాన్ని కట్టేసి రాజధానిలో ప్రాసాదంలో విడిచి వచ్చారు.

# 19

ఒక్కనిమిషం మాత్రమే అది కనిపించింది. గోధుమరంగు తెరమీద బంగారు రేకుల్లాగ అగ్నికణా లాకాశాని కెగిరాయి.. రథం పటపట ధ్వానంతో తోటలో కాలిపోతూ ఉంటే కోతీ, యూజుకీ ఇద్దరూ నల్లని పొగల్లో కప్పుపడి పోయారు. జ్వాలలు ఆకాశాన్ని కూడ పొడిచి గాయ పరచాయి.

ఆ అగ్ని స్తంభం ముందు యోషిహిడే నేలలో పాతుకుపోయినట్టు నిలబడిపోయాడు. విచిత్రం! అతని ముడతల ముఖంమీద అనిర్వచ

నీయమైన ఉల్లాస రేఖలు మొలిచాయి. నరకయాతన మరుగుపడి పోయింది. ప్రభువు అక్కడ వున్నట్లు మరచిపోయాడు. చేతులు జోడించి చూస్తూ నిలబడ్డాడు. తన కూతురు యమయాతన తనకి కనబడటం లేదనుకుంటా. ఆ మంటల మనోహరమైన రంగులు, హింసకు గిలగిల లాడుతూన్న స్త్రీ రూపం చూచి వినోదిస్తున్నాడా అనిపించింది.

తన కూతురి చావు సంతోషంగా తిలకిస్తున్నాడన్నది కాదు చెప్పకో తగ్గది. మనుష్యులలో మనము చూడని కాఠిన్యం అతనిలో ఉండేది. ఆ మంటల కచ్చేరువుతో రాత్రి తిరిగే పక్షులు అరుస్తూ చుట్టూ తిరుగుతున్నాయి. యోషిహిడీ తలచుట్టూ మరీ ఎక్కువ పక్షులు తిరుగుచున్నట్లు కనబడ్డింది. అది నా ఊహ కావచ్చు. ఆ ఆత్మలులేని పక్షుల కతని తలచుట్టూ అపురూప ఇంద్రజాల మహిమా పరివేషమేదన్నా కనబడిందేమో। పక్షులే ఆకర్షింపబడగా, యోషిహిడీను చూస్తున్న మాకు ఎంత పూజ్యభావం గల్గిందో చెప్పాలా? ఊపిరి పీల్చకుండా, భయభక్తులతో వణుకుతూ మేము సాక్షాత్కరించిన బుద్ధ దేవుని దర్శించినట్లతనిని చూశాం. వాతావరణ మంతా నిండిన మంటల ఘోషను, దానికి ముగ్ధుడై నిశ్చలుడై నిలిచియున్న యోషిహిడీను చూచి మేము భీతిని పొందాం. గాఢానందాన్నీ పొందాం. ప్రభువు మాత్రం మారిపోయినట్లు కనిపించారు. ముఖాన రక్తం చుక్క లేదు. పెదవులు నురగలు కక్కాయి. రెండు చేతులతో మోకాళ్ళు పట్టుకొని, దాహంతో ఉన్న జంతువులాగ ఆయాసపడుతున్నాడు.

# 20

యోజికీ వద్ద ప్రభువు రథ మా రాత్రి తగల బెట్టించాడన్న వార్త వ్యాపించింది. దాని గూర్చిన అభిప్రాయా లనేకం బయలుదేరాయి. వాటిలో ప్రభువు యోషిహిడీ కూతురు తనకు లొంగని కారణాన కాల్చి చంపాడన్నది ముఖ్యమైనది. కాని యథార్థమేమిటంటే నరకచిత్రం

చిత్రించుచున్న యోషిహిడీ యొక్క దుష్టత్వాన్ని శిక్షించడమే ప్రభువు యొక్క ఉద్దేశం. దానికోసమొకర్ని కాల్చవలసి వచ్చింది. ఈ సంగతి ప్రభువే నాకు చెప్పాడు.

తన కళ్ళెదుట తన కూతురు మంటల్లో కాలిపోవడం చూచి కూడ తెరనింకా చిత్రిస్తూఉన్న యోషిహిడీ రాతి గుండెను గూర్చి చాలా మంది చెప్పుకొన్నారు. కొందరాతణ్ణి మానవాకారంలో ఉన్న క్రూర మృగం అన్నారు. చిత్రం కోసం మానవప్రేమనే మంట గలిపాడన్నారు. మెకొగావా మతగురువు తరుచనేవాడు, "మనుష్యుని తెలివి గొప్పదే కావచ్చు, అతని కళ గొప్పదే కావచ్చు, కాని పంచసుగుణములే (కనికరము, న్యాయము, అనుకూలత, జ్ఞానము, విశ్వాసము) మనుష్యుని నరకము నుంచి రక్షింప గలవు."

ఒక నెలకు నరక చిత్రం పూర్తయింది. వెంటనే ప్రాసాదానికి తీసుకువెళ్ళి హోరికావా ప్రభువుకు యోషిహిడీ చూపెట్టాడు. మతగురువు కూడ అప్పు డక్కడే ఉన్నాడు. చిత్రంలో ఒక చోట ఆకాశమంతటా చెలరేగుతున్న నిప్పుల తుపాను చూచి సహజంగా ఉలికిపడే ఉంటాడు. ముఖం చిట్లించుకొని యోషిహిడాను తీవ్రంగా చూచాడు మతగురువు. కాని అనుకోకుండా చటుక్కున 'బాగా చిత్రించాడు' అనేశాడు. లేని నవ్వు తెచ్చుకొని ఆదరించాడు చిత్రాన్ని ప్రభువు.

ప్రాసాదంలో నాటి నుండి యోషిహిడీను గూర్చి చెడుగా మాట్లాడటం మానేశారు. చిత్రం పూర్తియైన మరునటి రాత్రి తన గదిలో దూలానికి ఉరి పోసుకొని చనిపోయాడు యోషిహిడీ. తన కొక్కతే కూతురు, ఆమె పోయిన మీదట తానొక్కడే జీవితభారం మోయలేనను కున్నాడు. అతని సమాధి రాతిమీద సంవత్సరాల తరబడి వర్షాలు కురిశాయి, గాలులు వీచాయి, చివరికి నాచుదాన్ని కనబడకుండా కప్పేసింది.

—ఇజూమీ క్యోకా

# 7. ముగ్గురు గ్రుడ్డివాళ్లు

"అయ్యో, ఒక నిముషం".

ఆ కంఠస్వరం వినగానే శకగామీకి వెన్నుల్లో జల్లుమన్నది. ఇది వరకు తా నెరిగిన కంఠం కాదు అతడు కొండ దిగువ నున్నాడు. వల యాలు చుట్టి వ్యాపిస్తూఉన్న పొగమంచులో కనబడీ కనబడకుండా యాట్సుయా పై పునుండి తన వేపుకు దిగివస్తూఉన్న వాళ్ళని చూచాడు. వాళ్ళ అడుగుల చప్పుడు వినబడటంలేదు కాని కంఠధ్వని విన్నాడు.

వాళ్ళెవరో తెలియదు. కాని తాను ముందుకు వెళ్ళగలిగే ముందేదో జరుగబోతూందని మాత్రం అనుకొన్నాడు. అలాగే తననూ పిలుస్తారు. ఆపుచేస్తారు. ఏదో కంఠధ్వని వినబడుతుంది అని తాను ముందే ఊహించాడు చిత్రంగా. దారిని పోతూ రాబందు అరుపో, గబ్బిలం కూతో బాట సారి విని ఆ కూతలు తన కొరకే అని అనుకోనట్లు శకగామీ ఆ పిలుపు తన కొరకనుకోలేదు కాని అలాంటి శకునపక్షి కూత వినబడుతుందని అనుకొంటూనే ఉన్నాడు,

ఒకే వరుసలో ముగ్గురు గ్రుడ్డివాళ్ళు. మధ్య నడివయస్సులో ఉన్న ఆడదుంది. తల వెంట్రుకలు దట్టంగా ఉన్నాయి. సన్నని భుజాలు, ఆమె అంగీచేతుల అంచులు, ముడుచుకొన్న హస్తాలనుండి ఎండిపోయిన వక్షము మీదుగా బిగించిన నడుము వరకు నల్లగా వేళ్ళాడుతున్నాయి.

ఆ చప్పుడు ఆమె చెప్పులదా? ఏమో! ఆమె లంగా నేలను రాపాడుతూ ఉండటంవల్ల పాదాలు కనిపించడం లేదు.

మొదటివాడు పొగమంచుతో నేసినదా అన్నట్లు మెత్తగా ఒదులుగా నున్న దుస్తులు ధరించాడు. తలమీద కోసుగా ఉన్న టోపీ ఉంది. నడుస్తూ ఉంటే వాడి ఎండిపోయిన దేహం ఊగుతూ ఉంది. చివర నున్నవాడు చిక్కి సన్నగా ఉన్నాడు. అంత ఎత్తరికాడు. మధ్యనున్న ఆడదాని వెండ్రుకల నీడలో దాగుకోడానికా అన్నట్లు ఆమె నంటిపెట్టుకున్నాడు. ముగ్గురిలో ఒక్కరు కూడ సరిగా కనబడకున్నా చివరివాడే ముగ్గురిలోకి అస్పష్టంగా ఉన్నాడు. వీడే ఆపింది శకగామిని.

"నన్నా పలకరించింది" అని చలికి కుంచుకు పోతున్న భుజాలతో వెనక్కి తిరిగి శకగామి మొరిగే కుక్కను తిట్టినట్లు గ్రుడ్డివాణ్ణి అడిగాడు.

"ఔను" అని మెల్లగా వినబడింది. ఈ మాట వెనుకనున్న సన్నటివాడే నిలదొక్కుని అన్నాడు. రెండు మూడడుగుల దూరంలో ఉన్నాడు. మంచులో నడవడానికి తన చేతికర్రను తెడ్డులాగ ఒక ప్రక్కకు ఆనించాడు. తక్కిన ఇద్దరు కాస్త కిందకున్నారు. వాండ్లో మొదటి వానిది పెద్ద తలకాయి. ఆడది తలకట్టు జపాన్ పద్ధతిని ఎత్తుముడిగా వేసింది, గోడకు తగిలించిన విగ్గులాగ ఉంది. ఇద్దరూ మూడోవాడికి పెడముఖం పెట్టి నిలబడ్డాడు.

వెనక్కి తిరిగి శకగామి గ్రుడ్డివాణ్ణి చూచి "ఏంకావాలి" అన్నాడు. "మీతో కొంచెం మాట్లాడాలి" అని అతను నెమ్మదిగా అన్నాడు. ఆ చలి కాలపు రాత్రి అంత నిదానం నెమ్మదీ చిత్రంగానే ఉంది.

## 2

"ఏమిటి మాట్లాడేది?"

పొగమంచులో వారు తనవైపే వస్తున్నారు. చలిగాలి విసురుకు మొదళ్ళ నంటిన గడ్డి-గాదలతో నెగురకొట్టబడ్డ చిత్తడి నేలలలోని సమా

ధుల మీద గుర్తుకు పాతిన కర్రలలాగున్నారు వీళ్ళు. ముశాషినో మైదానములోని గుహల్లోగూడ సంచారంలేని ఆ గలీజు దారిలో ఈడ్చుకొంటూ పోతూ ఉన్న ఆ ముగ్గురూ ఒళ్ళుపట్టి బ్రదికే గ్రుడ్డివాళ్ళని గ్రహించి, శకగామీ కొంత శాంతించాడు. వీళ్ళు తమ వృత్తి సూచకంగా చలికాలపు రాత్రిళ్ళు దోమ సంగీతంలాగ సన్నగా పిల్లనగ్రోవి బాడుతూ పోతారు. ఏ ఓీద కొంపల్లోనో దూరుతారు,

"చెప్పేదేమీ లేదుకాని ఎక్కడికి మీరు వెళ్ళేది? ఎక్కడికి?" అంటూ కొంచెం పరిహాసం స్ఫురించేట్టు ముక్కుతో మాట్లాడాడు మూడో వాడు. తల ఒకవైపుకు వంచి శకగామీవైపు చూచాడు. చెవిగోక్కోడాని కన్నట్లు చెయ్యెత్తి తన కర్రపిడి మీద నెమ్మదిగా చరిచాడు.

"ఎక్కడి కైతేనేం" అన్నాడు శకగామీ. తనను కలుసుకొనడానికి వీలులేకుండా నిర్బంధంలోనున్న స్త్రీని కలుసుకోడానికి వెళ్తూ ఉన్నాడతడు.

"అలాకాదు, ఉందిదాంట్లో విశేషం"అని గ్రుడ్డివాడూదిపల్కాడు. అదివిని శకగామీ నిలబడిపోయి గ్రుడ్డివానివైపు వెళ్ళబోయాడు కాని మంచు దెబ్బకు వెనక్కు తగ్గాడు.

"ఆలస్యమైపోయింది" అని తల నేలకువంచి గట్టిగా అన్నాడు గ్రుడ్డివాడు. ముందున్న మొదటి గ్రుడ్డివాడు రోడ్డు గట్టువైపు ముఖం త్రిప్పాడు. మోకాళ్ళమీద విచారంగా కూర్చున్న ఆడది నేలలోకి క్రుంగిపోతున్నట్లు కనిపించింది. నల్లని తల వెంట్రుకల ప్రక్క ఆమె తెల్లని కర్రపిడి తళుక్కు మంటూఉంది. వాళ్ళు ముగ్గురూ ఆగడం చూచి తానూ ఆగాడు శకగామీ. విషము మ్రింగే వానికి మళ్ళే అతని గుండె కొట్టుకొంటూ ఉంది. ఏమి కానున్నదో అనే చింతతో అతని రక్తం ఉబికి పరుగెట్టుతూ ఉంది. కోపంతో అతని ఒళ్లు వణికింది.

రోడ్డుకు రెండు వైపులా ఉన్న గట్లు కొండచరియలలాగ ఉన్నాయి. ఆ గట్టుమీద సైనికులుండేశాలల్లాంటి రెండిళ్ళున్నాయి. కొండవాడల్లో ఉండే టీ పాకల్లాగున్నాయి. వాంట్లోంచి కాస్త కూడ వెలుతురు రావడం లేదు. గట్లగడ్డిమీద మంచు దట్టంగా పడింది. ముగ్గురు గ్రుడ్డివాళ్ళున్న వైపుగట్టు కొంచెం కూలింది, దాంట్లోంచి చెట్లవ్రేళ్ళు కనబడుతున్నాయి. ఆకులు రాలిన చెట్లు ఎముకల గూడుల్లాగున్నాయి, వాటి కొమ్మల కక్కడక్కడ మసక వెన్నెలలాంటి మంచు అంటుకొంది. నక్షత్రాలు కనిపించడం లేదు.

''ఆలస్యమైతే తప్పా'' అని గుండెదడతో భారంగా అన్నాడు శకగామీ. "ఔను, అలాగే అంటావు. కాని తప్పే. తప్పా తప్పున్నరా? అన్నాడు గ్రుడ్డివాడు. "ఐతే నేను వెళ్ళ కూడదా?'' అని అడిగాడు. వాడేదో మహాజ్ఞానిలాగ తను వెళ్ళబోతున్న సమావేశం గూర్చి చెప్పగల దన్న విశ్వాసంతో అడిగాడు.

"నేను వద్దన్నా నీవు వెళ్ళితే దానితోసరి; కాని కాసేపిప్పుడు నిన్నాపాలి. నేనుఒక్కడినేనా, ఆమొదటివాడుకూడా ఆపాలనే అంటాడు" అన్నాడు గ్రుడ్డివాడు. మొదటివాడు కాస్త దగ్గాడు.

# 3

"నేను వెళ్తాననుకో ఏమౌతుంది? మరణశయ్య మీద ఉన్న తండ్రి కోసమో, స్నేహితుని కోసమో వెళుతూండ కూడదూ? నేనేదో తప్పుపని చేస్తున్నట్లనుకొని ఆపుతున్నావు" అన్నాడు శకగామీ.

గ్రుడ్డివాడు చేతికర్రను చెంప కానించి వికారంగా నవ్వాడు. "నీ వెక్కడికి వెళుతున్నావో నాకు తెలుసు. ఆ మొదటివాడు నన్ను మాట్లాడ

మంటున్నాడు. సంగతేమిటో చెప్పెయ్యనా? అదేం కష్టంకాదు, నేను చెప్పింది సరియైనదని నీవే ఒప్పుకొంటావు. ఒక స్త్రీని కలుసుకోదానిక్గి నీవు వెల్తున్నావు" అన్నాడు గ్రుడ్డివాడు.

శకగామి మాట్లాడలేదు.

"ఆమెకు బంధనాలు బాధ్యతలూ ఉన్నాయి. చిక్కులు అడ్డంకులు ఉన్నాయి. నీవు చొరబడి చడులు గోడలు కూల్చేశావు. ఆమెను తొందర చేసి ఆమె గుండె చీల్చావు. ప్రాణానికి తెగించి నిన్ను కలుసుకో బోతూంది. ఆమెను కలుసుకో బోతున్నావు. నీ అడుగుల చప్పుడుబట్టే గ్రహించాను. మతిచెడి మూకుడుగా వెళ్ళే వాళ్ళను నేను గుర్తుపట్ట గలను" అన్నాడు గ్రుడ్డివాడు.

మంచు పడుతూ ఉంది. మబ్బులు చంద్రుణ్ణావరించాయి. ఆకాశం లోనే సన్నని నీడలు లేచాయి. గుండె ఆగినట్లయింది. శ్వాస బిగిసి పోయింది. చీకట్లో మెరుములు ఉరుములు నింపిపోతున్నాయి.

"మనుష్యుని హృదయానికి చిత్రమనేదిలేదు. నీ స్థితిలో నన్నుంచు కొని, నీ తలపులు నే తలంచి అంతా తెలుసుకొన్నాను. గ్రుడ్డివానికి కూడా అంతా స్పష్టమై పోయింది. ఇదిగో, ఈ చెయ్యిలాగ స్పష్టమై పోయింది అంటూ తన చేతిని ముఖము మీదకు ఎత్తాదు. తక్కిన ఇద్దరు గ్రుడ్డివాళ్ళూకూడ తలలూపుతున్నట్లు ఆ మసక కాంతిలో శకగామీ కని పెట్టాడు.

"మీరు జ్యోస్యం చెబుతారా? ఏదో, తొందరలో విసుగ్గా మాట్లా డేను" అని శకగామీ నిట్టూర్పు విడుస్తూ "ఆమె నా కోసం చెప్పులు కూడ వేసుకోకుండా ఇంట్లోంచి బయలు దేరింది. ఇక్కడికి సమీపంలో అడివిలో నా కోసం ఒంటరిగా ఎదురుచూస్తూ ఉంటుంది. నేను వెళ్తేగాని

అక్కడ నుంచి కదలదు. ఇప్పుడే ఆమె నుంచి టెలిఫోన్ [illegible] వచ్చింది. చిన్న సిగ్నల్ మాత్రం వచ్చింది. వెళ్ళవద్దంటారా?" అన్నాడు [illegible].

"మే మనుకొన్నదీ అంతే. అంతా చెప్పేశావు. బాగుంది. వెళ్ళక పోతే ఇద్దరికీ విచారమే కాని వెళ్ళితే అపత్తుకూడాను" అని చెప్పి గ్రుడ్డి వాడు రెండు చేతులతోను చేతి కర్రను వక్షమునకు బిగియపట్టి కాసేపు నిశ్శబ్దంగా ఉన్నాడు. "మనమున్న యీ గట్టు మీద వరసగా గ్యాసు లైట్లున్నాయి. ఎన్ని వెలుగుతున్నాయి? ఎన్ని ఆరిపోయాయి? చెప్పు" అని గ్రుడ్డివాడు కల వక్షము మీద కాస్తుకొన్నాడు.

శకగామి కా బాటను పోవుట నది మొదటిసారి కాదు. కొంత క్రిందగా ఒక్కప్రక్క రెండేసి గజాల కొక గ్యాసులైటు చొప్పున దగ్గర్లో ఉన్న సినీమా వారు ఆ దారిని వెళ్ళే వారి కోసం వేశారు. దీపాలు తెల్లగా చల్లగా మంచు సూదుల్లాగ ఉన్నాయి. వాటి గాజు తొడుగుల మీద మంచు పడటం వల్ల వేడికి ఆవిరి వేస్తూ ఉంది. దీపాని కంటుకొన్న మంచు, దెయ్యాల చావు ముసుగులాగ ఉంది. దీపానికి సాలెగూడులాగ మంచు అంటు కొని, ఆవిరిలోంచి వెలుగు తీగలు క్రిందికీ పైకీ ప్రసరింప చేస్తూఉంది.

## 4

శకగామి క్రిందకూ మీదకూ దీపాల వరుస చూస్తూ ఉంటే, "అవన్నీ ఆరిపోతాయి" అన్నాడు అంధుడు. అలాగే అన్నీ ఆరిపోయాయి. చీకటి మరింత దట్టమైపోయింది. "దూరాన్ని ఒక్క దీపం మాత్రం వెలుగుతూ ఉంది. అది ఎన్ని దీపాల కవతల ఉంది?" అని అడిగా డంధుడు. ఒక్క సన్నని దీపం, కొట్టుకొంటూ మంచుకి ఆరిపోయే టట్లుంది.

"అది కనబడుతూఉంది కాని ఎన్ని స్తంబాల కవతల ఉందో చెప్పలేను" అన్నాడు శకగామీ. "అంతదూరం కాదు, ఏకాకిగా పోయే బాటసారికి దేవదారు చెట్లల్లో రాత్రిళ్ళు తిరిగే కొంగ కనబడితే అదెప్పుడూ ఎదుట ఐదవ చెట్టు మీద ఉంటుంది. అలాగే ఆ దీపం ఎగువని ఐదవ స్తంభం మీద ఉంటుంది" అన్నాడు అంధుడు. "నేను చెప్పిం దబద్ధమైతే మొదటి వాడు సరిదిద్దుతాడు. ఇప్పుడేమీ అనలేరుగా! కాబట్టి నే నన్నది సరియైనదే. నీవే లెక్కపెట్టు ఒకటి—" అంటూ రెండు సార్లు చేతి కర్ర నేలను కొట్టాడు.

"ఒకటి, రెండు, మూడు, నాల్గు, ఐదు— ఐదోది" అని శకగామీ లెక్కపెట్టి చెప్పాడు.

"నే నన్నట్లే కదా!"

"అయితే యేమంటావు."

"నీవు మా ముగ్గుర్ని, ఈ గట్టుని, ఈ ఆరిపోయిన దీపాల్ని ఆ వెలుగుతున్న ఒక్క దీపం వల్లనే చూస్తున్నావు, అది కూడా లేకపోతే నేను నీ ముక్కు కొరికినా నన్ను నీవు చూడలేవు" అన్నాడు అంధుడు.

ఔను. ఆ దీపం వల్లనే యీ వ్యక్తులు మసగగానైనా కనబడుతున్నారు. ఆ మసక దీపం వల్లనే యీ ఆరిన దీపాలు కూడ ఒకొక్కప్పుడు కాంతితో మెరుస్తున్నాయి. శకగామీ ఆ పొగమంచులో కలత వడిన మనస్సుతో నిలబడి పోయాడు.

"దీని అర్థ మేమిటి?" అని అడిగాడు శకగామీ.

"వెలుగుతూ ఉన్న ఐదవ దీపం క్రింద నీ కెవరూ కన్పించడం లేదా?"

"లేదు."

"ఏమీ లేదా ?"

"ఏమీ లేదు."

"కాదు. దగ్గరకు వెళ్ళి చూస్తే కనిపిస్తుంది.అందుకే వినిపించింది. కావలిస్తే విను" అని ముందుకు వంగి అంధుడు తన చేతి కర్రను గ్యాసు లైటు స్తంభం మొదల్లో ఉన్న గులక రాళ్ళ మీద గలగల లాడించాడు. ఆధ్వనిని పొగమంచు మ్రింగేసింది.

"ఇదిగో, స్పష్టంగా చెప్తున్నా. మనము నిలబడ్డ ఈ గ్యాసు లైటు స్తంభం క్రిందవైపునుంచి లెక్కపెడితే పంథొమ్మిదవది. ఈ స్తంభం మనము వచ్చినప్పటి నుంచి ఒక్క అంగుళం అటుగాని ఇటు గాని కదలలేదు. నే చెప్పింది తప్పయితే మొదటివాడు దిద్దేవాడే. మూడు సంవత్సరాల క్రితం ఒక రాత్రి ఈ నవంబరు నెలలోనే, ఇదే ఘడియకు, నాకూ ఇలాంటిదే సంభవించింది. "నే నప్పుడు గ్రుడ్డివాణ్ణి కాదు."వంచిన తలతోనే శకగామీ వైపు తిరిగి," నేనుకూడా నీలాగే ఒక స్త్రీని కలుసు కోవడానికి ఈ కొండ ఎక్కుతున్నాను. అప్పుడు నాకు ఒక్క గ్రుడ్డి వాడే ఎదురయ్యాడు. ముగ్గురు కాదు. అంతే లేడా."

మొదటి వాడు కొండ క్రిందకు చూస్తూ, కొంచెం ముందుకు సాగి ఆగాడు.

# 5

మోకాళ్ళ మీదే కూర్చుని ఆస్త్రీ కథ వినడానికి తన తెల్లని మెడ నిటు త్రిప్పింది. ఆమె గౌను, నడుము పట్టీలు ఒక దానిమీద ఒకటి పడుతున్నాయి.

"నిన్ను నేనీవాళ పిలిచినట్లే నన్నొకడు వెనుకనించి గట్టిగా పిలి చాడు. ఈ పందొమ్మిదవ స్తంభం క్రిందే నేను నీ కిప్పుడు చెప్పిన సంగ

తులే అప్పుడు నాకు చెప్పాడు. అవే ఇప్పుడు నీకు తిరిగి చెప్పాను. నే నెందుకా స్త్రీ దగ్గరకు వెళ్ళరాదు అని నీ వడిగినట్లే నేనూ అడిగాను. అతడన్నాడు——" అతడంటే వారిలో మొదటి వాడేనని శకగాపి కర్థమైంది.

"ఆ వెలుగుతున్న ఐదవ దీపం క్రింద ఒక విచిత్ర జంతువుంది. మనుష్యుల నీడల్ని పట్టుకొని మ్రింగేస్తుంది. అది నీడ పీలిస్తే మనిషి నీరసిస్తాడు. అది నీడను నాలికతో నాకితే మనిషి అణగారిపోతాడు. అది నీడను త్రొక్కితే జబ్బుపడి పోతాడు. అది నీడను దూరంగా ఊదేస్తే మనిషి చచ్చిపోతాడు. రాత్రిం బవళ్ళా దయ్యం నీడల్ని పట్టి పీల్చి, నాకి, త్రొక్కి, చంపడానికి తిరుగుతూ ఉంటుంది. ఆ భయంకరమైన దయ్యం దీపం క్రింద నోరు తెరిచి నీడ మ్రింగిందా మరీ ఘోరం. తక్షణం మనిషి చచ్చిపోతాడు. దానితో ఇంకిటు రావు" అని చెప్పాడు. కాని నేను వయస్సులో ఉన్నాను. పొగరు మోతుగా ఉన్నాను. "ఏమిటీ నీ వనేది? అది ఎలాంటి జంతువు?" అని అడిగాను. అతడు నవ్వకుండా, "సరే, చెపుతా విను. ఎర్రటోపీ పెట్టుకొన్న బల్లిలా గుంటుంది. తల మీద చతురపు టోపీతో గెద్ద రెక్కలు గల తెల్ల కుక్కలా గుంటుంది." నే నతని మాటలు నమ్మక, "ఐతే సరే కాని, వినడం కంటే దాన్ని చూడడమే మంచిది కదా! నేను వెళ్ళి చూస్తా. నా నీడను తీసుకొనియ్యి దాన్ని" అని ఆతని మాటల్లో అవిశ్వాసంతో పలికాను. ఆ ఐదవ దీపం దగ్గరకీ కంకరబాటనే వెళ్ళాను. అక్కడ నా కేమీ కనబడలేదు. కాని ఆ గ్రుడ్డివాడు తన చేతి కర్రను కంకరలో గ్రుచ్చుతూ కొండపైకి వచ్చి, "నీకు పిచ్చా. ఈ సాహసం నీ ముప్పుకేలే. నా మాటల్లో నమ్మకం లేని వానికి చెప్పి మాత్రమేమి లాభం. కొంతసేపటి వరకు దయ్యం నీ దగ్గరకు రాదు. నీవు కలుసుకోదలచిన ఆడదాని నీడ వెనక పడింది కొన్నాళ్ళ

నుంచీ, నీద్వారా ఆమెనే నేను హెచ్చరిస్తున్నా జాగ్రత్తగా ఉండమను. ఒక నిముషం కూడ ఏమరి ఉండరాదని చెప్పు" అని అన్నాడు.

# 6

"ఎందుకు నీకీ సలహా లిచ్చాడు? ఆ స్త్రీ నాకెదురగునా?" అని నే నడిగాను. నేటి సాయంత్రమే మా వాడలో ఒకామె ఆ స్త్రీని చూచింది. ఇద్దరు స్త్రీలు స్నానాలగదిలో కలుసుకొన్నారు. పింపె మంచులాగ ఉన్న చర్మం ఆవిరికి కరిగిపోతుందా అన్నట్లుంది. ఆ దేహం మీద ఎర్రసాటిన్ గౌను పచ్చటి రిబ్బన్. సాటిన్ వక్షము మీద నుంచి జారిపోతూఉంది. అది వర్షాకాలానికి తగిన గౌను. నల్లటి కాసెకోక, దాని మీద ఎర్రని త్రాడు. తలకి నీలంరంగు రిబ్బన్. వెంట్రుకలలోంచి బాగా కనబడకుండా ఉన్నా తళతళ లాడే మంచుబిందువు లాంటి చెవి. ఉబికి ఉన్న వక్షం, భుజములు. చాలా అందగత్తె. ఆ రెండో మనిషి కూడా ఆడదేమైనా ఆమె అందాని కచ్చెరువుపడి నిలిచిపోయింది. ముందుకు పోయి, వెనక్కి వచ్చి ఆమెను పరకాయించి చూచింది. ఆమె నగ్నరూపాన్ని అద్దంలో కూడ చూచింది. నాకు వర్ణించి చెప్పింది. చివరి కామె తెల్లటి శరీరంలో వక్షాని కెడుమ తట్టు క్రింద భాగంలో ఉన్న పుట్టుమచ్చ కూడ వర్ణించి చెప్పింది. ఈ మనిషినే నీవు చూడబోతూ ఉంది" అని అన్నాడు ఆ గ్రుడ్డివాడు నాతో.

శకగామీ వణకనారంభించాడు. ఆ వర్ణన అటుమళ్ళి ముఖం త్రిప్పి కూర్చున్న గ్రుడ్డి ఆడదానికే చెందుతుందా అనుకొన్నాడు శకగామీ. అదే గౌను అదే కాసెకోక ఉన్నాయి. తను కలుసుకోబోతున్న స్త్రీ కూడా సాధారణంగా ఆ రంగు గౌను ఆ రంగు కాసెకోకే ధరిస్తుంది. ఈ నాడు కూడ అవే ధరించవచ్చు. శకగామీకి వణుకుపుట్టింది. మొగంజేవురించింది.

"నేను చెప్పింది నిజమేనా? అదే గౌను, అదే నడుము పట్టీ, అదే ఎర్ర త్రాడు కావా నీ స్త్రీవి? నడుముగుడ్డా, గౌనుల కేమి కాని వక్షం మీద పుట్టుమచ్చ కూడ చెప్పిందే! నా ఎదుట యీ యోట్సుయా లోయ లోనే నగ్నంగా ఆమె విగ్రహం భయంకరంగా కన్పిస్తున్నట్లు తోచింది నాకు.

"దయ్యం ఆమె నీడని పీల్చి, త్రొక్కి, మింగాలని చూస్తూ ఉంది. జాగ్రత్తగా ఉండమని చెప్పు" అని గ్రుడ్డివాడు చెప్పుతున్నాడు కాని నే నింక వినడం లేదు. నల్లటి మేఘంలో తేలిపోతున్నా. ఇనుప కటకటాలు గాని, రాతి తలుపులు కాని నన్నడ్డలేవు. అవతలో నున్న చిన్న దాన్ని కలుసుకోడాని కెగిరిపోయాను.

ఆమెను పీల్చి పిండిచేసే దయ్యాన్ని గ్యాసులైటు కాంతిలో చూచాను. ఆమె ఇల్లు అక్కడికి దగ్గరే. వెళ్ళి ఆమెతో అన్నాడు, "రాత్రిం బవళ్ళు దయ్యం నీ వెంట తిరుగుతూ ఉంది. నీ వనారోగ్యంగా కనబడు తున్నావు. నీ నీడ అప్పుడే పలచబడింది. జాగ్రత్తగా కనిబెట్టి ఉండు."

పని భారం, మనోవేదనలవల్ల ఆ స్త్రీ అప్పుడే కృశించి ఉంది. ఆమె నడుము పట్టీ ఎంత బిగించినా వదులుగానే ఉంటూ ఉంది. అలాంటి స్త్రీకి తలమీద సుత్తి దెబ్బలు లాంటి యీ మాటలు చెప్పేను. ఇతరులకు నగ్నరూపంలో కనబడిందన్న కోపం నాలోఉంది. వారిలో. ఎవరిని కలుసుకొన్నావు, ఎవరేమి చెప్పారు అని గద్గదకంఠంతో నా కాళ్ళమీద పడి అడిగింది. నీ అంతరాత్మనే అడుగు అన్నానే కాని దారిలో గ్రుడ్డివాడు చెప్పేడని తెలప లేదు. అదే నా గొప్ప పొరపాటు. ఆమెను నీడలాగ వెంటాడుతున్న వాడు ఆ గ్రుడ్డివాడే. గ్యాసులైటులో బల్లిలాగ కన బడేదీ వాడే. ఎర్రని కళ్ళు, వివర్ణమైన ముఖం, పాలిపోయి బిరుసెక్కిన పెదవులతో వాడే దడి వెనకాల నుంచి, నూతి దగ్గర కాచి, ఆమె వెళ్ళడం

రావడం చూస్తూ ఉంటాడు. అది నే నెరుగను. నాకు చెప్పింది గ్రుడ్డి వాడేనని ఆమెకు తెలిస్తే అంత భయపడేది కాదు.

# 7

ఆ తరువాత ఆమె నరుదుగా కలుసుకొనేవాణ్ణి. నన్ను వదుల్చుకోవాలని ఆమె చూచేది ఆమెను చంపి నన్ను పొడుచు కోవాలనుకొన్నాను. కాని ఆమె ఎవ్వరినీ దరిచేర నివ్వడంలేదని ఏకాంతంలోనే ఉంటూ ఉందని తెలిసింది. చివరికి సూర్యకాంతే ఆమెకు కిట్టడంలేదు. రాత్రింబవళ్ళు తలుపులు కిటికీలు బించుకొని, మూడు తెరల వెనకాల పరుండేది. ఒకనాడు చొరబడివెళ్ళి ఆమెను చూచాను. ఆమె గొను మాసి పోయి వాసన కొట్టుతూ ఉంది. నేలవైపు చూస్తూ మోకరించి ఉంది. చిక్కిపోయి ప్రేతంలాగ కనబడింది. కళ్ళెదుటే అదృశ్యమై పోతుందా అనిపించింది. ఆమె ముఖాన్నెత్తాను. ఆమె రెండు కళ్ళూ పోయాయి. అహర్నిశం తన నీడనే చూస్తూ ఉండేదట. వంటింట్లోకి వెళ్ళిందా దయ్యం కిటికీ మీద ఉండేది. వరండాలోకి వెళ్ళిందా గడపమీదగాని, వెనుకవైపు తలుపుమీదకాని, గోడమీదకాని, తెరమీద కానిదయ్యం ఉండేది. నీడ ఎక్కడుంటే అక్కడే దెయ్యం పీల్చి, నాకి, త్రొక్కి, తుడిచి, కప్పి, కాగలించు కోడానికి సిద్ధంగా ఉండేది.

ఏకాంతిలోనైనా సరే ఆ నీడ ఎప్పుడూ ఉండేది. సూర్య చంద్రుల కాంతిలో, దీపం కాంతిలో, మంచు కాంతిలో, పువ్వుల సన్నని కాంతిలో కూడ ఆ నీడ సదా ఉండేది. నీడతోపాటు వికారం, ఆవేదన, భయం ఏహ్యాభావం వచ్చేవి. చివరికి అంధకారం ఆవరించింది. తన అరచెయ్యి తన నీడ పడనిస్థితిలో కూడ నీడ కనబడేది, ఒక్క దీపంకూడ లేక పోయినా కనబడేది.

గదిమూల, గుమ్మం పైచెక్కమీద, ఇంటి కప్పుమీద, ద్వార బంధాలమీద, నేలమీద, ఒక్క క్షణం ఇక్కడ, మరొక్షణం మరొకచోట, బల్లిలాగ నెత్తి నేదో బరువుతో, మంత్రించినట్లు, తెల్లబారిన పొడుగాటి దేహంతో, వంకర్లుపోయే కాళ్ళతో, ఒకసారి వ్రేలాడుతూ, ఒకసారి గ్రుండంగా చుట్టుకుపోతూ, ఒకసారి పొడుగునా ప్రాకుతూ కనబడేది.

అది కనబడగానే ఆమె అరిచేది. దాంతో అది చటుక్కున పారి పోయేది. మళ్ళీ ఒక నిముషంలో నెమ్మదిగా ప్రాకుకుంటూ వచ్చేది, అటుచూడకుండా ఆమె ప్రయత్నించేది. కాని కళ్ళున్నాయి కాబట్టి చూచేది. తుదకు తల వెంట్రుకలు బిగించి వెనక్కి కట్టేసి దిండుమీద తల నానించి పడుకుండి కళ్ళల్లో మందు పోసుకుంది. దాంతో కళ్ళు పోయాయి.

అంతా చీకటి. హృదయంలో కూడ చీకటే. నే నామె చేయి నా చేతితో పట్టుకొని ఆ దెయ్యం కథ కొండదారిలో ఉండే గ్రుడ్డివాడు చెప్పే దని అప్పుడు మొదటి సారిగా ఆమెకు చెప్పాను. హఠాత్తుగా కళ్ళు తెరుచుకొన్నట్లు ఆమె కంగారుపడి వెక్కి వెక్కి ఏడ్చింది, ప్రేమ ప్రయ త్నంలో విఫలుడైన గ్రుడ్డివాడామెను శాపహతను చేశాడుకదా! చేతులతో నా ముఖం పీక్కొని నేనేడ్చాను. కోపం, క్రోధం, అసహ్యం, జాలి నన్నా వరించాయి. ఆమెతోనే ఉండిపోవాలని నిశ్చయించుకొన్నాను. సూదు లతో నా రెండు కళ్ళూ గ్రుచ్చుకొన్నాను.

మా ముగ్గురి జీవితాలకి ఒక బంధమేర్పడింది. వివేకం, దానితో పశ్చాత్తాపం కలిగాయి. ప్రపంచ కోరికలనుండి విముక్తి దొరికింది. చేతి కర్రలు పట్టుకొని, మొదటివాడు కూడా మాతోనే వస్తున్నాడు. వెలుగు చూస్తే సిగ్గుపడుతూ చీకట్లోకి జారుకొంటున్నాం.

దారిలో నిన్ను చూచాం. నీ కిబ్బంది కలిగించి ఇదంతా చెప్పేను. నే చెప్పింది తీసుకో, తోసెయ్యి, నీ ఇష్టం. ఇక చెప్పవలసిందిలేదు.

వెళ్ళిపోతాం అన్నారు. దిక్కుమాలిందైనా చక్కగా ఉన్న ఆ గుడ్డి ఆడది కూడ లేచింది. కథ పొడుగూతా వెనుక తట్టున ఆమె ఆర్తనాదం ఉండనే ఉందికదా! ప్రథముడు దారి చూపుతున్నాడు. కొండ దిగారు. వాడిపోతూ ఉన్న గ్యాసులైటు మసక వెలుగులో మూడు ప్రేతాలవలె నున్నారు వాళ్ళు.

తన తెల్లని చేత్తో సిల్కుగుడ్డ కళ్ళకద్దుకొంటూ ఆ స్త్రీ లేచింది. పొగమంచులో అటూ ఇటూ ఎగిరే ఎర్రని సీతాకోకచిలుకలాగ ఆ చేతి గుడ్డ నా మనసులో ఆడుతూనే ఉంది.

---

—షిగా నోయా

# 8. హాన్ చేసిన నేరం

చైనా దేశపు గారడీవాడు హన్. గారడీ చేస్తూ పెద్ద కత్తి విసరే సరికి అతని భార్య మెడలో రక్తనాళం తెగిపోయింది. అందరూ ఆశ్చర్యపోతూ చూస్తున్నారు. ఆమె తక్షణం చనిపోయింది. అతణ్ణి వెంటనే ఖైదు చేశారు.

ఆ సమయాని కక్కడ కంపెనీ డైరక్టరు, హాన్‌కు గారడీలో సాయం చేసేవాడు, గారడీ పనులను గురించి వివరించేవాడు, కాక మూడు వందలకు పైె చిల్లర ప్రేక్షకులు ఉన్నారు. వారి వెనుక నొక పోలీసు కూడ ఉన్నాడు. ఇంత మంది చూస్తూ ఉన్నా హత్య ఉద్దేశపూర్వకమా, అకస్మిక సంభవమా అన్న విషయం సమస్యగానే ఉండిపోయింది,

హాన్ చేయబూనిన ప్రదర్శన మిది. తలుపు ఎత్తుననున్న ఒక కఱ్ఱ పలకకు ముందు తన భార్య నిలబడుతుంది. నాలుగు గజాల దూరం నుంచి పెద్దపెద్ద కత్తులు పలకమీదకు ఆమెకు చుట్టూ రెండంగుళాల దూరంలో విసురుతాడు. ఒక్కొక్క కత్తీ విసిరి ఒక్కొక్క కేకవేస్తూ ఉంటాడు.

జడ్జీగారు మొదట డైరక్టరు నడిగాడు.

"ఆ ఫీటు చాలా కష్టమయిందంటావా ?"

"కాదు, అలవాటయిన వానికంత కష్టము కాదు. కాని సరిగా చేయడానికి నరాల్లో సత్తువ, ఏకాగ్రత కావాలి."

"సరే, హఠాత్సంభవమే అనుకొన్నా. ఇది సాధారణంగా జరగ వలసిన సంఘటన కాదుకదా ?"

"అవును. ఇది అంత అనుకోనిది, అసాధారణమైనది కాకపోతే నే నలాంటి షేటు చేయించే ఉండను."

"ఉద్దేశ పూర్వకంగా చేసేడంటారా ?"

"అనను. ఎందుకంటే ఇలాంటి ప్రదర్శనం పంద్రెండడుగుల దూరం నుంచి చేసేటప్పుడు పట్టి నైపుణ్యమే గాక సమయానికి సహ జంగా స్ఫురించే తెలివికూడ కావాలి. ఈ ప్రదర్శనంలో పొరపాటు జరుగు తుందని ఎన్నడూ అనుకోలేదు. ఇప్పుడిట్లు జరగడం బట్టి పొరపాటు కవకాశం ఉందని ఒప్పుకోవలసి వస్తూఉంది."

"ఐతే ఇది పొరపాటనుకుంటావా లేక ఉద్దేశ పూర్వకమను కొంటావా ?"

"చెప్పలేను."

జడ్జీకి చిక్కు విడలేదు. హత్య జరిగింది కాని ఉద్దేశ పూర్వక మౌనో కాదో చెప్పడం కష్టంగా ఉంది. చంప వలెనుకొనే చేసి ఉంటే చాలా గడుసుగా చేశాడనుకొన్నాడు జడ్జీ.

తరువాత జడ్జీ చాలా కాలం నుంచి హాన్‌కు సహాయకుడుగా నున్న వాణ్ణి అడిగాడు.

"సాధారణంగా హాన్ దెలాంటి ప్రవర్తన ?"

"చాలా నిక్కచ్చి మనిషి. జూదం కాని, త్రాగుడు కాని, వ్యభి చారం కాని లేదు. క్రిందటేడే క్రైస్తవ మతం పుచ్చుకొన్నాడు. ఇంగ్లీషు

నేర్చుకొన్నాడు. ఖాళీ ఉన్నప్పుడు బైబిలు, మతోపన్యాసాలు వంటి గ్రంథాలే చదువుతాడు."

"అతని భార్య ఎలాంటిది ?"

"ఆమె కూడ పొరపొచ్చెంలేని మనిషి. ఊరూరా తిరిగి ప్రదర్శనా లిచ్చే వాళ్ళంత నీతి నియమాలతో ఉండరు. మీకు తెలిసిందే. హాన్ భార్య అందగత్తె. ఎంతమందో ప్రేమ చూపేవారు కాని ఎన్నడూ వాళ్ళని కన్నెత్తి చూచేది కాదు."

"ఎలాంటి స్వభావం వారిది ?"

"ఎల్లప్పుడూ నెమ్మదిగా ఉండేవాడు. స్నేహితులంటే ప్రాణ మిచ్చేవాడు. ఎన్నడూ ఎవ్వరితోనూ దెబ్బలాడి ఎరుగడు. కాని——" అనిఒక్క క్షణం ఆగి, ఆలోచించుకొని "ఒక్క సంగతి చెప్పితే హాన్‌కు హాని కలుగుతుందేమో ఐనా నిజం చెప్పెయ్యాలి కాబట్టి చెప్పేస్తున్నాను. ఇతరుల విషయంలో ఇంత మంచితనం నెమ్మదీ చూపే వీళ్ళు, ఒకళ్ళ విషయంలో ఒకళ్ళు చాలా చిత్రంగా క్రూరంగా ఉండేవారు."

"ఎందువల్ల ?"

"నాకు తెలియదు."

"నీకు వారిని తెలిసినప్పటినుండీ అలాగే ఉండేవారా ?

"కాదు. రెండేండ్ల క్రిందట హాఁసతి కడుపుతో ఉంది. తొమ్మిది నెలలూ నిండకుండానే బిడ్డ పుట్టి మూడో రోజున చనిపోయింది. దాంతో వారిద్దరికీ భేదాలు పుట్టాయి. చిన్న విషయానికి కూడ పెద్ద జగడం వేసు కొనేవారు. హాఁ ముఖం పాలిపోయేది. ప్రతిసారి జగడంలో కొంత సేపటికి హఠాత్తుగా మౌనంవహించి ఉండిపోయేవాడు. ఎప్పుడూ ఆమెను చెయ్యి చేసుకోలేదు. అది అతని నియమాలకు విరుద్ధం. కాని

కళ్ళు భయంకర కోపాన్ని కక్కేవి. అతణ్ణి అప్పుడు చూస్తే భయమేసేది. ఒక రోజున నే నడిగాను. మీ ఇద్దరికీ ఏ మాత్రం సరిపడనప్పుడు విడిపోరాదా అని. ఆమె మీద ప్రేమ నశించినా విడిపోవానికి తగిన కారణాలు లేవన్నాడు. ఆమె కూడ అతణ్ణి క్రమేణా ప్రేమించడం మానేసింది. ఇదంతా అతడే నాతో చెప్పాడు. తన హృదయంలో ఉబికే క్రౌర్యం అణచుకోడానికి, అకారణంగా భార్యను నసహ్యించుకోడం మానడానికే తాబోలు బైబిలు, మత గ్రంథాలు చదివేవాడు. ఆమె ఆటగత్తెగా అతణ్ణి చేరింది. ఇప్పుడతణ్ణి వదలి వాళ్ళూ పోతే తిరిగి పెండ్లవడం కష్టం. దేశమంతా చాలా కాలం తిరిగి వచ్చిన దాన్నెవరు నమ్ముతారు. ఇద్దరికీ సరిపడక పోయినా ఇందుకనే ఆమె కూడ అతని దగ్గరే ఉండిపోయిం దనుకుంటాను."

"ఈ హత్య గురించి నీ నిజాభిప్రాయ మేమిటి?"

"ఉద్దేశ పూర్వకమా, కాదా అనేనా మీ ప్రశ్న?"

"ఔను."

"ఇది జరిగిన నాటినుండి అనేకవిధాల దీన్ని గూర్చి ఆలోచిస్తూ ఉన్నాను. ఆలోచించిన కొద్దీ మరింత అర్థం కావడం లేదు. చాటింపులు చేయించే ఆయనతోను మాట్లాడాను. అతడు కూడ అర్థం కాలేదన్నాడు."

"సరే ఇది జరిగిన క్షణంలో నీవేమనుకొన్నావు. ఉద్దేశ పూర్వక మనుకొన్నావా? లేక పొరపాటను కొన్నావా?"

"ఔనండి. ఆమెను చంపేశాడనే అనుకొన్నాను."

"వారిద్దరి మధ్యా జగడాలు నీకు తెలిసినట్లు చాటింపు చేసే ఆయనకు తెలియవుకదా."

"కావచ్చు. కాని తరువాత నేను కూడ అనుకొన్నాడు. నాకు వారి జగడాలు తెలుసు కాబట్టి చంపేశాడని అనుకొన్నానా అని."

"ఇది జరగగానే హాన్ ఎలాగున్నాడు?"

"హా, అని అరచాడు. ఆ కేక విని తలెత్తి చూచేసరికి అతని భార్య నోట్లోంచి రక్తం కాలవగట్టి ప్రవహిస్తూఉంది. కొన్ని క్షణాలు మాత్రమే నిలబడిఉంది. తరువాత మోకాళ్ళు ముడుచుకుపోయి ముందుకు తూలిపోయింది. మెడమీదనున్న కత్తి నేలమీద పడిపోయింది. ఆమెకూడ నేలమీద కుప్పగా కూలిపోయింది. మేమెవ్వరం మాత్ర మేమి చేయగలం, చూస్తూ గడ్డకట్టి పోయాం. హాన్ ఏవిధంగా ఉన్నాడో చెప్పలేను. అతని వైపు నేను చూడలేదు. చివరకు హాన్ భార్యను చంపే శాడన్న భావం నా మనస్సులోకి వచ్చినప్పు డతని వైపు చూచాను. కళ్ళు మూసుకొని ఉన్నాయి. చచ్చిన వానికివలె అతని ముఖం తెల్లబారి పోయింది. రంగస్థలాధి కారి తెరదింపించేశాడు. ఆమె దేహం ఎత్తే సరికి చచ్చిఉంది. మోకాళ్ళపైబడి హాన్ చాలాసేపు నిశ్శబ్దంగా ప్రార్థన చేశాడు.

"చాలా మారిపోయినట్లగ పడ్డాడా?"

"ఔనండి, చాలా క్రుంగిపోయాడు."

"సరే, ఇంకేమన్నా నిన్నడగవలసి వుంటే పిలుస్తాను. వెళ్లు."

జడ్జీ హాన్‌ను పిలిచాడు. తెలివితేటలున్న హాన్ ముఖం దిగాలుపడి వివర్ణంగా ఉంది. నరముల సత్తువ బొత్తిగా తప్పి, అలసిపోయి యున్నాడని స్పష్టమౌతూంది. బోనులో కెక్కిన హాన్‌తో జడ్జీ, "అప్పుడే డైరక్టర్ని, నీ అసిస్టెంటును పరీక్షించాను. నిన్నిప్పుడు ప్రశ్నించవలసి ఉంది" అన్నాడు. హాన్ తలవంచాడు విధేయతా సూచకంగా.

"నీ వెప్పుడైనా నీ భార్యను ప్రేమించావేమో చెప్పు."

"మా పెండ్లినాటినుంచి బిడ్డ పుట్టేవరకు మనస్సాక్షిగా ప్రేమించాను."

"బిడ్డ పుట్టుకతో ఎందుకు మార్పు వచ్చింది?"

"ఆ బిడ్డ నాది కాదని తెలియడం వల్ల."

"ఎవరి బిడ్డో తెలుసా?"

"నా భార్య మేనత్త కొడుకు."

"అతణ్ణి నీకు తెలుసా?"

"నాకు బాగా స్నేహితుడు. మమ్మల్ని పెళ్ళిచేసుకోమని చెప్పి నన్ను ప్రోత్సాహించింది అతదే"

"వారిద్దరి స్నేహాలు నీ పెండ్లికి ముందే జరిగి ఉంటాయను కొంటాను."

"ఔను. మేము పెండ్లాడిన ఎనిమిది నెలలకు బిడ్డ పుట్టింది."

"మీ అసిస్టెంటు నెలలునిండే ముందుపుట్టిందని మాత్రమన్నాడు."

"ఔను, అలాగే నే నందరికి చెప్పాను."

"అంత త్వరగా బిడ్డ చనిపోయిందెందువల్ల?"

"తల్లే బిడ్డని తన వక్షాని కానించి ఊపిరాడ నివ్వలేదు."

"ఆ పని చెయ్యాలనే చేసిందా నీ భార్య?"

"ఆమె నాతో ఆకస్మిక సంభవమంది."

జడ్జి మౌనంగా హన్ ముఖం తేరిపార చూశాడు. హన్ తలెత్తి తరువాత ప్రశ్నకు ఎదురుచూస్తున్నాడు. చూపు మాత్రం నేలమీదే ఉంది.

"తనకూ తన మేనత్త కుమారునికి గల సంబంధం నీ భార్య ఒప్పుకొందా?"

"ఆమె చెప్పనూలేదు, నే నెన్నడూ అడుగనూలేదు. అన్నింటికీ తగిన శిక్షలాగగపడింది బిడ్డ మృత్యువు. నేను ఉదారంగా ప్రవర్తించాలని అనుకొన్నాను కాని—"

"కాని చివరకు ప్రవర్తింపలేక పోయావు."

"ఔను. బిడ్డ చావు తగినంత శిక్ష కాదనుకొన్నాను. ఒక్కడినే ఉన్నప్పుడు శాంతంగా వితర్కించుకొనే వాడిని కాని ఆమెను చూడగానే మనస్సులో ఏదో దుమారం లేచేది. ఆమె శరీరం కనబడేటప్పటికే నాలో కోపం పొడుచుకొచ్చేది.

"విడాకు లివ్వాలనిపించ లేదా?"

"చాలసార్లు అనుకొన్నాను కాని నా భార్యతో చెప్పలేదు. నేను వది లేస్తే బ్రదికేది లేదని నా భార్య అనేది."

"నిన్ను ప్రేమించిందా?"

"ప్రేమించలేదు."

"మరెందు కలాగంది?"

"జీవనాధారాన్ని గూర్చి అని ఉంటుంది. వాళ్ళ పెద్దన్న, వారి ఇల్లు నాశనం చేశాడు. సర్కసులో తిరిగే వాడి భార్యగా ఉండేదాన్నెవరు పెండ్లాడతారు? ఏదన్నా పనిచేసుకుంటుందా అంటే ఆమె పాదాలు చాలా చిన్నవి."

"మీ శారీరిక సంబంధ మెట్టిది?"

"చాలామంది భార్యాభర్తలకు వంటిదే."

''నీ భార్యకు నిజంగా నీ మీద మక్కువ ఉందా?''

"నిజంగా ఇష్ట ముందనుకోను. నాకు భార్యగా ఉండటం కష్టంగానే ఉంటుంటుంది. కాని ఓర్చుకొనేది. మగవాడూహింపలేనంత ఓరిమి చూపేది. నా జీవితం క్రమంగా పాడయిపోతూఉంటే నిర్దయతో చూసేది. మంచి జీవితం కోసం నేను కొట్టుకొంటూ ఉంటే ఆమె ఎప్పుడూ కాస్త సానుభూతి కూడ చూపలేదు.''

"ఏదో ఒకటి విశ్చయం చేసుకోలేక పోయావా?''

"నా మనస్సు నిండా ఆదర్శాలుండేవి.''

''ఏమిటా ఆదర్శాలు?''

''ఆమెయెడ నేను తప్పులేకుండా ప్రవర్తించాలని కాని చివరకు సాగిందికాదు.''

''చంపాలని ఎన్నడూ అనుకోలేదా?''

హన్ మాట్లాడలేదు, జడ్జీ తిరిగి అడిగాడు. చాలాసేపు ఆగి హన్ అన్నాడు.''చంపాలనే భావం పుట్టే ముందు చాలాసార్లు అదే చచ్చిపోతే బాగుండునని అనుకొనేవాణ్ణి."

"సరే, శాసనానికి విరుద్ధం కాకపోతే చంపే ఉందువుకదా?

''శాసనం గూర్చి నేనెన్నడూ ఆలోచించలేదు. దానికి భయపడి ఆగనూలేదు. నేనెందుకో ఈ విషయంలో బలహీనుణ్ణి అనుకొనేవాణ్ణి. సజ్జనుడుగా బ్రతకాలని మాత్రం అమితకాంక్ష ఉండేది.

''ఐనా తరువాత చంపాలనుకొన్నావు కదా?"

''చంపాలని నే నెన్నడూ నిశ్చయం చేసుకోలేదు. ఒకసారి మాత్రం అనుకొన్న మాట నిజం.''

"ఆమె చావుకు ముందెంత కాలం క్రితం?"

"ఆ ముందు రాత్రో లేక ఆ ఉదయమో."

"మీరప్పుడు దెబ్బలాడుకొంటూ ఉన్నారా?"

"ఔను."

"ఎందుకోసం?"

"ఏదో చాలా చిన్న విషయాన్ని గూర్చి."

"ఆ విషయమేమిటో జ్ఞాపకంతెచ్చుకో."

"భోజనాన్ని గూర్చి. సమయానికి భోజనం తయారు కాకపోవడం వల్ల కోపం వచ్చింది. ఆ సాయత్రం నా భార్య సోమరిగా కాలం గడపి వంట చేసింది కాదు సమయానికి. నాకు చాలా కోపం వచ్చింది."

"మామూలు కంటే ఎక్కువ కోపంగా ఉన్నావా?"

కాదు. కాని తరువాత కోపం ఇంకా పెరిగింది. మామూలుగా ఇలా ఉండేదికాదు. కొన్నాళ్ళనుండి జీవితాన్ని సరిదిద్దుకోడం కోసం తాపత్రయ పడుతున్నాను. దిద్దుకోలేకున్నాను. పరుంటే నిద్రపట్టదు. మనస్సు గందరగోళం పరచే ఆలోచనలతో నిండిపోయేది. నాకేమనిపించిందంటే, ఎంత కొట్టుకొన్నా నేను జీవితాన్ని బాగుపరచు కోలేకున్నాను. నా ప్రస్తుత జీవితంలో చెలరేగుతున్న క్రోధాలు చల్లారడం లేదు. ఈ దుఃఖస్థితి, అసహాయ స్థితి పెండ్లివల్లనే కదా కలిగింది. చీకటినుండి నన్ను తప్పించే కాంతికిరణం కోసం తలకొట్టుకొని ప్రయత్నించాను. చివరికా కోరిక కూడ అణగారిపోయింది. కాని ఇంకా బయటపడే ఆశ మినుకు మినుకుమంటూ ఉంది. ఆ ఆశే నశిస్తే నేనూ చచ్చిన వానితో సమానమే అనుకొన్నాను.

నాటినుంచి చెడ్డ ఆలోచన మనస్సులో మెదలసాగింది. "ఆమె చచ్చిపోతే బాగుండును. నే నెందుకు చంపకూడదు?" అని. నేరంవల్ల వచ్చే శిక్షను గూర్చి నేను తలపోయనేలేదు. జైలుకు తప్పక వెళతాను. కాని జైలులో జీవితంఇంతకంటే అధ్వాన్నంగా ఉంటుందా! ఇంకొంచెం మేలుగానే ఉండవచ్చు. కాని చంపితే సమస్య తీరదనే భావం ఎందువల్లో కలిగింది. ఆత్మహత్యలాంటిది. సమస్యను తప్పుకు తిరగడమే ఔతుంది. ఏ దినం బాధ ఆదినం నేననుభవిస్తూ ఉండవలసిందే కాని తప్పుడు తిరగడానికి మార్గంలేదు. బాధ ననుభవించడమే నా యథార్థ జీవితమై పోయింది.

ఈ విధంగా నా మనస్సు పరుగెత్తుతూ ఉండే నా బాధకు కారణం నా ప్రక్కనే ఉన్నదన్న మాట మరిచిపోయాను. నిద్ర పట్టక పూర్తిగా అలసిపోయి పడిఉన్నాను. నా మతే పోయినట్లుంది. మనస్సు ఱంపపు కోత ననుభవించి మొద్దుబారి పోయింది. భార్యను చంపాలన్న భావం క్రమంగా మాయమైంది. పీడకల పోయిన తరువాత ఉండే దిగులు, శూన్య స్థితి పొందాను. మంచి జీవితంకోసం నా నిశ్చితాలన్నీ జ్ఞాపకాని కొచ్చాయి. అవి సాధించలేని బలహీనుణ్ణి అని తెలుసుకొన్నాను. తెల్లారింది. నా భార్యకూడ నిద్రపోలేదని గ్రహించాను.

"లేచాక ఇద్దరూ మామూలుగానే సంచరించారా."

"ఒకరితో ఒకరం ఒక్కమాట కూడ మాట్లాడుకోలేదు."

"ఇంతవరకూ వచ్చాక ఎందుకామెను వదిలెయ్యాలనుకోలేదు?."

"అందువల్ల నా చిక్కులు తీరుతాయనుకోమంటారా? లేదు. అది కూడ సమస్యను తప్పించుకు తిరగడమే ఔతుంది. నా పక్షమున తప్పు లేకుండా, నా భార్య యెడల ప్రవర్తించాలని నిశ్చయించుకొన్నానని. చెప్పానుకదా!"

జడ్జివైపు హన్ దీక్షగా చూచాడు. సరే. చెప్పు ఉన్నట్లు జడ్జీ తల ఊపాడు.

మరునాడు నా ఒళ్ళు చితకపొడిచినట్లయి పోయింది. నా నరాలు తుత్తునియలై పోయాయి. ఊరికే ఉండటం బాధగాఉంది. బట్టలు వేసుకొని బయటికి పోయి పిచ్చివాడిలాగ ఊరిలో నిర్మానుష్య ప్రదేశాల్లో తిరిగాను. జీవిత సమస్య పరిష్కారం చెయ్యాలి అనే తలంపు నన్ను వదలలేదు. కాని చంపే ఉద్దేశం మరి కలుగలేదు. క్రితం రాత్రి చంపా లనుకొన్నానంతే. నిశ్చయానికి వచ్చానా? అనుకోడానికి-నిశ్చయానికి మధ్య ఒక సముద్రముంది. ఆ సాయంత్రపు గారడీ ఆటనుగూర్చి కూడా నేనే మాత్రం ఆలోచించ లేదు. అనుకొనే ఉంటే ఆ కత్తి వేటుల ప్రదర్శనం మానేసేఉందును. దాని బదులు చేయడానికి ఎన్నెన్నో ఫీటు లున్నాయి.

సాయంత్రం రంగం మీదకు వంతువచ్చింది. మామూలు కంటే యేమైనా విశేషం జరుగబోతుందని నాకు పిసరంతైనా అనుమానం తట్ట లేదు. మామూలు ప్రకారం నా కత్తుల వాడితనం ప్రేక్షకులకు కాగితాలు కోసి, నేల బల్లలమీద కొట్టి చూపించాను. బరువైన చైనా దుస్తులు ధరించి నా భార్య రంగం మీదకు వచ్చి ప్రేక్షకుల్ని మనోహరమైన నవ్వుతో అభినందించి, బల్లకు ముందుగా నిలబడింది. నేనొక కత్తి తీసు కొని మామూలు దూరంలో నిలబడ్డాను. కడచిన రోజు సాయంత్రం తరు వాత అప్పుడే మా కళ్ళు మొదటిసారి కలుసుకోవడం. నాడు ఆ ఫీటు చేయబోవడం అపాయకరమని తక్షణం నాకుతోచింది. నరాల్ని వశంలో పెట్టుకోవాలి. నీరసత నా ఎముకలలోని మూలుగులోనికి కూడ ప్రాకి పోయింది. ఇంక నరాలేమివశంలో ఉంటాయి? నా చేతిని నేను నమ్మ లేననిపించింది. నన్ను నేను సమాధాన పరచుకోవాలని కాస్సేపు కళ్ళు మూసుకొన్నాను. నా వళ్ళంతా వణుకుతున్నట్లు తోచింది.

షైము అయిపోయింది. ఆమె తలవైపు మొదటి కత్తిని విసిరాను. మామూలుకంటే ఒక అంగుళం పైకి వెళ్ళింది. నా భార్య చేతు లెత్తింది. ఆమె రెండు చేతుల క్రిందికి రెండు కత్తులు విసిరాను. మొదటి కత్తి నా వ్రేళ్ళను వదిలే సరికి ఏదో వెనక్కి లాగేస్తూ ఉన్నట్లు అనిపించింది. ఇంక కత్తుల లక్ష్యాలు నిర్ణయించుకోలేక పోతున్నాను. అనుకొన్న చోట కత్తి గ్రుచ్చుకున్నదంటే అదృష్ట వశాత్తు అయిందన్నమాట.

ఒక కత్తి నా భార్య మెడకు ఎడమ వైపుకు విసిరాను. రెండవది విసరబోయే సరికి ఆమె కళ్ళల్లో ఒక విచిత్రమైన చూపు చూచాను. ఆమె నప్పుడే భయభూతం ఆవహించినట్లగపడింది. నా కత్తి క్షణాలలో ఎగిరి వచ్చి తన మెడ కోసేస్తుందని ఆమెకు ముందుగానే తోచిందా ? మూర్ఛలో పడిపోతున్నట్లు నా తల దిమ్మెక్కింది. చేతిలోని కత్తిని బల వంతంగా గాలిలోకి ఎక్కడికో గురిపెట్టి విసిరాను—''

జాగ్రత్తగా అతణ్ణి తిలకిస్తూ జడ్జీ మౌనం వహించాడు. "చంపేశాను" అన్నభావం హఠాత్తుగా నాకు కల్గింది అని హోఁ మాట తుంచేసినట్లు చెప్పాడు.

"ఉద్దేశ పూర్వకంగా అనా నీ భావం ?''

"ఔను. ఉద్దేశ పూర్వకంగా చేశాననే అనిపించింది హఠాత్తుగా.''

"తరువాత నీ భార్య శవం ప్రక్క మోకరించి ప్రార్థన చేశావట గదా ?"

"ఔను. అప్పటి కప్పుడు నాకు తోచిన జిత్తు అది. ప్రతి వాళ్ళూ నన్ను క్రైస్తవ మత విశ్వాసినని యెరుగుదురు. ప్రార్థిస్తున్నట్లు నటిస్తూ ఇప్పుడిక దారి ఏమిటా అని ఆలోచిస్తున్నాను."

"ఐతే ఉద్దేశ పూర్వకంగా చేసేననే నీ నిశ్చితాభిప్రాయమా ?"

"ఔను. కాని నే చేసింది హఠాత్సంభవమేనని అందర్నీ నమ్మించవచ్చని తోచింది."

"ఉద్దేశ పూర్వకంగా చేశానని ఎందు కనుకొన్నావు?''

"ఇతమిద్ధని నిర్ణయించే జ్ఞానం నశించి అలాగనుకొన్నాను.''

"హఠాత్సంభవమని నమ్మింపగలనని తలంచావా?"

"ఔను. కాని దీనిని గూర్చి తరువాత ఆలోచించే సరికి నాకే సిగ్గు వేసింది. దుఃఖిస్తూ ఉన్నట్లు నా చేతనైనంత వరకూ నటించాను. తెలివైన వాడెవడైనా అక్కడుంటే నేను నటిస్తున్నానని కనిపెట్టగలడు. "సాయంత్రానికి నన్ను వదిలేస్తారు. హంతకుణ్ణిగా ఋజువు చేసేదేమీ లేదు అని నాలో నచ్చచెప్పుకున్నాను. నా భార్యకు నాకూ చెడిందని అందరకూ తెలుసు కాని ఇది హఠాత్సంభవమని నేను గట్టిగా ఉంటే కాదని ఋజువుచేయగల వారెవరు? జరిగిందంతా మననం చేసుకొన్నాను. హఠాత్సంభవమేనని సులభంగా నచ్చ చెప్పవచ్చునని గ్రహించాను. అందులో ఒక విచిత్ర ప్రశ్న నాకే తట్టింది. ఇది హఠాత్సంభవం కాదని నేనే ఎందుకు అనుకుంటున్నాను. ముందు రాత్రి చంపాలను కొన్నాను. దాన్ని బట్టి ఇప్పుడు జరిగింది ఉద్దేశ పూర్వకము కాకూడదా? చివరకు జరిగిందేమిటో నాకే తెలియదు అన్న స్థితికి వచ్చాను. దాంతో మనస్సుకు శాంతి కలిగింది. గొప్ప ఆనందం కూడా కలిగింది. గట్టిగా అరిచేద్దా మనిపించింది.

"హఠాత్సంభవమని అనుకోగలిగావు కాబట్టా?''

"కాదు. ఉద్దేశ పూర్వకమో కాదో నా కేమీ తెలియడం లేదు. శిక్ష తప్పించుకోడానికి నా మనస్సులో ఉన్నదంతా స్పష్టంగా చెప్పేయడమే మార్గమనుకొన్నాను. హఠాత్సంభవమని చెప్పి మిమ్మల్నీ నన్ను

మోసగించడంమాని దైవముఖం చూచి, ఏమి జరిగిందో నాకు తెలియదు అని నిజం చెప్పేద్దామనిపించింది. చేయి పట్టు తప్పించనీ చెప్పలేను, ఉద్దేశపూర్వకమని ఒప్పుకోనూ లేను. నిజానికి నేరం చేసేనని గాని, చెయ్యలేదనిగాని ఏమి చెప్పలేను."

హాజ మౌనంగా ఉండిపోయాడు. చాలా సేపు జడ్జీ కూడ మౌనంగా ఉన్నాడు. అప్పుడు జడ్జీ నెమ్మదిగా ఆలోచిస్తూ అన్నాడు, "నీవు చెప్పింది నిజమని నేను నమ్ముతున్నాను. కాని ఇంకో ప్రశ్న. నీ భార్య చావుకి నీకు కాస్తయైనా విచారం లేదా ?"

"నా కేమీ లేదు. ఇదివరలో ఆమె నమితంగా ద్వేషించే రోజుల్లో కూడ ఆమె మరణం గూర్చి మాట్లాడడం నా కెంత సంతోష ప్రదంగా ఉంటుందనుకో లేదు."

"సరే. బోనుదిగవచ్చు" అన్నాడు జడ్జీ.

తలవంచి నిశ్శబ్దంగా కోర్టులోంచి వెళ్ళిపోయాడు హాజ. విచిత్ర భావావేశంతో కలం అందుకొన్నాడు జడ్జి. తన ముందున్న కేసుకు సంబంధించిన కాగితాల మీద "నిర్దోషి" అని వ్రాశాడు.